# విషయసూచిక

# శాతవాహన యుగం

నేటివరకు జరిగిన చరిత్ర పరిశోధకుల కృషి ఫలితంగా ఆంధ్రుల చరిత్రను ఒక వరుసక్రమంలో తెలుసుకొనుట సాధ్యమవుతూన్నది. ఇంకా పరిశోధన చేయవలసిన విషయాలను ఎన్నో వున్నాయి. భూగర్భ పరిశోధకులు సరికొత్త విషయాలు వెలువరిస్తూన్నారు. గౌతమబుద్ధుని కాలంనుండి అనగా క్రీ. పూ. 550 నుండి ఆంధ్రదేశంమీదుగా బౌద్ధభిక్షువులు సింహళదేశం ప్రయాణాలు చేస్తుండేవారు. ఆంధ్ర ప్రాంతాలకు సంబంధించిన అనేక గాథలు బౌద్ధమత గ్రంథాలలో వున్నాయి. ఇవన్నీ ఎక్కువభాగం పాళి భాషలో వ్రాయబడి టిబెట్‌లోని బౌద్ధమత పీఠాలలో నిక్షేపించబడ్డాయి. వీటిని పరిశోధింపవలసిన అవసరం ఎంతైనా వుంది.

'ఆంధ్ర' అను పదము అతి ప్రాచీన గ్రంథాలలో సైతంవుంది. క్రీ. పూ. 1000 సంవత్సరాలకు పూర్వమే రచించబడ్డ రామాయణ, భారత, గ్రంథాలలో అనేక సందర్భాలలో ఆంధ్రుల ప్రశంస వుంది. మహాభారత యుద్ధంలో ఆంధ్రులు కౌరవులపక్షం వహించారట. ఈ గ్రంథాలకన్నా ప్రాచీనమైన ఐతరేయ బ్రాహ్మణము అను గ్రంథములో మొట్టమొదటిసారిగా 'ఆంధ్ర శబ్ద ప్రయోగం కనబడుతున్నది. పై వాటిలోను ఆంధ్రులు, ఒక ప్రత్యేక తెగ లేక జాతిగా

వర్ణించబడ్డారు. నేటికి సుమారు 4000 సంవత్సరాల క్రితంనుండి 'ఆంధ్రులు' అను ఒక తెగ మనదేశంలో నివసిస్తూ వుండేవారని రూఢిగా చెప్పవచ్చు.

## నివాసస్థలం:

పై గ్రంథాలన్నిటిలోను ఆంధ్రులు దక్షిణాపథంలో సంచరించే వారని, వింధ్య ప్రాంతంలో నివసిస్తూండేవారని వర్ణించబడ్డారు. ప్రస్తుత మధ్యప్రదేశ్ రాష్ట్రంలోను, మహారాష్ట్ర ప్రాంతంలోను, నర్మదా – తపతీనదీతీర ప్రాంతాలకు, దక్కను పీఠభూమికి మధ్యగల కొద్దిపాటి సారవంతమయిన ప్రాంతాలు మొదటిలో వీరికి ఆట పట్టుగా వుండేవి. వీరికి తూర్పుగా కళింగులు, పశ్చిమంగా అశ్మకులు నివసిస్తూండేవారు. కళింగులు ప్రస్తుత ఒరిస్సాప్రాంతంలో పూర్వంనుండి వున్నారు. పై వర్ణనలను సమన్వయం చేసిచూస్తే ఒక విషయం తేలుతుంది. వింధ్య పర్వతాలకు దక్షిణభాగాన మహానది, తపతీ, నర్మదా – నదీతీరాలలో కళింగ, ఆంధ్ర, అశ్మక తెగలవారు నివసిస్తుండేవారు. 'సిరివణిజ జాతక'మను బౌద్ధకథలో తెలివాహా నదీతీరంలో అంధకపురం వున్నది అని వర్ణించబడ్డది.

ఒరిస్సాలోని మహానదికి తిలింగిరి అను ఉపనది ఉన్నది. దీనినే తెలివాహా అని ప్రాచీనులు పిలిచారు. అంధక ఆంధ్రపదాలు పర్యాయ పదాలుగా ప్రాచీన గ్రంథాలన్నింటిలోనూ ముఖ్యంగా బౌద్ధ జాతకకథలలోనూ వాడబడ్డాయి. కనుక తెలివాహా తీరంలోని అంధకపురం శిథిలమైపోయిన ఆంధ్రనగరాలలో ఒకటి అని చెప్పటం అతిశయోక్తి కాదు.

## ఆంధ్రులకు సంబంధించిన కథలు:

ఆంధ్ర శబ్ద పుట్టుకను గురించి, ఆంధ్రుల పుర్వోత్తరాలను గురించి, పురాణగ్రంథాలలోను, బౌద్ధ జాతక కథలలోను ఒక్కొక్క

దానిలో ఒక్కొక్క రకంగా కథలు అల్లబడ్డాయి. విశ్వామిత్రఋషి సంతానంలో, తండ్రిని ధిక్కరించిన కొడుకుల్లందరూ దక్షిణదేశానికి తరలి వచ్చారని వారు ఆంధ్రులకు పూర్వీకులని ఒకకథ. బలిచక్రవర్తికి అంగ, వంగ, కళింగ, సుహ్మ, పుండ్ర, అంధ్రులను కుమారులు కలిగి వారంతా ఒక్కొక్క తెగకు ప్రారంభకులైనారని మరొక కథ. ఈ కథలలోని కల్పనలు, అతిశయోక్తులు వదలివేస్తే ఒక విషయం బోధపడుతుంది. ఆంధ్రులు ఎన్నో వేల సంవత్సరాలక్రితం వింధ్యపర్వతాన్ని దాటి దక్షిణాపథంలో ప్రవేశించారు. వీరు మొదటినుండి ఒక తెగగా వుండేవారు. కొన్ని ప్రత్యేకమైన అలవాట్లు, ఒక భాషా విభాగము వీరికి వుండేవి. దక్షిణదేశంవచ్చి క్రొత్త ప్రాంతంలో నివసించ ప్రారంభించిన మీదట ఈ ప్రత్యేక స్వభావాలు మరింత పెంపొందాయి.

## మెగాస్తనీసు పొగడ్త:

క్రీ. పూ. 322 లో మౌర్యచంద్రగుప్తుడు మగధ సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. ఆకాలంలో మెగాస్తనీసు అను గ్రీకు చరిత్రకారుడు భారతదేశంవచ్చి, వివిధరాష్ట్రాలు తిరిగి తన యాత్రా విశేషాలను వర్ణించాడు. మనకు లభించినంతవరకు మెగాస్తనీసు వ్రాతలు మొట్టమొదటి చారిత్రకాధారాలు. ఆంధ్రులను గురించి మెగాస్తనీసు ఇలా వ్రాశాడు:

"వీరికి 30 నగరాలున్నాయి. వీరి రాజుకు 10 వేల పదాతి సైన్యం, 2 వేల రౌతులు, వేయి ఏనుగులు కల బలమైనసైన్యం వుంది. అదే కాలంలో కళింగరాజులకు 60 వేల పదాతిసైన్యము, వేయిమంది గుఱ్ఱపు రౌతులు, 200 ఏనుగులు వుండేవి." ఈ నగరాల పేర్లను నేడు స్పష్టంగా చెప్పటం కష్టం. 'పిథుండ' అను నగరము నేటి తెలంగాణా ప్రాంతములో ఉండేదని తెలుస్తున్నది. ఒకానొక యుద్ధంలో ఈ నగరాన్ని కళింగరాజగు

ఖారవేలుడు, పూర్తిగా ధ్వంసం చేసినట్లు ఖారవేలుని హాథి గుంపా శాసనమువల్ల తెలియుచున్నది. ఈ నగరంకాక, శాతవాహన రాజుల రాజధానియైన ప్రతిష్ఠానపురం, మరొక ప్రధాననగరమైన ధాన్యకటకం వున్నవి. ఈమధ్యనే తెలంగాణా ప్రాంతంలో కొండాపురం, గాజులబండ, పణిగిరులలో కొన్ని ప్రాచీన నగరశిథిలాలను భూగర్భ పరిశోధకులు త్రవ్వి తీస్తున్నారు. ఇవి కాక నామరూపాలు లేకుండా పోయిన అనేక నగరాలుకూడా వుండి వుండవచ్చును.

## శాతవాహన రాజులు

ఆంధ్రదేశాన్ని మొట్టమొదట పరిపాలించిన రాజులు శాతవాహనులు. వీరినే సాతవాహనులని శాతకర్ణి రాజులని కూడా చరిత్రకారులు వాడుతారు. ఇవన్నీ ఒకే రాజవంశాన్ని తెలియజేసే పర్యాయపదాలు.

ఈ రాజులు క్రీ॥ పూ॥ 220 నుండి క్రీ॥ శ॥ 218 వరకూ అనగా 400 సం॥ లకు పైగా ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. ఈ వంశంలో మొత్తం 30 మంది రాజులున్నారు. మొదట వీరికి మహారాష్ట్ర దేశంలోని 'పైఠాన్', (ప్రతిష్ఠానపురం) రాజధానిగావుండేది. వీరి రాజ్యం మహారాష్ట్రంలో ప్రారంభమై ప్రస్తుత హైద్రాబాదు సంస్థానముగుండా, కృష్ణా - గోదావరీతీర ప్రాంతం వరకూ వ్యాపించింది.

వీరిలో చరిత్ర ప్రసిద్ధికెక్కిన వారనేకులున్నారు. వంశ ప్రారంభం చేసిన యోధుడు (శ్రీముఖుడు) అనేక యుద్ధాలు చేసి రాజ్యాన్ని స్థాపించాడు. చుట్టుప్రక్కల శత్రురాజులతో నిరంతరం ఘర్షణ పడుతూనే, ఒకకొత్త రాజవంశానికి ప్రారంభం చేసినవాడు శ్రీముఖుడు. ఈతని తర్వాత రాజ్యానికివచ్చిన రాజుల కాలంలో ఒక్కొక్కపుడు రాజ్య విస్తీర్ణం హెచ్చుచూ, తగ్గుతూవున్నా మొత్తంమీద రాజ్యం నిలిచింది. 11 వ రాజైన కుంతల శాతకర్ణి

ప్రసిద్ధుడు. ఈతడు మగధరాజ్యంవరకు ఆంధ్రరాజ్యాన్ని విస్తరింప చేశాడు.

14 వ రాజైన హాలుడు, ప్రతిష్ఠానపురం రాజధానిగా చేసుకొని దక్షిణా పథాన్ని అంతా జయించాడు. సింహళదేశంమీద దండెత్తి ఆ రాజును కూడా ఓడించాడు.

హాలుడు సప్తగోదావరి వద్దనున్న ద్రాక్షారామ భీమేశ్వరుని ఆలయానికి వచ్చి అక్కడ లీలావతి అనే సింహళ రాజపుత్రికను వివాహం చేసుకున్నట్లు లీలావతి కావ్యం తెలియజేస్తున్నది. ఇంతే కాదు, ప్రాకృత భాషకు హాలుడు విశేషాదరం చూపించాడు. కవులను, కవయిత్రులను ప్రోత్సహించాడు. ఇతని ఆస్థానం నిరంతరం కవి పండిత గోష్ఠితో నిండివుండేది. ఈ కవులను ప్రోత్సహించి, శాలివాహన గాథాసప్తశతి అనే ఒక గ్రంథరచనకు కారణ భూతుడైనాడు. ఇందులో కొన్ని భాగాలను హాలుడు స్వయంగా రచించాడు. నాటి సాంఘికజీవితాన్ని తెలుసుకోడానికి ఇంతకంటె మంచి ఆధారం లేదు.



## గౌతమీపుత్ర శాతకర్ణి:

శాతవాహనరాజు లందరిలోకి అతి ప్రసిద్ధి చెందినవాడు గౌతమీపుత్ర శాతకర్ణి. ఈ రాజు శిలావిగ్రహము, నాణెములు, శాసనాలు, అమరావతిలో కూడా కనుపిస్తున్నవి.

అమరావతి వద్ద ధాన్యకటకం రాజధానిగా పరిపాలించిన రాజులలో గౌతమీ పుత్ర శాతకర్ణి ప్రథముడు. క్రీ. శ. 78_102 సంవత్సరాల మధ్యకాలంలో గౌతమీపుత్రుడు ధాన్యకటకం రాజధానిగా దక్షిణపథాన్నంతా పరిపాలించాడు. శాతవాహన రాజులు మహారాష్ట్ర ప్రాంతాన్ని వదలి ఆంధ్ర ప్రాంతానికి చేరుకున్నారు. వీరితోపాటు ఆంధ్రులందరూ తెలుగుదేశం చేరుకున్నారు. ఈ మహా

ప్రస్థానానికి నాయకత్వం వహించింది గౌతమీపుత్రుడు. ఈతని తర్వాత సుమారు 10 మంది శాతవాహన రాజులు నూరు సంవత్సరాలకు పైగా ధాన్యకటకం రాజధానిగా ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. శాతవాహనుల ప్రధాన కేంద్రం పైఠాన్. గుణాఢ్యుడు బృహత్కథలో ప్రతిష్టాన నగరాన్ని వర్ణించాడు. హాలుని గాథాసప్తశతి ప్రతిష్టాన రాజసభా భవనంలో కూర్చబడ్డది. ఈ 300 సంవత్సరాలు, శాతవాహన రాజులు ఉత్తర మహారాష్ట్రంలోని రఠికులితోను, కన్నడదేశంలోని అభీరులతోను, గుజరాతులోని శకపహ్లావులతోను, నిరంతర యుద్ధాలు జరుపుతుండేవారు. అనేక సందర్భాలలో, ప్రతిష్టాన నగరాన్ని కోల్పోయినారు. తిరిగి కష్టంమీద సంపాదించుకున్నారు. మగధరాజ్యాన్ని పరిపాలించిన శుంగ, కణ్వ వంశరాజులకు ఆంధ్రరాజులకు నిరంతర యుద్ధాలు సాగుతూవుండేవి. ఒకరిద్దరు ఆంధ్ర రాజులు మగధరాజులు నోడించి కొంతకాలం ఆ రాజ్యాన్ని పరిపాలించారు. క్రీ. పూ. 28 నుండి క్రీ. శ. 78 వరకు సుమారు 100 సంవత్సరములు మగధరాజ్యం, ఆంధ్రరాజుల సామంత నగరంగా వున్నది. శాతవాహన రాజుల నాణెములు, అలహాబాదు, పాట్నా నగరాలవద్ద బయల్పడినవి.

మహారాష్ట్రప్రాంతం కొండప్రాంతం. మెట్టపంటలుమాత్రమే పండుతాయి. జనసంఖ్య వృద్ధిఅవుతున్నకొద్దీ కొండప్రాంతాలనువదలి నదీ తీరాలకు ప్రజలు తరలిపోవటం చరిత్రలో అనేక సందర్భాలలో జరిగిన సహజ పరిణామం.

శాతవాహన రాజులు తమ రాజధానిని మహారాష్ట్రంలోని పైఠాన్‌నుండి, ఆంధ్రదేశంలోని ధాన్య కటకానికి మార్చారంటే వారితోపాటు సేనలు, అనుచరులు, కుటుంబాలతోసహా తరలివచ్చి, ఆంధ్రదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారని భావించాలి. ప్రాచీన రాజులకు స్థిరసైన్యం కొద్దిగానేవుండేది. దండయాత్ర సమయాలలో

గ్రామాలలోని రైతు కుటుంబాలనుండి, ఒక్కొక్కరు చొప్పున సైన్యంలో చేరటం రివాజు.

శాతవాహనులు మహారాష్ట్ర దేశంనుంచి వలసవచ్చినవారు కాదని, తెలుగుదేశమే వారి ప్రాచీన నివాస స్థలమని ఒక వాదన ఉంది. ఈమధ్య తెలంగాణాలో బయల్వెడలిన గాజులబండ, కొండాపురం గ్రామాలలో బైటపడిన అవశేషాలు ఈ వాదనకు కొంత బలము ఇస్తున్నవి. ఆంధ్రుల ప్రాచీనతకు సంబంధించిన ఈ సమస్య భావి పరిశోధనల వలననే పూర్తిగా పరిష్కారం కాగలదు.

## భాష:

నాటి రాజభాష ప్రాకృతభాష. ప్రాకృతభాషలోనే అనేక స్థానిక విభాగాలున్నాయి. కొండజాతులు మాట్లాడే ప్రాకృతాన్ని పైశాచీ అనేవారు. సామాన్య ప్రజలు మాట్లాడేభాషను దేశి అనేవారు. కొద్దిమంది పండితులు మాత్రం సంస్కృతం మాట్లాడేవారు. ప్రాకృతభాషను తొలగించి, సంస్కృతభాష రాజాదరణ పొందటానికి జరిగిన ప్రయత్నాన్ని ఈ క్రిందికథ వివరిస్తుంది.

## గుణాఢ్యుని కథ:

కుంతలశాతకర్ణి ఆస్థానంలో గుణాఢ్యుడనే ప్రాకృత పండితుడున్నాడు. కుంతలశాతకర్ణి భార్యలలో ఒకరు సంస్కృత భాషా పాండిత్యంగల స్త్రీ. రాజుకు సంస్కృతము సరిగారాదు. ఒకనాడు రాజుగారు అంతఃపుర జనంతో జలక్రీడ లాడుతుండగా రాణి రాజునుద్దేశించి "రాజన్ మామోదకైస్తాడయ" అని అన్నదట. మోదకాలంటే వుండ్రాళ్ళు కనుక రాణిగారికి వుండ్రాళ్ళమీద ఆసక్తి కలిగిందని వెంటనే రాజు ఒక బుట్టెడు వుండ్రాళ్ళు తెప్పించాడు. అదిచూచి రాణితోసహా అందరూ రాజును పరిహసించారు. 'మాం, ఉదకైః మాతాడయ' నీళ్ళతో నన్ను కొట్టవద్దు. అని రాణి

అన్నది. ఈ సంస్కృత సమాసం గ్రహించలేని రాజు మోదకైః, అంటే ఉండ్రాళ్ళు అనుకున్నాడు.

ఈ ఘటన జరిగినతర్వాత రాజు అవమానభరితుడై పండితులను పిలిపించి 'తనకు 6 నెలలలో సంస్కృత పాండిత్యం వచ్చేటట్లు చేయాలన్నాడు. శర్వవర్మ అను సంస్కృత పండితుడు, అందుకు పూనుకుని, కాతంత్ర్య వ్యాకరణము అనే ఒక సులభవ్యాకరణాన్ని రచించి రాజుకు 6 నెలలలో సంస్కృత పాండిత్యము కలిగించాడు.

రాజాస్థానంలో సంస్కృతభాషకు ఆదరం హెచ్చింది. ప్రాకృతపండితుడైన గుణాఢ్యునికి అనాదరం కలిగింది. ఈ నిరసనకు ఖిన్నుడై గుణాఢ్యుడు అడవికివెళ్ళి బృహత్కథ అను ఒక గొప్ప గ్రంథాన్ని రచించాడు. అత ప్రాచీనమైన కథలను ఇందులో చేర్చాడు. ఆంధ్రుల ప్రాచీన సాంఘిక జీవనము మాత్రమే కాక భారతీయుల సాంఘిక చరిత్ర తెలుసుకోడానికి బృహత్కథ ఎంతగానో వుపయోగపడుతుంది.

## ప్రాకృతం:

ఈ గ్రంథమంతా పైశాచీ భాషలో రచింపబడ్డది. సంస్కృత, ప్రాకృత, దేశీభాషలను వదలి తాను పైశాచీ భాషలో ఈగ్రంథాన్ని రచించానని గుణాఢ్యుడే చెప్పుకున్నాడు. సామాన్యులు వాడే దేశభాష ఎలా వుండేదో గ్రహించేందుకు మనకు ఆధారాలులేవు. ప్రాకృతభాషకు ఈ క్రింది నిదర్శనాలు చూడవచ్చు.

### కృష్ణుని నాసిక శాసనము ప్రాకృతం:

1. సాదవాహన కులె కన్హెరాజిని నాసిక కేన.

2. సమణెన మహామాతెణ లెణ కారిత.

[శాతవాహన కులమునందలి కృష్ణుడు రాజుగనుండగ నాసిక వాస్తవ్యుడు అగు శ్రమణుడు అను మహాత్మునిచేత యీ గుహ తొలిపింపబడెను].

పైశాచీభాషకు ఉదాహరణలు లభించుటలేదు. కాని పైశాచీభాష, దార్దిక్ భాషాకూటమికి చెందినదని భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఆనాటి దేశభాష పైశాచీభాషకు సన్నిహితంగా వుండేది.

ఆంధ్రులకు పూర్వమే తెలుగుదేశంలో నాగులు నివసిస్తూ వుండేవారు. వీరిభాష తెలుగు. తెలుగుభాష ద్రావిడ భాషా కుటుంబం లోనిదని భాషా శాస్త్రజ్ఞులు అధిక సంఖ్యాకులు నిర్ణయించారు.

ఆంధ్రులు, తెలుగుదేశంలో స్థిరనివాస మేర్పరచుకున్నారు. స్థానికులైన నాగులు క్రొత్తగా వచ్చిన ఆంధ్రులు కలిసి నేటి ఆంధ్ర జాతిగా రూపొందినారు. నాగుల తెలుగుభాష ఆంధ్రుల దేశీభాష కలసి నేటి ఆంధ్ర భాషగా మారినవి. కృష్ణా గోదావరి మధ్యప్రాంతం కేంద్రంగా, ఆంధ్రదేశం అనేపేరు మొట్టమొదటి సారిగా వాడుక లోకి వచ్చింది.

శాతవాహన రాజులనాటి సామాజిక జీవితాన్ని తెలుసు కోటానికి, ఆరాజుల శాసనాలు, నాణెములు, సమకాలీన గ్రంథాలు ఉపయోగపడతాయి. ఇదిమాత్రమేకాక, కౌటిల్యుని అర్థశాస్త్రంవంటి కొన్ని గ్రంథాలుకూడా ఎంతో సహాయపడతాయి. అర్థ శాస్త్ర గ్రంథకర్త చాణక్యుడు మౌర్య చంద్రగుప్తుని కాలంవాడు. క్రీ. పూ. 322 సంవత్సరకాలంలో చాణక్యుడు జీవించాడు. శాత వాహన రాజులందరూ, క్రీ. పూ. 200 నుండి క్రీ. శ. 100 సం. వరకు పరిపాలించారు. ఐనా శాతవాహనుల కాలంలోసైతం పరి పాలనా వ్యవస్థ కొద్ది మార్పులతో, మౌర్య చంద్రగుప్తుని కాలం నాటివలెనే ఉండేది.

నగర పరిపాలన:

పట్టణాలను 'నగరము'లని 'నిగమము'లని పిలచేవారు. గ్రామ, పట్టణ పరిపాలన, కేంద్రాధికారానికి లోబడిన పౌర సంఘాలచే

నిర్వహించబడుతూ ఉండేది. నగరపరిపాలన బాధ్యత, 'నాగరికుడు' అను ప్రభుత్వ ఉద్యోగి వహించేవాడు. అర్థశాస్త్రములోని 'నాగరక ప్రణిధి' అను విభాగం, నాటి నగర పరిపాలనా వ్యవస్థను చక్కగా తెలియజేస్తుంది. ఇతనికి విశేషాధికారాలుండేవి. రాజుకు మాత్రమే అతను బాధ్యుడు. సర్వాధికారాలు గల ఈ నాగరికుల యాజమాన్యాన, పౌరసంఘాలకు నామ మాత్రాధికారాలు మాత్రము ఉండేవని మనము గ్రహించవచ్చు.

## గ్రామ వ్యవస్థ:

స్వయం సంపూర్ణ ఆర్థికవిధానంతో జీవించిన నాటి గ్రామాల పరిపాలన పేరుకు స్థానికుల చేతిలో ఉండేది. పన్నుల భారం విపరీతం. చెరువులో చేపలు పట్టేహక్కు, సంతలో పన్ను వసూలు చేసుకునే హక్కు, బంజర్లు, బీళ్ళు, తదితరమైన హక్కులన్నీ రాజుకు ఉండాలని చాణక్యుని వాదన. కొందరు ఉదారులైన రాజులు కొన్ని కొన్ని హక్కులను గ్రామీణ ప్రజలకు వదలిఉండవచ్చు. కాని సాధారణ వ్యవస్థ చాణక్యుడు వివరించినట్లే ఉండేది.

## ఆర్థిక వ్యవస్థ:

గ్రామాలలో రైతులకు తమ క్షేత్రాలపై యాజమాన్యం ఉండాలని, ఏదో అసాధారణ పరిస్థితులలో మాత్రమే వారి యాజమాన్యాన్ని తొలగించి, శిక్షగా వారిని దాసులుగా సైన్యంలోను, గనులలోను పనిచేయించవలెనని కౌటిల్యుడు వ్రాశాడు. నగరాలలో వర్తకులవద్ద, అడవులలోను, గనులలోను ఇతర ఆయుధ కర్మాగారాలలోను 'దాసు'లనబడే బానిసలుండేవారు. అయితే ఈ బానిసలు కొన్ని సంవత్సరాల తర్వాతగాని లేక కొంత మూల్యం చెల్లించినమీదటగాని, తిరిగి స్వతంత్రులు అయ్యే అవకాశము ఉండేది. దాసులను విక్రయించే హక్కు కూడా యజమానుల

కుండేది. దాసుని పుత్రుడు, తప్పనిసరిగా దాసుడు కానక్కరలేదని చాణక్యుడు వివరించాడు.

గుణాఢ్యుని బృహత్కథలో అనేక సందర్భాలలో, బానిస వ్యాపారాన్ని గురించి, దాసులను గురించి ప్రస్తావనలు వున్నాయి. విదేశాలతో నౌకా వ్యాపారం చేసే వర్తకులవద్ద విశేషంగా బానిసలుండేవారని, వర్తకులు వారిని అతినీచంగా చూస్తుండేవారని, కథలద్వారా స్పష్టమౌతుంది.

## వివిధ వృత్తులు:

శాతవాహనరాజుల శాసనాలద్వారా ఆనాడు చేనేత, కమ్మరి, కుమ్మరి, చర్మకార, వడ్రంగి, స్వర్ణకార - తదితర వృత్తుల వారందరూ శ్రేణుల రూపములో సంఘటితమై ఉండేవారని బోధపడుతుంది. యజ్ఞశ్రీ శాతకర్ణి శాసనం ఒకదానిలో ఇలా చెప్పబడి ఉంది.

"చేనేత శ్రేణివారికి వేయి కర్సపనములు, వడ్రంగి శ్రేణి వారికి 2 వేల కర్సపనములు, నూనెగానుగల శ్రేణివారికి 500 లు, కమ్మరి శ్రేణివారికి 500, యజ్ఞశ్రీ శాతకర్ణి స్వల్పవడ్డీకి అప్పు రూపంలో ఇచ్చారు." రాగితో చేయబడిన కర్సపనమనే నాణెము నాడు ముఖ్యమైనది.

ఈ విధంగా తక్కువ వడ్డీకి రాజులు వృత్తి పనులవారికి ధన సహాయంచేసిన ఉదాహరణలు అనేక శాసనాలద్వారా బోధపడుతున్నవి.

## వ్యాపారం:

దేశం నలుమూలలా లోహ సంపదను త్రవ్వి, ఉపయోగంలోకి తెచ్చే కర్మాగారాలుండేవి. అనేక రేవులపేర్లు శాసనాల ద్వారా మనకు తెలుస్తున్నాయి. పశ్చిమ సముద్రతీరంలో పైఠాన,

తగర, జున్నారి, కరహాటక, నాసిక, గోవర్థన నగరాలు, తూర్పు సముద్రతీరంలో ధాన్యకటకం, విజయపురి, కేవురూర, మాసోలియస్ (మచిలీపట్నం) మొదలైన రేవునగరాలద్వారా విదేశాలతో వ్యాపారం సాగుతూ ఉండేది. ముఖ్యంగా చైనా, జావా, సింహళ దేశాలతో విరివిగా వ్యాపారం సాగేది. గౌతమీపుత్ర శాతకర్ణి తరువాత పరిపాలించిన రాజుల నాణెములపై ఓడగుర్తు ఉంది. నౌకా వ్యాపారం విశేషంగా జరుగుతూ ఉండేదని పై ఉదాహరణల ద్వారా తెలుస్తున్నది. బృహత్కథలోని కథలుగూడా ఇదే విషయం స్పష్టం చేస్తున్నాయి.

మత, కుల వ్యవస్థ:

శాతవాహన రాజులందరూ గాఢమైన హిందూ మతాభిమానులు. వీరిలో అనేకులు తాము అశ్వమేధయాగం చేశామని చెప్పుకున్నారు. గౌతమీపుత్ర శాతకర్ణికి వర్ణాశ్రమ ధర్మపరిత్రాత, ద్విజవరకుటుంబ వివర్ధనుడు అని అనేక బిరుదు లున్నాయి. అయితే బౌద్ధమతంకూడా దేశంలో విరివిగా వ్యాపించింది. అంతేకాదు. ఆంధ్ర ప్రజలలో విశేషభాగము బౌద్ధమతాభిమానులుగా ఉండే వారని తెలుస్తున్నది. వృత్తి పనివారలు, వ్యాపారస్తులు, రైతులు కొంతవరకు బౌద్ధమతాన్ని అభిమానించారు. బ్రాహ్మణులుమాత్రం హిందూ దేవతలను ఆరాధించేవారు. రాజులైన శాతవాహనులు, ఉభయులను సమదృష్టితో చూచినట్లు ఉదాహరణ లున్నాయి. వర్ణ వ్యవస్థ - బౌద్ధమతము రెండూ ప్రజలలో పాతుకుపోసాగినవి.

గౌతమీపుత్ర శాతకర్ణి తల్లి బౌద్ధులకు అనేక దానధర్మాలు చేసింది. ఈమెకు, గాఢమైన బౌద్ధమతాభిమాన ముండేది. ఆమె గౌరవార్థం, "గౌతమీపుత్ర శాతకర్ణి త్రిరశ్మి అను గుట్టవద్దనున్న గ్రామాన్ని బౌద్ధభిక్షువులకు దానంగా ఇచ్చాడు. ఆ గ్రామంలో రాజుకు ఇకముందు ఎట్టి అధికారమూలేదు" అని ఒక శాసనంలోవుంది.

మరొక రాజు బౌద్ధభిక్షువులకు చలికాలంలో వస్త్రాల నివ్వ గలందులకు గ్రామ, చేనేతకార్మికుల శ్రేణికి 4 వేల కర్షపనములు ఉచితంగా దానం చేశాడు. రాజులు మాత్రమేకాక ధనికులైన వర్తకులుకూడా బౌద్ధభిక్షువులకు దానధర్మాలు చేసినట్లు శాసనా లున్నాయి.

ఒక రాజు, బౌద్ధభిక్షువులకు బ్రాహ్మణులకు-ఇద్దరికి ఉపయోగ పడేటట్లు కొన్ని గ్రామాలు దానంగా ఇచ్చాడు.

## స్త్రీల స్థితి:

శాతవాహనరాజులందరూ తమ తల్లి పేరుతో ప్రారంభించి తమ పేర్లు చెప్పుకున్నారు. వీరి తర్వాత పరిపాలించిన ఇక్ష్వాకు రాజులు కూడా ఇదేపద్ధతి అవలంబించారు.

ప్రజాసామాన్యంలో కూడా బౌద్ధమతం విశేష వ్యాప్తిలో ఉన్న ఫలితంగా స్త్రీల స్థితి కొంత మెరుగుగానే ఉండేదని స్పష్ట మౌతున్నది.

ఆనాటి వివిధ వృత్తులను పరిశీలించినట్లయితే నాటి వర్గ సంబంధాలు కూడా బోధపడతాయి. రైతులు, వృత్తిపనివారలు గ్రామాలలోని ప్రధాన వర్గాలు. వీరుగాక నీటి పారుదలపై అజ మాయషీ చేసేవారు, కాపలాదార్లు, కరణాలు, పరిపాలనా బాధ్యత నిర్వర్తించే తదితరులూ ఉండేవారు. వీరంతా కలసినమీదటనే స్వయం సంపూర్ణ గ్రామజీవనం ఏర్పడ్డది. రైతుల, వృత్తి పనివారల స్థితి ఎంత కఠినంగా ఉండేదో వేరే చెప్పనక్కరలేదు. నిరంకుశ రాజ్య పరిపాలనను వీరెంత అసహ్యించుకునేవారో నాటి కథల ద్వారా మాత్రమే తెలుసుకోగలము. ఇదే ఆనాటి ప్రధాన వర్గ కలహం.

## వర్గ కలహం:

ఈ స్పర్థ ఆంధ్ర ప్రజల చరిత్ర అంతటా కనపడుతున్నది. అయితే, రైతులు కాని, వృత్తి కార్మికులు కాని స్పష్టమైన ఆర్థిక, రాజకీయ నినాదాలతో రాజులపై తిరుగుబాటు చేసిన ఉదాహరణలు ప్రాచీన ఆంధ్రచరిత్రలో అరుదు. నాటినగరాలలో వర్తకులు, ఉద్యోగులు ప్రధాన వర్గాలు. వీరి పెత్తనం హెచ్చుగా ఉండేది. రాజప్రాసాదాలలో గృహకార్యనిర్వహణలో పాల్గొనే దాస దాసీ జనం, వ్యాపారస్తులవద్ద, ధనికులవద్ద, శ్రమజేసి జీవించే దాసులు బానిసలవలెనే నికృష్ట స్థితిలో ఉండేవారు. ఈ పీడిత ప్రజల బాధామయ గాథలు వివిధ రూపాలలో ప్రాచీన కథలలోను, గాథలలోను, వర్ణించ బడ్డవి.

## బౌద్ధ మతము:

ఈ పీడిత ప్రజానీకానికి కులభేదాలను నిరసించి, సమానత్వాన్ని బోధించిన బౌద్ధ మతము ఒక ఆశాజ్యోతిఐంది. అందువలననే, నాటి వృత్తి కార్మికులు, రైతులు, ఇతర పీడితప్రజలు, బౌద్ధ మతాన్ని గాఢంగా అభిమానించటం జరిగింది.

ప్రజలలోని ఈ గాఢమైన బౌద్ధ మతాభిమానాన్ని శాతవాహన రాజులందరూ గమనించారు. ప్రజల అనురాగం పొందాలంటే, తాము కూడా మత సామరస్య ధోరణిని అవలంబించటం అవసరమని గుర్తించారు. నియంతృత్వ సిద్ధాంతాలను ప్రతిపాదించిన చాణక్యుడు, బౌద్ధ భిక్షువులు గూఢచారులని, దేశ ద్రోహులని వారి నతి కఠినంగా శిక్షించవలెనని తన అర్థశాస్త్రములో సూచించినమాట వాస్తవమే. కాని, మౌర్యవంశంలోని అశోక చక్రవర్తి స్వయంగా బౌద్ధ మతాన్ని అభిమానించి పోషించటంతో, చాణక్యుని సూత్రాలను ఆలంబన లేకుండా పోయింది. శాతవాహన

రాజులందరూ, అశోకునిఅంత గాఢ బౌద్ధాభిమానులు గాకపోయినా, హిందూ, బౌద్ధమతాలను సమానంగా ఆదరించారు.

బౌద్ధమతంలో మార్పు:

ఇంతేకాదు; బౌద్ధమతంలో కూడా వివిధశాఖలు ఏర్పడ సాగినవి. మొదట్లో బ్రాహ్మణ మతంపైన తిరుగుబాటుగా ప్రారంభమైన బౌద్ధం క్రమంగా హిందూమతంలోని అనేక విషయాలను అనుకరించ పూనుకున్నది. హిందూ దేవతలను గురించి, అనేక పురాణాలు చిలవలు పలవలు వర్ణించినట్లే, బౌద్ధజాతకకథలు సృష్టించబడ్డాయి. పునర్జన్మ సిద్ధాంతాన్ని నిరాకరించిన బుద్ధుడికి అనేక అవతారాలు కల్పించబడ్డాయి. ఆ అవతారాల గాథలే బౌద్ధజాతక కథలు.

అంతేకాదు, పీడిత ప్రజలు ముఖ్యంగా శిల్పులు, బుద్ధునిపైగల తమ భక్తిభావాన్ని ప్రదర్శించటానికి, బౌద్ధవిగ్రహాలు చెక్కి, వానిని పూజించ మొదలుపెట్టారు. బుద్ధుని విగ్రహరూపంలో పూజించవచ్చునా, రాదా అని బౌద్ధులలో రెండువిభాగాలు ఏర్పడ్డాయి. 'మహాయాన' అనుపేరుగల ఒకశాఖవారు, ఇందుకు అనుమతించారు. 'హీనయాన' అను మరొకశాఖ విగ్రహారాధన సరి కాదని వ్యతిరేకించారు. కాలక్రమేణ, మహాయానశాఖ వృద్ధి చెందింది. ఈశాఖవారి ప్రచారంవల్లనే, బౌద్ధమతం ఖండఖండాంతరాలను వ్యాపించింది. బుద్ధుని విగ్రహాలు భారత దేశంలో మాత్రమే కాక, బర్మా, సిలోన్, సయాం, చైనా, జపాను, ఇండోనేషియా దేశాలలోసైతం మలచబడ్డాయి. శిల్పకళ ఎంతో అభివృద్ధి చెందింది.

ఫ్యూడల్ వ్యవస్థలో అణిగిపోతున్న పీడిత ప్రజలను, సాంఘిక ఆర్థిక సమానత్వం, బౌద్ధమతం కలిగిస్తుందని మొదట్లో ప్రజలు ఆశించారు. రాజులు భయపడ్డారు. కాని అలాంటిదేమీ జరగలేదు.

ఫ్యూడల్ విధానంలోని కాఠిన్యం కొంత తగ్గించటానికి మాత్రం బౌద్ధమతం ఉపయోగపడ్డది. బౌద్ధమతంలోని సమానత్వ సిద్ధాంతాలన్నిటిని, అహింసాసూత్రము బంధించి ఒక చట్రంలోకి ఇమిడ్చింది. రాజరిక వ్యవస్థకు భంగంలేదని రుజువైంది. రాజులుసైతం బౌద్ధమతాన్ని స్వీకరించారు. ఇంతటితో ఆగలేదు. మొదట్లో వర్ణవ్యవస్థ నెదిరించిన బౌద్ధమతం, కాలక్రమేణ వర్ణవ్యవస్థతోకూడా రాజీపడ్డది. వివిధ కులాలకు చెందినవారు తమ కులాచారాలను అనుసరిస్తూనే, బుద్ధుని దేవుడిగా ఆరాధించ ప్రారంభించారు. నాగార్జున కొండవద్ద శూద్రతీర్థం, అనేది ఒకటి ఉంది. ఈ పరిణామాన్ని మరొక మెట్టుముందుకు తీసుకు వెళ్ళినవాడు ఆచార్య నాగార్జునుడు.

## నా గా ర్జు ను డు :

క్రీ॥ శ॥ 184-203 సంవత్సరాలమధ్య, ధాన్య కటకం రాజధానిగా పరిపాలించిన యజ్ఞశ్రీశాతకర్ణి ఆ స్థానంలో ఆచార్య నాగార్జునుడు జీవించాడు. నాగార్జునుడు ఆంధ్రుడు. దేశదేశాలు సంచారం చేసి, చివరి రోజులలో, నాగార్జునికొండమీద ఆశ్రమం నిర్మించుకొని అక్కడనే మరణించాడు. ఈ నాగార్జునుడు, శూన్యవాదము-లేక మాధ్యమిక వాదం - అను ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించి బౌద్ధమతంలో ఒకమార్పు తెచ్చాడు.

## శూ న్య వా ద ం :

ఈ ప్రపంచం వాస్తవమైనదని, కనుక జీవితంలో నీతిసూత్రాల కనుగుణ్యంగా నడచుకోవలెనని, భూతదయ, సమానత్వం, అహింస, సత్యం - మొదలైనవి ప్రజలసమిష్టి సుఖజీవనానికి అవసరమని, గౌతమబుద్ధుడు బోధించాడు. వైదికమతం ప్రచారంచేస్తున్న అవాస్తవిక సిద్ధాంతాలతో, రాజుల, బ్రాహ్మణుల నిరంకుశ ప్రవర్తనతో బాధపడుతున్న ప్రజలను, బుద్ధుని వాస్తవిక, సామాన్య

సూత్రాలు ఆకర్షించాయి. బుద్ధుడు తను జీవించి వుండగానే ఒక మహాపురుషుడుగా గుర్తించబడ్డాడు.

భూతదయ, ప్రజాసేవ చాలాకాలంవరకు బౌద్ధమతంలో నిలచాయి. అయితే పునర్జన్మ, మోక్షం, పాపపుణ్యాలు మొదలైన తాత్విక సమస్యలను సమాధానం చెప్పవలసి వచ్చేటప్పటికి, తరువాత బౌద్ధమత గురువులు తిరిగి మాయా వాగురులలో చిక్కుకో సాగారు. వాస్తవికదృష్టినుండి తిరోగమించి, శూన్యవాదంలోకి వెళ్ళారు. నాగార్జునుడు ఈ పరిణామానికి నాయకత్వము వహించాడు.

ప్రపంచమంతా మాయ, లేకశూన్యం. మానవుడు జన్మ పరంపరను ధరించి కర్మఫలితం అనుభవిస్తాడు అను శూన్యవాద సిద్ధాంతాలను నాగార్జునుడు బోధించాడు. 400 సంవత్సరాల తర్వాత, అద్వైతమతాన్ని ప్రచారంచేసిన శంకరుని బోధలకు, ఆచార్య నాగార్జునుని బోధలకుగల సన్నిహితత్వం స్పష్టంగా బోధపడుతుంది. ఈవిధంగా బుద్ధుని మూలసిద్ధాంతాలను త్యజించి వెనుకబడిన ప్రజలమనస్తత్వాన్ని ప్రతిబింబించే నూతన సిద్ధాంతాలను ప్రచారంచేయడంతో, ఆంధ్రదేశంలో బౌద్ధమతం ఒక ప్రజామతం అయింది.

భావవాద తత్వశాస్త్రము, విగ్రహారాధన, వర్ణవ్యవస్థతో రాజీ–ఈమూడు పూర్తిగావడంతో ఫ్యూడల్ వ్యవస్థకు అనువయిన మతంగా బౌద్ధమతం మారిపోయింది.

ఆంధ్ర ప్రజలలో వచ్చిన మార్పు రాజులలో కూడా ప్రతిబింబించింది.

ప్రతిష్ఠాన నగరం కేంద్రంగా పరిపాలించిన శాతవాహన రాజులు హిందూ బౌద్ధమతాలను రెండింటిని ఆదరించారు. ధాన్యకటకం రాజధానిగా పరిపాలించిన ఆఖరి రాజులు పూర్తిగా బౌద్ధ మతాన్ని మాత్రమే అభిమానించారు. ఇదే సాంప్రదాయాన్ని

(2)

తర్వాతవచ్చిన ఇక్ష్వాకు రాజులు మరింతముందుకు తీసుకు పోయారు.

బౌద్ధ సంస్కృతి:

ఫ్యూడల్ చట్రానికి అనుగుణ్యంగా బౌద్ధమతం మారి పోయింది అని చెప్పినంతమాత్రాన, బౌద్ధమత ప్రత్యేకత లేదని అర్థంకాదు. ఆంధ్రులలో విశేషంగా వ్యాపించిన బౌద్ధమతం, ఆంధ్ర సంస్కృతి పరిణామంలో ఎంతో పాత్రవహించింది. ఆచార్య నాగార్జునుడు 30 కి మించిన తాత్విక గ్రంథాలను పాళీబాషలో రచించాడు. ఇంతేకాదు; వైద్యశాస్త్రంలోను, రసాయనశాస్త్ర లోను నాగార్జునుడు గొప్ప పండితుడు. బౌద్ధ ఆరామాలలో నిపుణులైన వైద్యులు ఉచితచికిత్స చేస్తూండేవారు. విద్యాబోధ నకు, వైద్యచికిత్స, శిల్ప, నాట్య, చిత్రకళలను సాటి బౌద్ధ ఆరా మాలు కేంద్రాలు. ఇట్టి బౌద్ధ ఆరామాలు ఆంధ్రదేశమంతటా నాగార్జునుని కాలంలో వ్యాపించాయి. సర్కారు జిల్లాలలోని, అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, నందిగామ, ఘంటసాల, గుడివాడ, నాగార్జునికొండ, శాలి, రామతీర్థం, శంఖరం మొదలైన ప్రాంతాలలోను, తెలంగాణాలోని గుమ్మడిదుర్రు, అల్లూరు, కొండా పురం, ఫణిగిరి, గాజులబండ మొదలైన ప్రాంతాలలోను ప్రసిద్ధ బౌద్ధసంఘారామాలు ఉండేవి. అంతేకాదు; ఆంధ్రదేశంలోని నేటి ప్రసిద్ధ వైష్ణవ, శైవ దేవాలయాలన్నీ, ఒకప్పుడు, బౌద్ధ ఆరామా లున్నచోట కట్టబడినవే. ఇంతేకాక "లంజదిబ్బ"లని నీచార్థంతో ఇప్పటికి అచ్చటచ్చట వ్యవహరింపబడే ప్రాంతాలన్నీ ఒకప్పుడు బౌద్ధ, జైన ఆరామాలుగా ఉండినవే.

బౌద్ధమతం యొక్క విశేషవ్యాప్తి అంతా శాతవాహన రాజుల చివరికాలంలోను, ఇక్ష్వాకురాజుల కాలంలోనూ జరిగింది. ఆంధ్రుల సంస్కృతి పరిణామంలో, బౌద్ధమతసూత్రాలైన, ప్రజాసేవ,

భూతదయ, సమానత్వ సిద్ధాంతాలు ఆనాడే పాదుకున్నాయి. తరువాత ఎన్నెన్ని మార్పులు వచ్చినప్పటికీ, ఆంధ్ర సంస్కృతీ పరిణామంలో బౌద్ధమతం ఒక ప్రధానపాత్ర వహించిందని అంగీకరించక తప్పదు.

## గ్రామీణ జీవితం:

శాసనములవల్లను, గాథాసప్తశతి మొదలగు గ్రంథసహాయం వల్లనూ, నాటి గ్రామీణ జీవితం తెలుసుకోవచ్చు. శక, యవన, పహ్లవాదుల ..ులు హిందూమతాన్ని స్వీకరించి, నాటి సమాజంలో చేరిపోయినారు. ఆంధ్రదేశంలో మొట్టమొదట జీవించినవారు నాగులని, తరువాత వచ్చినవారు ఆంధ్రులని ఇంతకుముందే వివరించాను. గుణాఢ్యుని పుట్టుకకు సంబంధించిన ఒక కథ ఈ విషయాన్ని మరింత స్పష్టం చేస్తున్నది.

ప్రతిష్ఠానపురంలో సోమశర్మ అను బ్రాహ్మణుడుండేవాడు. అతనికి వత్స, గుల్మక అను పుత్రులు, శృతార్థ అను పుత్రిక ఉన్నారు. తల్లిదండ్రులు మరణించినమీదట, అన్నదమ్ములు, చెల్లెలు కలసి నివసిస్తూండేవారు. కొంత కాలానికి అవివాహితమైన చెల్లెలు గర్భవతి ఐంది. కారణం తెలుసుకోలేక సోదరులిద్దరూ ఆమెను వాస్తవం చెప్పుమని నిర్బంధించారు.

వాసుకి సోదరుడైన నాగరాజును స్నానార్థం నదికేగినపుడు, తాను చూచి వివాహం చేసుకున్నానని తత్ఫలితమే ఈ గర్భమని ఆమె వివరించింది. ఆమె కుమారుడే గుణాఢ్యుడు. గుణాఢ్యుడు పుట్టిన వెంటనే తల్లి మరణించింది.

నాగులతో వివాహ సంబంధాలు పెట్టుకోరాదని నిషేధాలున్నప్పటికీ, ఆచరణలో అవి ఎలా భగ్నమౌతున్నదీ ఈ కథ వివరిస్తున్నది. ప్రతిష్ఠానపుర ప్రాంతంలోనే ఇలా ఉన్నప్పుడు, నాగుల

ఆదిమజన్మస్థానమైన ఆంధ్రదేశములోకి ప్రవేశించినమీదట, ఆంధ్రులు నాగులు పూర్తిగా కలిసిపోయినారని రూఢిగా చెప్పవచ్చును.

ప్రజలు సన్నిహిత కుటుంబాలలో నివసిస్తూండేవారు. అత్త వారింట్లో మరదలు, కోడండ్లు - మొదలైన వారందరూ కలిసి ఒకే యింట్లో నివసిస్తున్నప్పుడు వచ్చే కలహాలు, మనస్పర్థలు, తదితరమైన వైపరీత్యాలు సప్తశతిలో వర్ణించబడ్డాయి. రకరకాల నగల పేర్లు కూడా ఆ కథలలో ఉన్నాయి.

పురుషులు, అంతరీయమును (పంచ) ఉత్తరీయమును (పైపంచ) ధరించేవారు. స్త్రీలు చీర, రవికె ధరించేవారు. ప్రయాణ సందర్భంలో పల్లకీలు, మేనాలు, ఎద్దులబండ్లు వాడబడేవి. ధాన్యం పోసుకునే పెద్దబానలు, చెంబులు, తబుకులు, ఝూడీలు మొదలైనవన్నీ వాడుతుండేవారు.

## పంటలు:

చెరకుగానుగలు, ఏతాములు, నూనెగానుగలు, గాథా సప్తశతిలో అనేక సందర్భాలలో వర్ణించబడ్డాయి. వరి, శనగ, నువ్వులు, జనుము మొదలైన ధాన్యాలను పండించేవారు. నాటి వివాహము తదితర శుభకార్యాలలో జరిగే ఆచారాల వర్ణన, స్త్రీల నోములు, బాలబాలికల ఆటపాటలు తదితర ఆచారాలన్నీ, ఈ గ్రంథంలో వర్ణించపడ్డాయి. నాటి గ్రామీణ సంస్కృతిలోని ఆచారవ్యవహారాలు, నేటికీ కొన్ని కొనసాగుతున్నాయి. స్త్రీలు ఇంటింటికి తిరిగి వాయనములిచ్చేవారని, పసుపు వంటినిండా పూసుకొని స్నానముచేసేవారని మొదలయిన వివరాలు వర్ణించబడ్డాయి.

## పట్టణ జీవనము:

నాటి పట్టణ ప్రజలలోని ఉన్నత తరగతుల జీవనపద్ధతి తెలుసుకోటానికి వాత్స్యాయన కామసూత్రాలు వుపయోగపడతాయి.

ఈ గ్రంథాలలో వివరించబడ్డ సుఖాలు, విలాసాలు, నాటిప్రజలంతా అనుభవించే వారనుకోవటం శుద్ధ పొరపాటు. పరాన్నభుక్కులై కాలుకదల్చ నవసరంలేక, జీవితమంతా విలాసాలతో గడపటానికి తగిన విశ్రాంతి కలిగిన కొద్దిమంది ధనికవర్గ వ్యక్తుల అలవాట్లను మాత్రమే ఈ గ్రంథం వర్ణిస్తుంది.

నగరాలలో నృత్య, సంగీత చిత్రకళాది లలితకళలన్నిటికీ కేంద్రాలు నాటి వేశ్యా గృహాలు. లలితకళలు, భోగలాలసత, పెనవేసుకుని వుండేవన్న నగ్నసత్యం యీ గ్రంథంద్వారా తెలుస్తుంది.

శిల్ప. కళ :

అమరావతీస్థూపం అశోకుని కాలంలోనే నిర్మించబడ్డది. కాని శాతవాహనుల కాలంలో పునర్నిర్మించబడి ఎంతో అభివృద్ధి చేయబడ్డది. ఆంధ్రదేశంలో బౌద్ధమత ప్రభావముతో శిల్పకళ విపరీత ప్రోత్సాహం పొందింది. అమరావతీ శిల్పకళ ప్రాతిపదికపైననే అజంతా, ఎల్లోరా గృహాలలోని శిల్పము గూడా మలచబడ్డదని విషయజ్ఞుల భావన. చిత్రవిచిత్రరీతులలో ఈ శిల్పాలు చెక్కబడ్డాయి. ఇటీవల బయల్పడ్డ నాగార్జునికొండ శిల్పాలలో ప్రాచీన ఆంధ్రశిల్పుల నైపుణ్యం పరాకాష్ట చెందిందని చెప్పవచ్చు.

నాగార్జున కొండలోని ప్రధాన శిల్పమంతా శాతవాహనుల తర్వాత ఆంధ్రదేశాన్ని పరిపాలించిన ఇక్ష్వాకుల కాలంలో చెక్కబడ్డవి. కాని, నాగార్జునాచార్యుడు నివసించిన ఆరామం మాత్రం శాతవాహన రాజులలో కడపటివాడైన యజ్ఞశ్రీ శాతకర్ణి నిర్మించాడు. చైనా యాత్రికులు ఈ ఆరామాన్ని ఎంతో ఘనంగా వర్ణించారు.

క్రీ. శ. 5వ శతాబ్దంలో ఆంధ్రదేశం సంచారంచేసిన చైనా యాత్రికుడు ఈ ఆరామాన్ని పారావత విహార మని పిలిచి ఇలా వర్ణించాడు.

"ఇది ఐదు అంతస్తులపొడవుంది. క్రింది అంతస్తులో 500 గదులు, ఆ పైన వరుసగా 400, 300, 200, 100 గదులున్నాయి. మొదటి అంతస్తు ఏనుగ, ఆకారంలోనూ, రెండవది సింహాకారం లోనూ, మూడవది గుర్రం, నాల్గువది ఎద్దు, అన్నిటికన్న ఐదవది పావురం ఆకారంలోనూ నిర్మించబడ్డది." వివిధ జంతువుల, పక్షుల స్థాయీ సామర్థ్యాలను, ప్రాచీన శిల్పాకారులు తమ కళల్లో ఎంత చక్కగా గ్రహించారో దీనివల్ల స్పష్టమౌతుంది.

శాతవాహన రాజ్యవైభవం :

క్రీ. శ. 200 తో శాతవాహన రాజ్యం అస్తమించింది. నాగార్జునుని ఆదరించిన యజ్ఞశ్రీ శాతకర్ణి తర్వాత ఒక రిద్దరు రాజులు పరిపాలించి నప్పటికీ వారంత ప్రసిద్ధులుకారు.

మొత్తం శాతవాహన రాజులు 400 సంవత్సరాలకు పైగా ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. వీరి సామ్రాజ్యం అత్యున్నత దశలో దక్షిణాన కడలూరు వరకు, ఉత్తరాన మగధ వరకూ వ్యాపించింది. శాతవాహనుల నాణెములు కొన్ని కడలూరులో కూడా దొరికినవి. తెలంగాణా, కోస్తా ఆంధ్రా, దక్షిణ మహారాష్ట్ర ప్రాంతాలన్నీ వీరి ఏలుబడిలో చాలా కాలము వున్నాయి. చివరి రాజులకాలంలో శక, పహ్లవ, అభీరుల దండయాత్ర ఫలితంగా మహారాష్ట్ర దేశాన్ని పోగొట్టుకున్నా ఆంధ్రదేశాన్ని మాత్రం స్థిరంగా పరిపాలించారు.

400 సంవత్సరాల సుస్థిర పరిపాలన ఫలితంగా వర్తక వ్యాపారాలు, శిల్ప చిత్రకళలు, సాహిత్యం ఎంతో వృద్ధిచెందాయి. ఆనాడు రెండు ప్రధాన రాజమార్గములగుండా వర్తకంసాగుతూ ఉండేది. బందరునుండి ఒకటి, గుంటూరుజిల్లా వినుకొండనుండి ఒకటి, రెండు ప్రధాన రాజమార్గములు. హైద్రాబాదు వరకు వెళ్ళి అక్కడ రెండూకలిసి కళ్యాణి, పైఠాన్ నాసిక నగరాలమీదుగా పశ్చిమ తీరాన ప్రసిద్ధ రేవు పట్టణమైన భరుకచ్ఛ నగరాన్ని

చేరుకునేవి. భరుకచ్ఛం (బ్రోచ్) నాటి ప్రసిద్ధ వ్యాపార కేంద్రాలలో ముఖ్యమైనది. కథా సరిత్సాగరంలోని కథలలో ఈనగర ప్రస్తావన పదే పదే కనపడుతుంది.

కర్షకుల కష్టభరితమైన జీవితాన్ని, శ్రమఫలితాన్ని చూసుకున్న కర్షకుని ఆనందాన్ని గాథాసప్తశతిలోని ఒక పద్యం ఇలా వివరిస్తున్నది.

"నారునాటి, కావలసిన నీరుపెట్టి తగిన పరామరికలో, చక్కగా సాకుతూవచ్చి క్రమంగా పైరుపెరిగి, ఈని, పాల పొట్ట పోసుకొని, గింజకట్టి వంగిఉన్న పొలమును కనులారచూచి కర్షకుడు పారాడుతున్న కన్నకుమారుని చూచినలాగా మనస్సులో అంతులేని సంతోషంతో పొంగిపోయినాడు." ఈ గ్రంథంలో అచ్చ తెనుగు పదములైన అత్త, అమ్మి, అందము, పొట్ట మొదలైన మాటలు వాడబడటం గమనార్హం. ఇట్టి చక్కని వర్ణనలుగల విశిష్ట గ్రంథ రచన సాగటానికి వెనుక ఎంతో సాహిత్యాభివృద్ధి ఉండి ఉండాలి. శత్రురాజుల దండయాత్రా భయాన్ని తొలగించి, సుస్థిర పరిపాలనను నెలకొల్పిన సమర్థులైన శాతవాహన రాజుల పరిపాలన ఫలితంగానే ఇదంతా సాధ్యమైంది.

## రాజ్య పతనం:

ఆంధ్రదేశానికంతా సుస్థిర పరిపాలనను దీర్ఘకాలం ఇవ్వగలిగిన శాతవాహన రాజ్యం క్రీ. శ. 200 తో అంతమైంది.

శాతవాహన రాజులు ఆంధ్రప్రజలను ఐక్యంచేసి సుస్థిర పరిపాలనను సమకూర్చినమాట వాస్తవం అయినప్పటికీ నాడు సామ్రాజ్య అధినేతలైన రాజులందరివలెనే సామంతులపట్ల నిరంకుశులు. ఈ సామంత రాజులు సమయంకొరకు వేచిఉండి, బలహీనులైన రాజులు అధికారంలోకి రాగానే తిరుగుబాటు చేశారు.

అంతేకాదు, భారతదేశం మొత్తంమీద బౌద్ధమతం క్షీణించ నారంభించింది. హిందూమత, పునరుద్ధారణ నినాదంతో ఉత్తర హిందూస్థానంలోని గుప్తరాజ్యాలు మెల్లమెల్లగా రాజ్యవిస్తరణ ప్రారంభించారు. గౌతమీపుత్ర శాతకర్ణి తర్వాత శాతవాహన రాజులు ఒకరిద్దరు మినహా, ఆంధ్ర కళింగ దేశాలను మాత్రమే పరిపాలించారు. మహారాష్ట్ర అభీరుల పరిపాలన క్రిందకు పోయింది. ఈలోగా ఆంధ్రులు, నాగులతో కలిసిపోయి, స్థిరజీవనానికి అల వడ్డారు. బృహత్కథలోను, గాధాసప్తశతిలోను వాడబడినభాష శౌరసేని పాకృతం. మహారాష్ట్రులుకూడా అదేభాషను వాడేరు.

ఆంధ్ర ప్రాంతంలో శాతవాహన రాజులు స్థిరపడినమీదట, శౌరసేని ప్రాకృతాన్ని క్రమంగా వదలివేయసాగారు. చివరి శాత వాహనరాజుల శాసనాలలోని భాషకు మొట్టమొదటి వారి శాసన భాషకు స్పష్టమైన తేడా కనుపిస్తుంది. నాగులభాష తెలుగుభాష. ఈ భాష శాసనాలలో ప్రవేశించటానికి మరొక 400 సంవత్సరాలు పట్టింది. కాని తెలుగు మాటలు అనేకం అప్పటికే శాసనాలలో ప్రవేశింపసాగినవి.

# ఇక్ష్వాకు రాజులు

శాతవాహనరాజ్యం విచ్ఛిన్నమైన తర్వాత, ఆంధ్రదేశాన్ని ఇక్ష్వాకురాజులు పరిపాలించారు. ఈ వంశంలో ముగ్గురు రాజులు 52 సంవత్సరాలు మాత్రమే రాజ్యంచేశారు.

వాసిష్ఠీ పుత్ర శాంతమూలుడు ఈవంశకర్త. అతని కుమారుడు మాఠరీపుత్ర వీరపురుషదత్తుడు. ఇతని కాలంలోనే నాగార్జున కొండ శిల్పాలన్నీ చెక్కబడ్డాయి. ఆఖరిరాజు బాహుబలశాంతి మూలుడు.

వీరి రాజధాని విజయపురి. నేటి విజయవాడ నాటి విజయపురి అని 20 సంవత్సరాల క్రితంవరకు చరిత్రకారులు భావించారు. కాని నాగార్జునకొండ బయల్పడిన మీదట, ఈ అభిప్రాయం పొరపాటని రుజువైంది. కృష్ణానదీతీరంలో, నాగార్జునకొండ ప్రక్కనే విజయపురి అనే ప్రాచీననగర శిథిలాలు కనపడ్డాయి. ఆ నగరమే ఇక్ష్వాకుల రాజధాని.

## ఇక్ష్వాకురాజుల ప్రాధాన్యత

ఇక్ష్వాకు రాజులు పరిపాలించినది స్వల్పమే అయినప్పటికీ ఆంధ్రదేశ చరిత్రలో వీరికి ప్రత్యేక ప్రాధాన్యత ఉంది. శాతవాహన

సామ్రాజ్యం విచ్ఛిన్నం కావటంతో, ఆంధ్రదేశం చిన్నచిన్న రాజ్యాలుగా విడిపోసాగింది. ఉత్తర హిందూస్థానంలో హిందూ మత పునరుద్ధరణ నినాదంతో గుప్తరాజులు తల యెత్తసాగారు. దక్షిణాపథమంతా జయించవలెనని వారు కుతూహలపడసాగారు. ఆంధ్రదేశం దక్షిణపు చివరన పల్లవరాజులు, బౌద్ధమతాన్ని దౌర్జన్యంగా నాశనంచేసి, హిందూమత పునరుద్ధణకు ప్రతిజ్ఞ వహించారు. కళింగదేశం ప్రత్యేకరాజుల పరిపాలనక్రిందకు వెళ్ళింది. ఈ సంధికాలంలో శాతవాహన రాజుల సాంప్రదాయాలను మరి కొంతకాలం దీక్షతో కాపాడిన కీర్తి ఇక్ష్వాకులది. ఈ రాజవంశం అంతరించినమీదట, క్రీ. శ. 250 నుండి 650 వరకు 400సం॥లు ఆంధ్ర దేశంలో వైదికమతం, నిరంకుశరాజరికం పెత్తనం వహించాయి.బౌద్ధ శిల్పాలను నాశనంచేసి హిందూ దేవాలయాలను నిర్మించటం జరిగింది.

ఉప్పెనగా వస్తున్న ఈ కల్లోల్యాన్ని కొంతవరకు ఇక్ష్వాకు రాజులు ఆపగలిగారు.

## రాజ్య విస్తీర్ణం:

విజయపురి రాజధానిగా ఇక్ష్వాకు రాజులు నెల్లూరునుండి, గోదావరివరకు సర్కారు ప్రాంతాన్ని, తెలంగాణా ప్రాంతాన్నిపరి పాలించారు. రాయలసీమలోని పశ్చిమభాగం, చూటుకులనాగవంశస్తు లనే రాజుల పరిపాలనక్రిందకు వెళ్లింది. వీరి పరిపాలనా విశేషాలకు ప్రధానాధారాలు నాగార్జునకొండ శిథిలాలు, శాసనాలుమాత్రమే.

మొదటి రాజైన వాసిష్ఠీ పుత్రశాంతమూలుడు కడపటి శాతవాహన రాజులవద్ద సామంతరాజుగానో, సేనానాయకుడుగానో ఉండి రాజ్యాధికారం స్వీకరించి ఉంటాడు. భుజబల శక్తితో రాజ్యాన్ని నలుమూలలా విస్తరింపజేసి విజయసూచకంగా అశ్వమేధ యాగం చేశాడు. ఇతని కుమారుడు మాఠరీపుత్ర వీరపురుషదత్తుడు నాగార్జునకొండలో చెక్కించిన ఒక శాసనం ఇలా వుంది:

"కోట్లకొలది బంగారు నాణెములను, వేలకొలది ఆవులను వాసిష్ఠీపుత్ర శాంతమూలుడు దానంజేశాడు. వేలకొలది నాగళ్ళతో భూమిని సాగులోకి తెచ్చాడు. ఉజ్జయినీ నగరంలోని మహాసేనుని పూజించాడు."

కుమారస్వామి భక్తుడని, అప్రతిహత సంకల్పుడని, సామ్రాట్ అని కూడా ఈరాజు కీర్తించబడ్డాడు. ఈయన భార్య మాఠరీదేవి. సోదరి శాంతిశ్రీ. శాంతిశ్రీ గాఢమైన బౌద్ధాభిమానం కలది. శాంతి మూలరాజు అశ్వమేధయాగాలు చేస్తూంటే, ఈమె బౌద్ధభిక్షువులను దాన ధర్మాలు చేస్తూఉండేది. ఈమె భర్త మహా తలవర, మహా సేనానాయక, స్కంద విశాఖనాథుడు, ధనక రాష్ట్రానికి అధిపతి. ధనక రాష్ట్రం అంటే, ప్రస్తుతం గుంటూరు జిల్లాలోని తెనాలి, రేపల్లె, బాపట్ల, తాలూకాల ప్రాంతం. ఆంధ్ర చరిత్రలో ఈ ప్రాంతానికి వివిధ దశలలో వివిధ నామాలు ఉంటూఉండేవి. ధనక రాష్ట్రము అనేది అందులో మొదటిది.

ఇక్ష్వాకు రాజులు క్షత్రియులు. కాని, బ్రాహ్మణ స్త్రీలను వివాహం చేసుకున్నారు. మాఠరీదేవి బ్రాహ్మణస్త్రీ.

## శాంతిశ్రీ శాసనాలు:

మాఠరీపుత్ర వీరపురుషదత్తుడు, అతని భార్యలు, మేనత్త నాగార్జున కొండపైన అనేక శాసనాలు చెక్కించారు. శాంతిశ్రీ చెక్కించిన ఒక శాసనంలో ఇలా ఉంది.

"బ్రాహ్మణులు, శ్రమణకులు, నిరాధారులైన పేదప్రజలపట్ల కనికరించి, శాంతిశ్రీ విస్తారంగా దానాలు చేసింది. ఆమె వితరణ శీలి, కుటుంబంలో సభ్యులఎడల ఎంతో ప్రేమగలది. పుట్టినింటి వారికి, మెట్టినింటివారికి క్షేమం కలగవలెనని కోరేది. బౌద్ధ భిక్షువులకు ఒక ఆరామం కట్టించింది." మరొక శాసనంలో ఇలాఉంది.

"తన అల్లుడైన మాఠరీపుత్ర విరూపాక్షదత్తుడు దిగ్విజయ యాత్రలో విజయవంతుడు అయ్యేందుకు, తన మోక్షసాధనకు మరొక ఆరామాన్ని కట్టించింది."

ఈ ఆరామాలన్నిటినీ భదంతాచార్యులు నిర్మించారు శిల్పులపేర్లు ప్రాచీన శిల్పాలలో లిఖించడం అరుదు. నాగార్జునకొండ శిల్పాలలో మాత్రం ఇందుకు విరుద్ధంగా శిల్పులపేర్లుకూడా కనపడుతున్నాయి.

రాజకుటుంబానికి చెందినవారు మాత్రమేగాక, సామాన్య స్త్రీలుకూడా విశేషంగా దానాలుచేసి, శాసనాలు చేకూర్చేవారు. రాజుగారివద్ద కోశాధికారిగాఉన్న బోధిశర్మ మేనకోడలు బోధిశ్రీ, బౌద్ధ ధర్మాన్ని స్వీకరించి, ఉపాసిక అను పేరు వహించింది. ఈమె వివిధ దేశాలనుండి నాగార్జునకొండకువచ్చే బౌద్ధభిక్షువుల కొరకు ఆరామాలను నిర్మించింది. తామ్రపర్ణ (సింహళదేశం) కాస్మీర (కాశ్మీరదేశం) గాంధార చీనా (చైనా), తోసలి, అపరాంతం, వంగ, వనవాస, యవన, దమిళ దేశాలనుండివచ్చే బౌద్ధభిక్షువుల సౌకర్యార్థం ప్రత్యేక ఆరామాలను కట్టించింది. చైనా, సింహళం, కాశ్మీరు దేశాలనుండి బౌద్ధభిక్షువులు నాగార్జునకొండకువచ్చే వారని దీనిద్వారా తెలుస్తున్నది. అంతేకాదు, మహావంశమను బౌద్ధగ్రంథంలో ఇలా వర్ణించబడ్డది. మహాదేవుడను బౌద్ధభిక్షువు, పల్లవభోగం (పల్లవనాడు, లేక పల్నాడు) ప్రాంతంలో చాలాకాలం బౌద్ధమత ప్రచారంచేసి, **14** లక్షల **60** వేలమంది బౌద్ధభిక్షువులతో సింహళదేశం వెళ్ళాడు. జీవనోపాధికొరకు పెద్దపెట్టున ప్రజలు ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి వలసలు వెళ్ళిన ఉదాహరణలు ప్రాచీనచరిత్రలో అనేకం. ఇట్టి వలసలను బౌద్ధమతగురువులు నాయకత్వంవహించి, ఈ ప్రజానీకమంతా, కొత్తదేశంలో స్థిరపడి జీవించటానికవసరమైన పరిస్థితులు కల్పించేవారని ఈ కథవల్ల తెలుస్తున్నది.

## వీర [illegible]త్తుని శిల్పాలు :

వీర పురుషదత్తుడు బౌద్ధమతాన్ని అభిమానించటం మాత్రమే కాక, వృద్ధాప్యంలో రాజ్యాన్ని కుమారుడైన బాహుబలశాంతీ మూలునికిచ్చి సన్యాసాశ్రమం స్వీకరించినట్లు, హిందూమతాన్ని అణచివేసినట్లు ఆయన చెక్కించిన ఈ క్రింది శిల్పాలద్వారా తెలుస్తుంది.

నాగార్జునకొండవద్దనున్న ఒక్క స్తంభంపైన ఈ శిల్పాలన్నీ చెక్కబడ్డాయి. మొదటి శిల్పంలో, బుద్ధుడు స్వర్గంనుంచి క్రిందకు దిగుతూఉంటాడు. రాజు బుద్ధునివద్దకు పోబోతూఉంటాడు. రాణులు అతనిని నివారిస్తూ ఉంటారు. తరువాత చిత్రంలో, రాణుల ఆటంకాలను నిర్లక్ష్యంచేసి, బుద్ధునివద్ద సాష్టాంగ ప్రమాణం స్వీకరిస్తాడు. మూడవ చిత్రంలో, రాజు తన కాలితో శివలింగాన్ని త్రోసివేస్తూ ఉంటాడు. శివలింగంచుట్టూ బ్రహ్మాండమైన నాగుబాము ఉంటుంది. మరొక శిల్పంలో రాజు సాధారణ వస్త్రాలు ధరించి 8 మంది అనుచరులతో సన్యాసాశ్రమానికి వెళ్ళుతున్నట్లు చిత్రించబడ్డది. ఆఖరు చిత్రంలో రాజకుమారుడు తండ్రి గౌరవార్థము విస్తారమైన ధనాన్ని భిక్షువులకు దాన మిస్తున్నట్లుంది. ఈ శిల్పాలలో ఒక విశేషముంది. అమరావతీ శిల్పాలలో కేవలం బుద్ధుని జీవితవిశేషాలు మాత్రమే చిత్రవిచిత్ర రీతులలో వర్ణించబడ్డాయి. నాగార్జునకొండలోని బుద్ధుని జీవిత విశేషాలతోపాటు, పరిపాలించిన రాజు జీవిత చిత్రాలుకూడా చెక్కబడ్డాయి.

## ప్రాంతాల పేర్లు :

వీరపురుషదత్తుడు బాహుబలంతో, కొత్తప్రాంతాలనుకూడా జయించి, సుస్థిర పరిపాలన చేశాడు. నాగార్జునకొండ శాసనాల సహాయంతో నాటి ఆంధ్రదేశంలోని వివిధ రాష్ట్రాల పేర్లను తెలుసుకోవచ్చు.

గుంటూరులో ప్రవహించే గుండ్లకమ్మ నదికి  పుల సముద్ర పర్యంతమూ ఉన్న ప్రాంతం పూగినాడు అనబడేది. నంది కొట్కూరు, మార్కాపురం, వినుకొండ, నరసారావుపేట, బాపట్ల, ఒంగోలు, పొదిలి - తాలూకాల గుండా ఈ నది ప్రవహిస్తుంది. పూగినాడు, శేకపూగి విషయ అనునది క్రమంగా పోకనాడు, పాకనాడు అని రూపాంతరం చెందింది. పాకనాటి వారను పేరుతో ఇప్పటికీ కొన్నికులాలు వ్యవహరించబడటం ఉంది.

కడప ఉత్తరభాగం, హిరణ్యక రాష్ట్రం అనబడేది. కొంత కాలానికి ఈ పేరునశించి, రేనాడు అను పేరు స్థిరమై నేటికి వ్యవహరింపబడుతున్నది.

## తెలుగు భాషాభివృద్ధి:

ఇక్ష్వాకు రాజులందరూ ప్రాకృత భాషలోనే శాసనాలు చెక్కించారు. కాని తెలుగు పదాలు అనేకం శాసనాలలో ప్రవేశించ సాగాయి. తెలుగు, పైశాచీ ప్రాకృత భాషల సంయోగ ఫలితంగా నేటి ఆంధ్రభాష రూపొందుట కూడా ఆనాడే ప్రారంభమైంది. తలారి అనే అచ్చ తెలుగుమాట మహా అనే విశేషణంతో కలిసి, మహా తలవరిగా శాసనాలలో ప్రవేశించింది. నాటిప్రజల, పేరుకూడా శాసనాల ద్వారా తెలుసుకోవచ్చు. స్త్రీల పేర్లు నాగసిరి, గోలసిరి, పరజాతిసిరి, బాపిసిరి మొదలైనవి. ఇందులో గోల అచ్చం తెనుగుపదం. పురుషుల పేర్లు నాగంన, (నాగన్న) వీరంన (వీరన్న) సంస్కృత భాషాప్రాబల్యంగల పేర్లు కూడా వాడుకలో ఉండేవి. బుధిమణిక, రేవతిమణిక, సరసిక, కసుమలత స్త్రీల పేర్లు. పురుషులను మహాచండ ముఖ, శూలచండ ముఖ, మహామూల,శూల మూల అను పేరులు ఉన్నాయి.

ప్రజలు మాట్లాడే ప్రాకృత భాష తెనుగుభాష సమ్మేళనం చెందింది. క్రమంగా ఆంధ్రభాష వృద్ధిఅయింది. రాజులు, పండితులు, శాసనాలలోను, గ్రంథాలలోను వాడే భాషలో సంస్కృత ప్రాబల్యం వృద్ధిఅయింది. ఈవిధంగా ప్రాకృతం క్రమంగా నశించింది. వ్యావహారిక భాష, శాసనభాష అంతకు పూర్వమున్న కొద్దిపాటి సంబంధాన్ని కోల్పోయి పూర్తిగా వేరుపడ్డాయి. ఇలా విడిపోవటం ఒకవిధంగా మంచిదేఅయింది. ఆంధ్రభాష ప్రజాభాషగా రూపొంద సాగింది. సంస్కృతం శాసనాలలో మాత్రమే ఉండి, క్రమంగా కృతక భాషగా తయారైంది.

నాగార్జునకొండ – విజయపురి:

నాగార్జునకొండతో ప్రారంభించి, శ్రీశైలపర్వతంవరకు గల పర్వతపంక్తిని శ్రీపర్వతం అని పురాణాలు, బౌద్ధ గ్రంథాలు వర్ణించాయి. ఇక్ష్వాకు రాజులు పార్వతేయులని కూడా వర్ణించ బడ్డారు. ఇక్ష్వాకు రాజులు, తాము సాక్షాత్తు శ్రీ రామ చంద్రుని వంశస్థులమని చెప్పుకున్నారు. కనుకనే ఇక్ష్వాకులనే పేరు ధరించారు. అతి ప్రాచీనమైన వస్తువులను, ఇక్ష్వాకులనాటిసరకు అని ఇప్పటికీ మనం వాడుతున్నాము.

నాగార్జునకొండవద్ద లోయలో విజయపురి నిర్మింపబడ్డది. ఆ నగరానికి ఒకవైపున కృష్ణానది, మిగతావైపున కొండలు సహజ రక్షణ కుపకరించాయి. ఇప్పటికీ నీటిని నిలవచేసిన పెద్దరిజర్వాయరు అవశేషాలను, ఏనుగులు నదిలో నీరు త్రాగటానికి దిగే చోటును, పడవలు ఆగే రేవు ప్రాంతాన్ని చూడవచ్చు. కృష్ణానదీ ముఖ ద్వారంవద్దనుండి, పెద్ద పెద్ద పడవలు ఈ రేవుకు వస్తుండేవి.

టోలమీ అను చరిత్రకారుడు క్రీ. శ. 150 సంవత్సరాల ప్రాంతంలో ఆంధ్రదేశం సంచారం చేశాడు. కృష్ణా గోదావరీ నదులలో, ముఖద్వారంనుండి పెద్ద పెద్ద పడవలు తూర్పుదిశగా

ప్రయాణం చేసేవని వ్రాశాడు. ప్రయాణీకులకొరకు ఒకటి, సరుకుల రవాణా కొకటి రెండురకాల పడవ లుండేవనికూడా వర్ణిం చాడు. కృష్ణా, గోదావరినదుల పేర్లను మాత్రమేగాక, ఋషికన్య, వంశధార, నాగావళి, శారద, తాండవ, గుండ్లకమ్మ నదుల పేర్లను కూడా టోల్మీ వర్ణించాడు. విదేశాలతో విశేషంగా వ్యాపారం జరుగుతుండేది. చైనానుండి పట్టువస్త్రాలు దిగుమతి అయ్యేవి. చీనాంబరాలు -చైనానుండి వచ్చిన గుడ్డలు-అను పేరు పట్టుబట్టలకు అప్పటినుండే ప్రసిద్ధికెక్కింది.

నాగార్జునకొండపై చైత్యగృహాలలో తూర్పుదిక్కుగా ఉన్న వానిని పూర్వశిలాచైత్యాలని, పశ్చిమదిక్కుగా ఉన్నవాటిని అపర శిలాచైత్యాలని బౌద్ధగ్రంథాలు వర్ణించాయి. నాగార్జునకొండ ఆనాడు వేలకొలది బౌద్ధభిక్షువులకు నిలయంగా ఉండేది. గొప్ప విద్యాకేంద్రం. బౌద్ధమతం వర్ణవ్యవస్థతో రాజీపడి, కులాచారాలకు కట్టుబడినదని చెప్పటానికి ఒక నిదర్శనముంది. నాగార్జున కొండలోని ఒక భాగంపేరు శూద్రధర్మగిరి. ఇచ్చట శూద్రులను ప్రత్యేకం ధర్మబోధను బౌద్ధభిక్షువులు చేసేవారట.

నాగార్జునకొండ శిల్పాల ప్రావీణ్యాతను, అభిజ్ఞులు విశేషంగా మెచ్చుకుంటారు. నాటి ప్రజాజీవితాన్ని తెలుసుకోటానికి నాగార్జున కొండ శిల్పాలు ఎంతగానో ఉపయోగపడతాయి. దొరకినంతవరకు ఇవి ప్రస్తుతం మద్రాసులో భద్రం చేయబడినవి.

ఇక్ష్వాకు రాజ్యపతనంతో నాగార్జునకొండ, విజయపురి నగరాల శోభ అంతరించింది. పల్లవరాజులు ఆంధ్రదేశంపై దండెత్తి విజయపురిని నాశనం చేసారు. నాగార్జునకొండలోని భౌద్ధభిక్షువులను తరిమివేసారు. బౌద్ధచైత్యాలన్నీ ధ్వంసంచేయబడ్డాయి. ఏమైనా మిగిలితే క్రీ. శ. 600 లో శంకరాచార్యులు నాశనంచేయించాడు. ప్రస్తుతం నాగార్జునకొండ ప్రాంతమంతా శంకరాచార్యుల మఠం ఆస్తిగా ఉన్నది. బౌద్ధచైత్యాల స్థానంలో దుర్గగుడినిర్మించబడ్డది.

# పల్లవ, విష్ణుకుండిన రాజులు

ఇక్ష్వాకురాజుల తర్వాత, ఆంధ్రదేశాన్ని నాలుగు వందల సంవత్సరాలు వీరు సాలంకాయనులు, విష్ణుకుండినులు పరిపాలించారు.

పల్లవుల పరిపాలనా కాలము క్రీ. శ. 200_630. కంచి (కంజీవరం) రాజధానిగా పల్లవులు కృష్ణకు దక్షిణానవున్న ఆంధ్ర దేశాన్ని పరిపాలించారు. ఈ 400 ఏండ్లలోను కృష్ణా – గోదావరి మధ్య ప్రాంతం చిన్న చిన్న రాజులక్రింద పరిపాలనక్రింద చేతులు మారుతూ వచ్చింది.

కృష్ణాజిల్లా కోడూరు రాజధానిగా బృహత్ఫలాయనులు 20 సంవత్సరాలు, చేజెర్ల రాజధానిగా ఆనందరాజులు 20 సంవత్సరాలు, ఏలూరువద్ద వేంగి రాజధానిగా సాలంకాయనులు 50 సంవత్సరాలు పరిపాలించారు. తర్వాత 420 – 620 మధ్య 200 సంవత్సరాలు, విష్ణుకుండిన రాజులు ధాన్యకటకం రాజధానిగా కృష్ణా – గోదావరి మధ్య ప్రాంతాన్ని పరిపాలించారు. కళింగదేశం యిదే కాలంలో, మారరగాంగ వంశస్థుల పరిపాలనక్రింద వున్నది.

విష్ణుకుండిన రాజులకు పూర్వమున్న చిన్నరాజులందరూ, పల్లవులతో రాజీ పడ్డారు. కృష్ణ దక్షిణభాగమంతా పల్లవులు, ఉత్తరాన ఈ చిన్నరాజులు పరిపాలించారు. కాని విష్ణుకుండినులు పల్లవ ఆధిపత్యాన్ని కూలద్రోసి ఆంధ్రదేశాన్నంతా ఐక్యం చేయ

వలయునని ప్రయత్నించారు. అనేక యుద్ధాలు చేశారు. కాని కృతకృత్యులు కాలేదు.

మరొక విశేషంకూడా వుంది. పైన వివరించబడ్డ రాజులందరూ తాము బ్రాహ్మణులమని చెప్పుకున్నారు. కొందరు చిన్న రాజులు బౌద్ధమతాన్ని సహించినా, పల్లవులు, విష్ణుకుండినులు బౌద్ధ సంస్కృతిని సర్వనాశనంచేయ పూనుకున్నారు.

నాగార్జునకొండ, విజయపురి, ధాన్యకటకనగరాలను రెండవ పల్లవరాజు శివస్కందవర్మ నాశనంచేశాడు. ధాన్యకటకం ఉప రాజధానిగా చేసుకొని పల్లవరాజులు పరిపాలించారు. బౌద్ధ ఆగ్రామాల స్థానంలో వైష్ణవాలయాలు ఏర్పడ్డాయి. అందరూ అశ్వమేధ, రాజసూయ యాగాలను చేసినవారే. విష్ణుకుండిన వంశస్థుడైన మాధవవర్మ (515-546) నరమేధ యజ్ఞాన్నికూడా చేసినట్లు చెప్పుకున్నాడు. నిరంకుశరాచరిక వ్యవస్థ నగ్నస్వరూపంలో తాండవించింది.

## పల్లవులు:

శాతవాహన రాజులక్రింద సామంతులుగావుండి, తదనంతరం వీరు స్వతంత్రులై కంచిలో రాజ్యం స్థాపించారు. పల్లవనాడు అని పిలువబడే పల్నాడు ప్రాంతంనుండి వీరు బయలుదేరి, దక్షిణంగా వెళ్ళి కంచిలో స్థిరపడ్డారు. తెలుగుదేశంనుండి బయలుదేరి, తమిళ దేశ సరిహద్దులో రాజ్యం స్థాపించారు. అయితే వీరిరాజ్యంలో ఎక్కువ భాగం ఆంధ్రప్రాంతమే. చివరి 200 సంవత్సరాలు వారి ఆంధ్రదేశ ఆధిపత్యం నామమాత్రంగా ఉండేది. క్రీ. శ. 20)_630 వరకు, మొత్తం 21 మంది రాజులు ఈ వంశములో పరిపాలించారు. వీరకూర్చవర్మ వంశమూలపురుషుడు. రెండవరాజైన శివస్కంధవర్మ ఆంధ్రదేశమును జయించాడు. ఈ రాజుల శాసనాలు, ఒంగోలు, చేబ్రోలు, మైదవోలు, (నరసారావుపేట) అమరావతి, చందలూరు,

కందుకూరు, వాయిలూరు (ఉత్తర ఆర్కాటు) తదితర ప్రాంతాలలో లభించాయి. గుంటూరు, నెల్లూరు, ఉత్తరఆర్కాటు ప్రాంతములు వీరి ప్రధానరాజ్యం. అప్పుడప్పుడు, కడప, కర్నూలు జిల్లాలను వీరు పరిపాలించినా అది తాత్కాలికమే. ఆ ప్రాంతాలను రేనాటి చోళులు పరిపాలించేవారు.

## సాలంకాయనులు - తదితరులు :

బృహత్ఫలాయన వంశస్థుడని చెప్పుకున్న ఒక్కరాజు జయవర్మ. ఇతను 256 - 285 వరకు పరిపాలించాడు. ఇక్ష్వాకు పతనానంతరం వచ్చిన పల్లవులదాడిని ఎదిరించాడు. కాని ఓడిపోయినాడు. తెనాలి తాలూకా పాటూరు గ్రామంలో ఇతని శాసనం దొరికింది.

అటుతర్వాత చేజర్ల రాజధానిగా కందారరాజులు మరికొంత కాలం పల్లవ దండయాత్రను ప్రతిఘటించారు. దామోదరవర్మ అను రాజు 295 - 315 వరకు పరిపాలించాడు. పల్లవులు ఇతనిని ఓడించి సామంతునిగా చేసుకున్నారు. 620 సంవత్సర ప్రాంతంలో, చాళుక్య దండయాత్రను ప్రతిఘటించిన వారిలో ఆనంద వంశస్థులైన కందారరాజులు కూడా ఉన్నట్లు చెప్పబడ్డది.

వీరి తర్వాత సాలంకాయనులు 300 - 420 వరకు వేంగిని రాజధానిగా చేసుకొని కృష్ణా - గోదావరి మధ్యప్రాంతాన్ని పరిపాలించారు. వీరు మొదటినుండి పల్లవులతో స్నేహంగా ఉన్నారు. ఈ వంశములో ఆరుగురు రాజులు. వీరు బౌద్ధ హిందూమతాలను సమానంగా ఆదరించారు. వేంగి గొప్ప విద్యాకేంద్రంగా వుండేది. దిఙ్నాగుడను బౌద్ధపండితు డిక్కడ ఉండేవాడు. ఇతను మహాకవి కాళిదాసు సమకాలికుడు. ఆచార్య నాగార్జునుని శిష్యుడు. బౌద్ధమత గ్రంథాలను అనేకం రచించాడు. వేంగి నగరంలో చిత్రరథస్వామి (సూర్యుడు) దేవాలయాన్ని నిర్మించాడు.

విష్ణుకుండినులు:

విష్ణుకుండినులు 420 - 620 వరకు వీరు అమరావతి రాజధానిగా పరిపాలించారు. పల్లవులతో పోరాడి, గుంటూరు జిల్లాలోని అనేక ప్రాంతాలను తమ అధీనంలోకి తెచ్చుకున్నారు. గుంటూరుజిల్లా వినుకొండ వీరి స్వగ్రామం కనుక నే విష్ణుకుండిన అను పేరు వచ్చినది. ఈ వంశములో మొత్తం 9 మంది రాజులు. క్రీ. శ. 342 - 343 సంవత్సరాల కాలంలో ఉజ్జయిని రాజైన సముద్రగుప్తుడు దక్షిణదేశంపై దండయాత్ర చేశాడు.

సముద్రగుప్తుని దండయాత్ర:

పల్లవరాజైన విష్ణుగోపవర్మ, సాలంకాయనరాజు హస్తివర్మ తదితర రాజులందరూ గలిసి సముద్రగుప్తుని దండయాత్రను ప్రతిఘటించారు. విజయం ఎవరికీ లభించలేదు. దక్షిణదేశ రాజులతో రాజీపడి ఎవరిని వారి రాజ్యంలోనే ఉంచి, సముద్రగుప్తుడు తిరిగి వెళ్లాడు. ఆంధ్రరాజులు కొంతకాలం నామమాత్రంగా గుప్తరాజుల ప్రాబల్యాన్ని ఆమోదించారు. సముద్రగుప్తుని అలహాబాదు శాసనంలో ఇలా ఉంది:

"కోసలరాజైన మహేంద్రుడు, మహాకాంతార పాలకుడైన వ్యాఘ్రరాజు, కులార అధిపతి యంతరాజు, పిష్టపురిరాజు మహేంద్రుడు, గిరికోత్తరు అధిపతి స్వామిదత్తుడు, కంచి విష్ణుగోపుడు, ఎరడపల్లి రాజు దమనుడు, అవయుక్తరాజు నీలరాజు, వేంగిరాజు హస్తివర్మ, పాలకడరాజు ఉగ్రసేనుడు, దేవరాష్ట్ర అధిపతి కుబేరుడు, తదితర దక్షిణదేశ రాజులను సముద్రగుప్తుడు జయించి, తిరిగి వారినే రాజపదవులలో ప్రతిష్ఠించాడు."

ఈ శాసనంద్వారా నాటి దక్షిణదేశ రాజకీయ విభాగాన్ని, ముఖ్యంగా ఆంధ్రదేశ పరిపాలకులను మనం తెలుసుకోవచ్చు.

కోసలప్రాంతం, జబల్‌పూర్, ఛతిస్‌ఘర్ జిల్లాలు, ఒరిస్సాలోని ఏజన్సీ ప్రాంతాలు, మహాకాంతారము, సాంబల్‌పూరు, కిమోంజహార్, మయూరభక్ష్, కలహండి మొదలైన ఒరిస్సా ప్రాంతాలన్నీ ఇందులోనే ఉన్నాయి. ఎరడపల్లి - ప్రస్తుతం శ్రీకాకుళంజిల్లాలోని ఆముదాలవలస, పిష్టపురం - పిఠాపురం, రివెంగి, శాలంకాయన రాజధాని ఏలూరు ప్రక్కనేఉన్న చినవేగి, పెదవేగి నగరములు వేంగి నగరమే. ఆంధ్ర నగరమనికూడా కావ్యాలలో వర్ణించబడ్డవి. గిరికొత్తూరు ఆంధ్ర - ఒరిస్సా సరిహద్దు ప్రాంతాలలో ఉంది. అవముక్తం, భద్రాచలం ఏజన్సీప్రాంతం, దేవరాష్ట్రం - విశాఖ జిల్లా ఎలమంచిలి,అనకాపల్లి ప్రాంతం.

విజ్ఞానవికాసం:

సముద్రగుప్తుని దండయాత్రవల్ల కొన్ని ముఖ్య ఫలితాలు కలిగాయి. తమలోతాము కలహించుకుంటున్న ఆంధ్ర రాజులందరూ ఏకమై సముద్రగుప్తుని ప్రతిఘటించారు. తాత్కాలికంగా అంతః కలహాలు చల్లారాయి.

సంస్కృతి, భాష, సాహిత్యము, విజ్ఞానము, అంతకుపూర్వమే ఆంధ్రరాజు లందరూ ప్రోత్సహించసాగారు. సముద్రగుప్తుని దండయాత్ర ఈ సాంస్కృతిక పరిణామాన్ని మరింత తీవ్రం చేసింది. భారతదేశ చరిత్రలో గుప్తరాజుల పరిపాలన ఒక విధంగా స్వర్ణయుగం.

గణితశాస్త్రం రచించిన ఆర్యభట్టు, ఖగోళశాస్త్రపండితుడు వరాహమిహిరుడు, వైద్యశాస్త్రం రచించిన వాగ్భటుడు, తత్వశాస్త్ర భాష్యాలు వ్రాసిన శబరస్వామి, ప్రశస్తపాదుడు, నీతిశాస్త్రం వ్రాసిన కామందకుడు వీరంతా ఉజ్జయినీ రాజధానిలో, గుప్తరాజుల ఆదరణతో తమతమ విజ్ఞానశాస్త్రాలను పెంపుచేశారు.

ఇంతేగాక మహాకవి కాళిదాసు, భారతి, దండి తదితర సంస్కృత కవులు ఈనాటివారే.

గణితశాస్త్రంలో పూర్ణానుస్వారం (సున్నా) ప్రయోజనాన్ని మొట్టమొదట కనిపెట్టినవాడు ఆర్యభట్టు. అంతేగాక శాస్త్ర సాల భ్యాని కుపయోగపడే అనేక సంజ్ఞలను ప్రవేశపెట్టాడు. సూర్య, చంద్రగ్రహణ కాలాలను లెక్కగట్టడం, పంచాంగాన్ని గుణించటం కనిపెట్టింది కూడా ఇతడే. భూమి సూర్యుని చుట్టూగాక, తనకక్షపై ననే తిరుగుతూందని నిరూపించాడు.

వరాహమిహిరుడు పై ఖగోళశాస్త్రాన్ని మరింత వృద్ధిచేసి అనేక గ్రంథాలువ్రాశాడు. శిల్పశాస్త్రం, గృహనిర్మాణశాస్త్రం, శరీరశాస్త్రం, లోహశాస్త్రం మొదలైనవన్ని చేర్చి బృహత్సంహిత రచించాడు. తన గ్రంథాల్లో వరాహమిహిరుడు గ్రీకు ఖగోళ శాస్త్రజ్ఞుల ప్రశంసించాడు. ఆక్షేత్ర గణితం విషయంలో గ్రీకులవద్ద నుండి స్వీకరించవలెనని నిరూపించాడు.

బౌద్ధమతవిధ్వంసం:

పల్లవ, విష్ణుకుండినరాజులు గాఢమైన హిందూమతాభి మానులు. ఆంధ్రదేశంలో శాతవాహనులకాలంనుండి, పాతుకు పోయిన బౌద్ధసంస్కృతిని సమూలంగా నాశనంచేయ సంకల్పిం చారు. పల్లవరాజులు నాగార్జునకొండను, విజయపురినగరాన్ని ధ్వంసంచేయుటయేగాక గుంటూరు నెల్లూరుజిల్లాలలోని అనేక బౌద్ధ ఆరామాలను వైష్ణవదేవాలయాలుగా మార్చారు. విష్ణుకుండిన రాజులు మరొకడుగు ముందుకు వెళ్ళారు.

విష్ణుకుండినరాజవంశస్థాపకుడైన మాధవవర్మ (420—453) అశ్వమేధ, రాజసూయ యాగాలను చేసాడు. అమరావతి స్తూపాన్ని

ధ్వంసం చేసాడు. చైనాయాత్రీకుడు 'హుయన్-త్సాంగ్' ఈ క్రింది విధంగా వ్రాశాడు.

"అమరావతిస్తూపం బౌద్ధభిక్షువుల ఆధీనంలోవుంది. బ్రాహ్మణులు ఈ స్తూపంపై పెత్తనంకావాలని తగాదా పెట్టారు. బౌద్ధభిక్షువులు ఆరామంలోపల తలుపులు బిగించుకుకూర్చున్నారు. బైట బ్రాహ్మణులు ముట్టడివేశారు. చివరకు బౌద్ధభిక్షువులు తలుపుతీసి రాజుగారి మధ్యవర్తిత్వం అడుగుదామని బయటికి వెళ్లారు. ఈ అవకాశం దొరకగానే బ్రాహ్మణులు దౌర్జన్యంగా ఆరామంలో ప్రవేశించి ఆక్రమించుకున్నారు. రాజు బ్రాహ్మణులదే న్యాయమని తీర్పుచెప్పాడు. బౌద్ధభిక్షువులు స్థానభ్రష్టులై లేచిపోయారు. కొద్ది రోజులతర్వాత బ్రాహ్మణులు ఆరామాన్ని ధ్వంసంచేసి, అమరేశ్వర ఆలయాన్ని నిర్మించారు."

విష్ణుకుండినరాజుల కాలంలోనే మొగల్ రాజపురం, ఉండవల్లి గుహాలు నిర్మించబడ్డాయి. ఉండవల్లిలోని అంతకుపూర్వమున్న బుద్ధ విగ్రహాన్ని విష్ణువిగ్రహాంగా మార్చి అనంతశయనుడు అని పేరు పెట్టారు.

పల్లవరాజులతో పోరాటం :

విష్ణుకుండిన రాజులందరూ పల్లవులతో పోరాడుతూనే ఉన్నారు. పల్లవులు ఆంధ్రదేశంనుండి వెళ్ళినవారైనప్పటికి, తమిళ ప్రాంతంలో కూర్చుని రాజ్యం చేయడంతో క్రమంగా ప్రజలకు దూరమైనారు. అంతేగాక ఆంధ్ర, తమిళ దేశాలను జయించి పల్లవసామ్రాజ్యాన్ని స్థాపించాలని వారు ప్రయత్నించారు. ఈ ప్రయత్నాలను జయప్రదంగానిరోధించినవారిలో విష్ణుకుండినరాజులు ముఖ్యులు.

క్రీ॥ శ॥ 458–488 మధ్యకాలం ఆంధ్రదేశ చరిత్రలో అతి ప్రధాన ఘట్టం.

పల్లవరాజు త్రిలోచనపల్లవుడు కంచిలో పరిపాలించసాగాడు. కృష్ణనుదాటి ఆంధ్రదేశాన్నంతా జయించవలెనని అతను ప్రయత్నించాడు. అదేవిధంగా, దక్షిణదిశగా కావేరివరకు సామ్రాజ్యాన్ని వ్యాపింపజేయాలని చూశాడు. కావేరీ ముఖద్వారంలో కావేరీ నగరమను పట్టణం రాజధానిగా కరికాళచోళుడు రాజ్యం చేస్తూండేవాడు. ఆంధ్రదేశంలో రెండవ మాధవవర్మ పరిపాలించేవాడు. వీరిద్దరూ త్రిలోచన పల్లవుని ప్రయత్నాలను వ్యతిరేకించారు. వీరితోపాటు వాతాపిచాళుక్య రాజకుమారుడు విజయాదిత్యుడు ఐక్యమైనాడు. వీరంతాకలిసి త్రిలోచన పల్లవుని ఓడించి, అతని సామ్రాజ్యకాంక్షను ధ్వంసంచేశారు. కడప, కర్నూలు సరిహద్దు ప్రాంతంలో త్రిలోచన పల్లవునికీ, విజయాదిత్యునికీ యుద్ధం జరిగింది. విజయాదిత్యుడు ఓడిపోయినాడు. ఆయన భార్య కడపజిల్లా పెద ముడియం గ్రామంలో ఒక బ్రాహ్మణుని యింట తలదాచుకున్నది.

## కరికాళచోళుడు:

కాని విజయాదిత్యుని ఓడించిన త్రిలోచన పల్లవుడు కరికాళ చోళునిచేత, రెండవ మాధవవర్మచేత పూర్తిగా ఓడించబడ్డాడు. ఈ యుద్ధాలు ఎక్కడ జరిగినదీ స్థలం నిర్దేశించలేము. కాని కరికాళ చోళుని గాథ తిరుక్కురళ్ అనే తమిళ గ్రంథంలో వర్ణించబడ్డది. ఇతను త్రిలోచన పల్లవుని ఓడించుట మాత్రమేకాక అతనిచేత మట్టి తట్టలు మోయించి కావేరికి ఆనకట్ట కట్టించాడట. ఈ విధంగా త్రిలోచన పల్లవుని సామ్రాజ్య విస్తరణ ప్రయత్నాలు భగ్నమయినాయి.

కరికాళ చోళుడు ప్రజారంజకుడైన రాజని, చెరువులను తవ్వించి, ఆనకట్టలు కట్టించి వేలకొలది ఎకరాలు సాగులోకి తెచ్చాడని గ్రంథాలు వివరిస్తున్నాయి. పాల్కురికి సోమనాథుని బసవ పురాణం కరికాళ చోళుడు పరమశైవుడనీ, గొప్ప భక్తుడనీ

వర్ణించింది. తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో కూడా ఇతని ప్రశంస ఉంది.

సామ్రాజ్య దురహంకారుల పీచమణచి ప్రజాభిమానం పొందినవాడు కరికాళచోళుడు. ఆ ప్రయత్నంలో సహాయపడ్డవాడు, విష్ణుకుండిన వంశస్థుడైన రెండవ మాధవవర్మ.

కడప, కర్నూలు జిల్లాలు, మహబూబ్ నగర్, నల్లగొండ జిల్లాలు తెలుగుచోళుల ఆదిమనివాస స్థలం. వారందరూ కరికాళ చోళుని తమ వంశకర్తగా చెప్పుకున్నారు.

కడపజిల్లాలో దొరికిన కొన్ని గ్రామకైఫీయతులలో కరికాళ చోళుడు చేసిన ప్రజోపయోగకార్యాల ప్రశంస ఉంది.

ఈ ఓటమితో త్రిలోచన పల్లవుడు చోళులతో రాజీపడ్డాడు. తెలంగాణాలోని చోళ కుటుంబాలను తెచ్చి, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో ప్రాంతీయ పాలకులుగా నియమించాడు. వీరే వెలనాటి చోళులని, దుర్జయ వంశస్తులనే పేరుతో గుంటూరు, నెల్లూరు జిల్లాలను చాలాకాలం పాలించారు.

## భాషాభివృద్ధి:

విష్ణుకుండినరాజులు పల్లవ సామ్రాజ్యాన్ని ధిక్కరించి, ఆంధ్రుల స్వాతంత్ర్యాన్ని కాపాడుటతోపాటు భాషాప్రోత్సాహాన్ని విరివిగా చేసారు. వేదపండితులకు గోదావరీతీరంలో విశేషంగా అగ్రహారాలను కల్పించింది ఈ రాజులే.

ఈ వంశంలో ఆఖరివాడైన మూడవ మాధవవర్మ (546_611) కాలంలో 'జనాశ్రయచ్ఛందోవిచ్ఛిత్తి' అను గ్రంథాన్ని గణస్వామి రచించాడు. సంస్కృత ఛందస్సుతోపాటు సీస, గీత, కందపద్యాలున్నట్లుదహరించబడ్డాయి. తెలుగుకవిత్వం ఆనాటికే ప్రారంభ మయినట్లు నిదర్శనం.

## న్యాయ పరిపాలన :

నాటి న్యాయపరిపాలన అతి దారుణంగా ఉండేది. దివ్య పద్ధతులనే పేరుతో నేరం ఋజువుచేయడానికి అనేక శిక్షలు విధించేవారు. చెఱువులలో ముంచడం, కాగుతున్న నూనెలో చేయిపెట్టడం మొదలైనవి ప్రయోగించి, ఎట్టి ప్రమాదం కలుగకపోతే ఆ వ్యక్తి నిర్దోషిఅని నిర్ణయించేవారు. ఇవి ఎంత అమానుషమో వేరే చెప్ప నక్కరలేదు. భాషాపోషణచేసిన మూడవ మాధవవర్మరాజు "అవశిత వివిధ దివ్యస్య" న్యాయపరిపాలనలో అఖండుడని వర్ణించబడ్డది. నేరంచేసినందుకు తన కుమారుని ఈ రాజు కొరతవేయించాడట. అతని నిష్పక్షపాతబుద్ధికి మెచ్చి, విజయవాడ దుర్గ ప్రత్యక్షమై ఆకుమారుని బ్రతికించిందట. ఈకథ దగ్గుపల్లి దుగ్గన రచించిన నాశికేతూపాఖ్యానంలోను, నంది మల్లన, ఘంట సింగయ్య రచించిన ప్రబోధ చంద్రోదయంలోకూడా ఉంది.

పరిపాలనావిధానం అతి సౌష్టవంగా ఉండేదని, రాజాజ్ఞ అతి కఠినంగా అమలుజరుపబడేదని, ఫాహియాన్ అను చైనా యాత్రీకుని రచనవల్లకూడా తెలుస్తున్నది. ప్రజలపై 18 విధములైన పన్నులు విధించబడేవని రాజుల శాసనాలద్వారా తెలుస్తున్నది.

పాలు, పెరుగు, నెయ్యి, తదితర వస్తువులు రాజోద్యోగుల సంచార సమయాల్లో ఉచితంగా సప్లయి చేయాలి. ఉప్పు, పంచదార వ్యాపారంపై రాజుదే పూర్తిగా పెత్తనం. సైనికులకు ప్రయాణానికవసరమైన వాహనాలను గ్రామస్తులు ఉచితంగా ఇవ్వాలి. బంజర్లలోని కట్టె, కంప, గడ్డిపై మొదటిహక్కు రాజుది. తర్వాత రాజు అనుజ్ఞపై ఇతరులు వాడుకోవచ్చును. ఈ క్రింది రాజోద్యోగులపేర్లు తెలియవస్తున్నవి; రాజకుమార, సేనాపతి, రాష్ట్రిక, మదంబిక, దేశాధికగోవల్లభ, అశ్వవల్లభ, గ్రామభోజక, ఇత్యాదులనేకులు పరిపాలనా యంత్రములో ఉండేవారు. పల్లవరాజుల ఒక

దాన శాసనం చూస్తే, ఆకాలంలో ఎంతస్పష్టంగా స్థలనిర్దేశం చేసేవారో తెలుస్తుంది.

"ఈ గ్రామంలో రెండువందల నివర్తనాల భూమిఉంది. పడమర కందుకూరు, దక్షిణాన,తూర్పున సుప్రయోగవతి, ఉత్తరాన మహాపథం (ట్రంకురోడ్డు) ఉన్నాయి. రోడ్డుకు ఉత్తరంగా చింత చెట్టు, ఆపైన ఒకగుట్ట, ఆపైన ఒక రాళ్ళపోగు ఉన్నాయి. ఆ రాళ్ళపోగు ఈ స్థలానికి సరిహద్దు. ఈ గుర్తులమధ్యనున్న భూమిని, అన్ని హక్కులతోను బ్రాహ్మణులకు దానం చేస్తున్నాను. గ్రామాధికారులు ఇది గుర్తుంచుకోవాలి. ఏమాత్రం పన్ను వసూలు చేయరాదు. సైనికులు, రాజభటులు గ్రామంలో ప్రవేశించరాదు."

# కళింగరాజులు

ఆంధ్రులవలెనే కళింగులు అతి ప్రాచీనమైన తెగ. రామాయణ భారత గ్రంథాలలో అంగ, వంగ, కళింగ, పదాలు ఎల్లప్పుడూ కలిసి ఉపయోగింపబడుతూ వచ్చాయి. కళింగులు బలిచక్రవర్తి సంతానమని పురాణాలలో వర్ణించబడింది.

మహాభారత యుద్ధంలో అనగా (క్రీ॥ పూ॥ 1500 - 2000) సంవత్సరాల మధ్య కాళింగులు 60 వేల రథాలతో, పది వేల ఏనుగులతో కౌరవుల పక్షాన యుద్ధం చేసారట. ఆనాడు వారు ప్రస్తుత కళింగదేశంలోకాక (చికాకోల్, విశాఖజిల్లాలు) గంగానదికి దక్షిణ భాగంలో, అనగా ఖరగపూర్ ప్రాంతాల్లో నివసించి ఉండేవారని చరిత్రకారులు భావిస్తున్నారు. మహాభారత యుద్ధానంతరం ఏర్పడ్డ కల్లోల పరిస్థితులవల్ల, కాటకంవల్ల వీరు క్రమంగా దక్షిణదిశగా పురోగమించి బంగాళాఖాతం ఒడ్డున, మహానదీ గోదావరి మధ్య ప్రాంతాలలో స్థిరపడ్డారు. కటక్, బరంపురం, చికుకాకి, విశాఖ జిల్లాలు మాత్రమేగాక పిఠాపురంవరకూ కళింగదేశమనే వ్యవహరించబడ్డది. ఈ అభిప్రాయాన్ని బౌద్ధజాతక కథలలోని విషయాలు బలపరుస్తున్నాయి.

**బౌద్ధగాథలు:**

బౌద్ధ జాతక కథలన్నీ క్రీ. పూ. 500 తర్వాతనే రచించబడ్డాయి. అయితే కొన్ని ప్రాచీన గాథలను కూడా ఇవి ఉల్లేఖించి

నాయి. క్రీ. పూ. 543 సం॥ (గౌతమ బుద్ధుని నిర్యాణం తర్వాత కొద్ది రోజులకు) విజయుడనే రాజు కళింగదేశంలో పరిపాలించే వాడు. అతడు 700 మంది పరివారంతో బౌద్ధబిక్షువులతో ఓడల పైన బుద్ధుని అవశేషాలను కొన్నిటిని తీసుకుని, సముద్ర మార్గాన సింహళం వెళ్ళినట్లు వెస్సంతర జాతకం తెలియజేస్తున్నది.

విజయుడనే రాజు కళింగదేశం నుండి వచ్చినట్లు, సింహళ చరిత్ర గ్రంథాలు దృఢపరుస్తున్నాయి. అంతేగాదు. విజయుడు ఒక పరివారంతో ఓడ యెక్కి ప్రయాణం చేస్తున్నట్లు ఒక శిల్పం సింహళ దేశంలో వుంది.

బుద్ధుని నిర్యాణానంతరం, అతని శరీరావశేషాలను బౌద్ధులు వివిధ ప్రాంతాలకు తీసుకువెళ్ళి, ఆ చిహ్నాలను భూస్థాపితం చేసి, వాటిపై స్థూపాలు నిర్మించారు. అమరావతీ స్థూపం ఇలాంటిదే. కళింగ దేశంలో దంతపుర మనేచోట కూడా ఇలాంటి స్థూపం నిర్మించబడ్డది. ప్రస్తుతం చికాకోల్ స్టేషను సమీపంలో దంతవక్త్రుని కోట అను పిలవబడే దిబ్బ, ప్రాచీనమైన దంతపురమని, చరిత్రకారులు చెపుతున్నారు.

కుంభవతీ పురంలో ప్రజాపీడకుడైన దండకుడనే రాజు పరిపాలించేవాడని, అతని దుష్కృత్యాల ఫలితంగా రాళ్ళ వర్షం కురిసి కుంభవతీ నగరమంతా ధ్వంసమైందనీ, అతని సామంతులు బౌద్ధ ధర్మాన్ని స్వీకరించి, ప్రజారంజకులుగా పరిపాలించారని, మరొక జాతక కథ తెలియజేస్తున్నది. ఈ కుంభవతీ నగరం కళింగ దేశంలో, ఎక్కడ ఉండేదో చెప్పలేము. బౌద్ధమతం అతి ప్రాచీన కాలం నుండి, బహుశా ఆంధ్రదేశంలోకంటె కూడా ముందుగానే, కళింగ దేశంలో వ్యాపించినదని మనం గ్రహించగలము. పురాణాల లోను, బౌద్ధ గ్రంథాలలోను ఆంధ్రుల ప్రశంసకంటే, కళింగుల

ప్రశంస అనేక సందర్భాలలో చేయబడ్డది. కళింగులు బహుశా ఆంధ్రుల కంటే కూడా ప్రాచీనులై ఉండవచ్చు.

కళింగ దేశం అశోకునికి పూర్వము క్రీ. పూ. 336 నుండి, 437 వరకు నందరాజుల పరిపాలన క్రింద ఉండేది. వారి రాజధాని పాటలీపుత్రము. బౌద్ధమతంతో పాటు జైనమతము కూడా కళింగ దేశములో విశేష వ్యాప్తిని చెందింది. బౌద్ధ, జైన మతములు రెండూ హిందూ మతంపై తిరుగుబాటుగా ప్రారంభమైనవి. కాని జైనమతంలో మొదటినుంటి శక్తిపూజలు, ఆరాధనలు, మంత్ర తంత్రాలు ప్రబలంగా ఉండేవి. నందరాజులు కళింగ దేశాన్ని పరిపాలిస్తుండగా జైనమతం విస్తారంగా వ్యాపించి ఉండేదని, అనేక జైనవిగ్రహాలను నందరాజులు పాటలీ పుత్రానికి తరలించుకు పోయారని, క్రీ. పూ. 183 ప్రాంతంలో కళింగదేశాన్ని పరిపాలించిన ఖారవేలుని హాతిగుంఫా శాసనం ద్వారా తెలుస్తున్నది.

## అశోకుని దండయాత్ర:

అశోకుని కళింగ దండయాత్ర, కళింగ దేశచరిత్రలో మాత్రమే గాక, భారతదేశ చరిత్రలోనే అతి ప్రధానమైన ఘట్టము.

క్రీ. పూ. 236-268 మధ్యకాలంలో అశోకుడు పరిపాలించాడు. అశోకుడు రాజ్యమునకు వచ్చిన వెంటనే కళింగరాజులు స్వతంత్రం ప్రకటించారు. వారిని ఓడించేందుకు క్రీ. పూ. 255 లో దండయాత్ర చేసినట్లు ధౌలి, (పూరీవద్ద) జౌగడ, (బరంపురంవద్ద) శాసనాలు తెలియజేస్తున్నాయి.

ఈ కళింగ దండయాత్ర మహాభీకరంగా జరిగింది. అనేక వేల సైనికులుమరణించారు. ప్రజలు నానా ఇక్కట్లుపడ్డారు. మహాభారత యుద్ధంలో ధైర్యసాహసాలతో పోరాడిన కళింగవీరులందరు ఈ యుద్ధంలో చనిపోయినందుకు తానెంతోవిచారిస్తున్నానని అశోకుడు

తన శాసనాలలో వ్రాసుకున్నాడు. కళింగ దండయాత్ర తదుపరి అశోకుడు సామ్రాజ్యాన్ని విస్తరించటం మానుకుని సుస్థాపితం చేయ పూనుకున్న విషయం పాఠకులకు తెలిసినదే.

అశోకుని శాసనాలన్నీ ప్రాకృతంలో ఉన్నవి. అయితే హాలుని గాథాసప్తశతి శౌరసేనిప్రాకృతమై ఉండగా ఈ శాసనాలన్నీ పాలీప్రాకృతంలో ఉన్నాయి.

## సామాజిక జీవనం:

అశోకుని శాసనాలద్వారా నాటి కళింగ ప్రజల సామాజిక జీవనం కొంత తెలియవస్తుంది. రాజప్రతినిధి, అతనికొక సలహాసంఘము, అమాత్యశ్రేణి, ప్రదేశకులు, రజ్జుకులు, యుక్తులు— అని వివిధ అంతస్థులకు చెందిన రాజోద్యోగులు పరిపాలనా బాధ్యతను నిర్వహించేవారు.

మోక్షము కల్గునను పిచ్చి నమ్మకముతో పసుహింస చేయరాదని, ఆహారానికిమాత్రము పశువులను విచక్షణతో వాడుకోవాలని, ప్రజల నుద్బోధిస్తూ అశోకుడు శాసనాలు చెక్కించాడు.

దాసదాసీ జనులను, భృత్యులను దయతో చూడవలెనని కూడా అశోకుడు హెచ్చరించాడు. ఔషధశాలలు దేశమంతటా విరివిగా ఉండేవి. బర్మా, సింహళం, జావా, సుమిత్ర దేశాలతో విరివిగా వ్యాపారం సాగుతూ ఉండేది.

## ఖారవేలుడు

అశోక సామ్రాజ్య పతనానంతరం, ఖారవేలుడను రాజు క్రీ॥ శ॥ 183 సంవత్సరంనాడు కళింగదేశాన్ని పరిపాలించాడు. మౌర్య సామ్రాజ్యంపై తిరుగుబాటుచేసి స్వతంత్ర ప్రభుత్వాన్ని స్థాపించిన మొదటి కళింగరాజు ఖారవేలుడు. క్షారవేలుడు— ఉప్పుసముద్రము సరిహద్దుగా కలవాడు అని ఈ మాట కర్థము - పాటలీపుత్రంలో

పరిపాలిస్తున్న పుష్యమిత్రుని ఓడించి మౌర్యరాజులు, తీసుకువెళ్ళిన జైన విగ్రహాలను తిరిగి తెచ్చాడు.

ఖారవేలుడు కళింగదేశాన్ని పరిపాలించే సమయంలో శాతకర్ణి అను రాజు ఆంధ్రదేశాన్ని పరిపాలించేవాడు. ఈ ఉభయ రాజులమధ్య యుద్ధం జరిగిందని, ఆ యుద్ధంలో 'పిధుండ'నగరాన్ని ఖారవేలుడు ధ్వంసంచేశాడని హాథిగుంఫశాసనం తెలియజేస్తున్నది. భువనేశ్వరం (ప్రస్తుత ఒరిస్సా రాజధాని)కి 4 మైళ్ళ దూరంలో ఖండగిరిలోనూ, ఉదయగిరిలోనూ ఈ శాసనాలు చెక్కించబడ్డాయి. హాథిగుంఫ, రాణిగుంఫ- అని ఈ గుహలపేర్లు. ఈ శాసనంద్వారా ఖారవేలుని ప్రసిద్ధి, నాటిపరిపాలనా వ్యవహారాలు మనకు తెలుస్తున్నాయి. కళింగచరిత్రలో ఈ శాసనానికి విశేష ప్రాధాన్యత ఉంది.

జైన మతస్థుడైన ఖారవేలుడు, వృషభలాంఛనుడు వృషభం జైన మతస్థులకు దైవతుల్యం. ఇతని రాజధాని కళింగనగరం ప్రస్తుతం పర్లాకిమిడివద్దనున్న ముఖలింగమే.

అంతకు పూర్వం పరిపాలించిన మగధరాజులు త్రవ్వించిన కాలువలు చెడిపోగా వానిని ఖారవేలుడు మరమ్మతు చేయించాడు. రాజధానియైన కళింగనగరానికి నీటివసతి కల్పించాడు. జైనమత ప్రవక్త వర్ధమాన మహావీరుడు కళింగదేశం స్వయంగా వచ్చి జైన మతాన్ని ప్రచారం చేశాడనికూడా ఈ శాసనంలో ఉంది.

ఖారవేలుడు 35 లక్షల ప్రజల యోగక్షేమాలను చూస్తూ ఉండేవాడు. తుపానులవల్ల పడిపోయిన గోపుర ప్రాకారాలను బాగుచేయించాడు. సర్వరాష్ట్రిక, భోజక ప్రముఖులను పాదాక్రాంతులను చేసుకున్నాడు (మధ్యప్రదేశ్‌లోని రాజులు). పౌర, జానపదులకు అనేక సౌకర్యాలు కలిగించాడు. బీహారు రాష్ట్రంలో గయ జిల్లాలోని గోరధగిరివద్ద పాటలీపుత్రరాజును ఓడించాడు. ఖారవేలుని ధాటికి గ్రీకురాజైన డిమెత్రిటస్ భయపడి పారి

పోయినాడట. అంగవంగ దేశములనుండి రత్నములను తెచ్చాడు. బౌద్ధ జైన భిక్షువులకు, బ్రాహ్మణులకు విశేషంగా పారితోషికాలిచ్చి సంతృప్తిపరచాడు. 164 జైనమత గ్రంథాలను పునరుద్ధరించాడు.

పై వివరాలనుబట్టి ఖారవేలుడు అతి సమర్థుడైన రాజనిమాత్రమేగాక, అతని సామ్రాజ్య విస్తీర్ణంకూడా తెలుస్తున్నది. గోదావరి నదీతీరంవరకు అతని సామ్రాజ్యం వ్యాపించిందని, ధాన్యకటకంపైనకూడా అతను దండెత్తాడని తెలుస్తున్నది.

ఆంధ్రదేశంలో అంతర్భాగం :

ఖారవేలుని తర్వాత, కళింగ దేశమంతా శాతవాహనరాజుల పరిపాలనలోకి వచ్చింది. శాతవాహన రాజుల నాణెములు అనకాపల్లి, చీపురుపల్లి ప్రాంతాలలో విశేషంగా లభించాయి. రామతీర్థం, బొజ్జనకొండ, శంఖరం శిల్పసంపద, ఇతర ఆంధ్ర శిల్పసంపద ఒకే రకమైనది. శాతవాహన రాజులు కళింగాంధ్ర ఐక్యతను స్థాపించి సుస్థిర పరిపాలన ఏర్పరచారు. ముఖలింగం, చీపురుపల్లివద్ద దొరికిన శాసనాలలోని భాష లిపి, ఇతర ఆంధ్ర ప్రాంతాలలోని లిపివలెనే ఉంది. శాతవాహన రాజుల కాలంలో ఘనీభూతమైన కళింగాంధ్ర ఐక్యత సుస్థిరంగా నిలిచిపోయింది. వర్తక, వ్యాపారాలు, సంబంధ బాంధవ్యాలు, భాష, సంస్కృతి, ఆచారవ్యవహారాలు కలిసిపోయినాయి. మాండలికమైన తేడాలుండవచ్చుగాక. ఐక్య జాతీయ పరిణామంమాత్రం నిరాఘాటంగా కొనసాగింది. శాతవాహనరాజుల తర్వాత 200 సంవత్సరాలు, ఆంధ్రదేశమంతా చిన్న చిన్న రాజులు పరిపాలించిన కాలంలో, పిఠాపురం రాజధానిగా మాఠర వంశస్థులు వందసంవత్సరాలు కళింగదేశాన్ని పరిపాలించారు. విష్ణుకుండిన రాజులు పరిపాలించిన 200 సం॥ (420-620) తిరిగి కళింగదేశం ఆంధ్రదేశంలో భాగంగానే ఉంది. విష్ణుకుండిన రాజుల నాణెములు, చీపురుపల్లి, రామతీర్థం – మొదలైన ప్రాంతాలలో దొరికినవి.

7వ శతాబ్దంలో భారతదేశం సంచారము చేసిన హు-యి-న్ త్సాంగ్ కళింగదేశాన్ని ఇలావర్ణించాడు.

"ఉద్రదేశానికి (ఓఢ్ర) దక్షిణంగా కళింగ్కియా (కళింగ) దేశం ఉంది. ఈ రాష్ట్రం చుట్టుకొలత 714 మైళ్ళు. దీని రాజధాని నగర వైశాల్యం 3 మైళ్ళు. ఇది ఉష్ణదేశం. పడమరగా వందలకొలది మైళ్ళవరకు కొండలు, కీకారణ్యాలు వ్యాపించిఉన్నాయి. సముద్ర తీరంలోమాత్రం సారవంతమైన భూములున్నాయి."

"నూరు బౌద్ధ ఆరామాలు, నూరు హిందూ దేవాలయాలు, ఉన్నవి. బౌద్ధ మఠాలలో పదివేలమంది విద్యార్థులు విద్యాభ్యాసం చేస్తున్నారు. ప్రజలు ఉభయ మతాలను సమానంగానే ఆదరిస్తున్నారు. మదించిన ఏనుగులకు ఈదేశం ప్రసిద్ధిచెందింది. ప్రజలు నాగరికతగలవారు" అని ఈ చైనా యాత్రికుడు వర్ణించాడు.

## జైనమత వ్యాప్తి:

ఆంధ్రదేశంలో అతిప్రాచీనకాలంనుండి బౌద్ధమతముతో బాటు జైనమతం కూడా వ్యాపించింది. బౌద్ధమతానికి అమరావతి, నాగార్జునకొండలు కేంద్రాలు. ఇక్కడనుండి ప్రారంభించి బౌద్ధశిల్పం, సంస్కృతి, మతం నలుమూలలా వ్యాపించింది. జైనమతం కళింగ దేశమునుండి ప్రారంభమై దక్షిణదిశగా ఆంధ్రదేశంలో వ్యాపించింది. విష్ణుకుండిన వంశ పతనానంతరం పరిపాలించిన చాళుక్య రాజుల కాలంలో రాజులు సైతం జైనమతాన్ని ఆదరించారు. బౌద్ధ జైనమతాలు రెండు కలిసి మెలిసి జీవిస్తూఉండేవి.

ప్రాచీనుల సాంఘిక జీవనంలో ఆర్థిక కారణాలతోపాటు, మతం ఒక ప్రధానశక్తిగా ఉండేదన్న విషయంలో ఎట్టి సందేహం లేదు. ప్రజలతాత్విక భావాలు, నమ్మకాలు, ఆచారాలు వారి మతంపైన ఎక్కువగా ఆధారపడిఉండేవి. ప్రాచీన కళింగ ప్రజల

ఆచార వ్యవహారాలను తెలుసుకునేందుకు, ముఖలింగం దేవాలయ శిల్పాలు ఎంతో ఉపయోగపడతాయి.

## ముఖలింగ శిల్పాలు :

పర్లాకిమిడికి సమీపంలో ప్రస్తుతం ముఖలింగం అని వ్యవహరించబడుతున్న నగరం అనేక సంవత్సరాలు కళింగ రాజులకు రాజధానిగా ఉండేది. 7 వ శతాబ్దం తర్వాత, గాంగరాజులు ముఖలింగాన్ని వదలి, కటకం తమ రాజధానిగా చేసుకున్నారు.

నాటి సామాజిక జీవనాన్ని ప్రతిబింబించే అనేక చిత్రాలు ముఖలింగ దేవాలయాలపై చెక్కబడి యున్నాయి. ఒక చిత్రంలో మల్లయుద్ధపు ప్రదర్శనం ఉండి, చుట్టూ జనసమూహం, రాజు అంతఃపుర పరివారంతో సహా ఒక వేదికమీద ఉంటాడు. మరొక చోట ఏనుగులయుద్ధం చిత్రించబడ్డది. ఏనుగుల వేటకు సంబంధించిన అనేక శిల్పాలున్నాయి. కళింగదేశపు ఏనుగులు ప్రసిద్ధి చెందిన విషయం పైశిల్పాలద్వారా గ్రహించగలము.

ముఖలింగం ప్రస్తుతం శివాలయంగా మార్చబడ్డది. కాని బౌద్ధ జైన విగ్రహాలనేకం అక్కడ దొరికాయి. శక్తిపూజ, నరబలి ఆనాడు ఉండేవని సూచించే శిల్పాలుకూడా ఉన్నాయి. ఒక శిల్పంలో స్త్రీ ఒక త్రాసును ధరించిఉంది. త్రాసులో ఒకవైపున, కాళ్లుతల ప్రేలాడుచున్న మనుష్యుడు, రెండవవైపున, మొండెంగల మానవశరీరము ఉన్నాయి. ఈ రెంటెని ఆ స్త్రీ త్రాసులో తూస్తున్నది. మరొక శిల్పములో, ఆరు చేతులుగల శక్తి, ఒక పురుషుని ఒక చేతితో పట్టుకొని మరొక చేతితో నరుకుతున్నది. మరొక శిల్పంలో ఒక స్త్రీని చెట్టుకు తల్లక్రిందుగా ప్రేలాడగట్టి చుట్టూ పురుషులు భజన చేస్తున్నారు. మరొక శిల్పంలో ఒకకత్తిని ధరించిన పురుషుడు, నాలుగు పశువులు ఉన్నాయి.

జంతు బలిని, నరబలిని ఈ శిల్పాలు సూచిస్తున్నాయి. శాక్తేయ, జైనమతాలలో రెంటిలోనూ విస్తారంగా జంతుబలులు, నరబలులు ఇచ్చే ఆచారం ఉంది. అహింసా సూత్రాన్ని అతి ఛాందసంగా అమలు జరపబూనుకున్న జైన మతంపేరుతో జంతు బలులు, నరబలులు కొనసాగినవి. ఇందులో ఆశ్చర్యంలేదు. పాలక వర్గంపై ప్రజలకుగల వ్యతిరేకతలుమాత్రమే వివిధ మత రూపాలలో వ్యక్తమయినాయి. జైనమతం అలాంటి రూపాలలో ఒకటి.

## వి దే శ యా న ం

ఆంధ్రసంస్కృతికి కళింగప్రజలు చేసిన మహోపకారం మరొకటి ఉంది.

కళింగదేశం కొండప్రాంతమై సారవంతమైన దేశం కాక పోవటంవల్ల మొదటినుండీ, విదేశాలకు వలసవెళ్ళటం కళింగ దేశంలో విస్తారంగా ఉంది. జావాలో నేటికి 'క్లింగులు' అను ఒక తెగ ఉంది. వీరు కళింగులనుండి ఏర్పడిన ఒక ఉపశాఖ. జావా, సుమిత్రా, బోర్నియో, సింహళదేశాలకు 'కాళింగులు విస్తారంగా వలసవెళ్లారు. వీరి ద్వారానే హిందూ బౌద్ధ సంస్కృతి ఆ దీవులలో వ్యాపించింది. ఇండోనేషియా రాజధాని జోగ్జికార్తాలో చతుర్ముఖ బ్రహ్మకు దేవాలయం నేటికీ ఉంది. భీముడు, అర్జునుడు, సుభద్ర, భారతీయుల పౌరాణిక వ్యక్తులు మాత్రమే ఇండోనీషియాలో వీరందరికీ దేవాలయాలు కట్టారు. దశావతారాలకు దేవాలయాలు, గరుత్మంతుని దేవాలయం, కూర్మ (తాబేలు) దేవాలయం - ఇవన్నీ జావా సుమిత్రా దీవులలో నేటికీ నిలచిఉన్నవి.

ఈ దీవులకు హిందూ, బౌద్ధ సంస్కృతిని చేకూర్చిన ఘనత కళింగ ప్రజలది.

# చాళుక్య రాజులు

క్రీ. శ. 620 సంవత్సరం తర్వాత ఆంధ్రదేశ చరిత్రలో ఒక నూతన యుగం ఆరంభమైంది. మహారాష్ట్ర దేశంలో బాదామి నగరాన్ని రాజధానిగా చేసుకొని దక్షిణ హిందూ దేశాన్నంతా పరిపాలించిన సత్యాశ్రయ పులకేసి ఆంధ్రదేశంపై దండెత్తాడు. అప్పటికే విష్ణుకుండిన రాజుల ప్రభావం అంతరించింది. క్రీ. శ. 611లో కృష్ణా నదీతీరంలో జరిగిన ఘోరయుద్ధంలో, ఆంధ్రదేశంలో మిగిలిన రాజులను ఓడించి, పృథ్వీ యువరాజు అను తన సేనానాయకుని రాజప్రతినిధిగా పులకేశి నియమించాడు. అయితే ఆంధ్రరాజులు అంతమాత్రాన మహారాష్ట్ర రాజైన పులకేశి పరిపాలనకు తలఒగ్గ లేదు. తిరిగి 624 లో, సత్యాశ్రయ పులకేసి రాజు సోదరుడైన కుబ్జవిష్ణువర్ధనుడు ఆంధ్రదేశంపై దండెత్తి, కొల్లేరువద్ద శత్రువులను ఓడించి చాళుక్యరాజ్యానికి శంకుస్థాపనచేశాడు. వేంగినగర రాజధానిగా విష్ణువర్ధనుడు రాజ్యాన్ని స్థాపించి కాలక్రమేణ, తన సోదరుడైన పులకేశితో సంబంధాలు తెంచుకొని, వేంగచాళుక్య, లేక తూర్పు చాళుక్య వంశానికి మూలపురుషుడైనాడు. ఈ వేంగీ చాళుక్యులు 500 సంవత్సరాలకు పైగా ఆంధ్రదేశాన్ని పరిపాలించారు.

చాళుక్యులకు పూర్వం ఆంధ్ర చరిత్రను తెలుసుకోటానికి శాసనాలు, శిల్పాలు, నాణెములు, విదేశ చరిత్రకారుల రచనలు

తప్ప మనకు వేరే ఆధారాలు లేవు. కనుకనే క్రీ. పూ. 200 నుండి క్రీ. శ. 600 వరకు 800 సంవత్సరాల ఆంధ్ర ప్రజల చరిత్రను సమగ్రంగా తెలుసుకోవటం ఎంతో కష్టంగావుంది. కాని చాళుక్యయుగ ప్రారంభంతో యీ బాధ కొంత తగ్గుతుంది.

తెలుగుభాష శాసనాలలో ప్రవేశించింది. తెలుగులో నేటి వరకు తెలిసిన మొదటి గ్రంథము, ఆంధ్రమహాభారతము, చాళుక్య రాజులలో దాదాపు ఆఖరువాడైన రాజరాజ నరేంద్రుని కాలంలో రచించబడ్డది (1022 - 1061). ఈనాటినుండి ఆంధ్ర ప్రజల చరిత్రను గ్రహించటానికి తెలుగు సాహిత్యం ఒక ముఖ్యసాధన.

ఇంతేకాదు. బౌద్ధ హిందూమత ఘర్షణలతో, పల్లవ, విష్ణుకుండిన రాజుల నిరంతర యుద్ధాలతో, కల్లోలమైన ఆంధ్రదేశం 625 నుండి 753 వరకు ఒక శతాబ్దం పైగా, ప్రథమ చాళుక్య రాజులక్రింద సుస్థిరపరిపాలనను అనుభవించింది. వర్తక వ్యాపారాలు, వ్యవసాయము వృద్ధి చెందాయి. ఆంధ్ర భాషాభివృద్ధి కూడా యీ కాలంలోనే సుస్థిరమైంది.

వివిధభారతీయ జాతుల ఆవిర్భావం :

అంతేకాదు. భారతదేశం మొత్తంమీద ఈ యుగంలోనే మరొక పరిణామంకూడా ప్రారంభమైంది. వివిధ ప్రాంతాలలోని ప్రజలు స్థిరజీవనానికి అలవాటు పడ్డారు. పెద్ద ఎత్తున ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి వలసలు వెళ్ళటం ఆగిపోయింది.

ఆంధ్రదేశంలో గత 600 సంవత్సరాల కాలంలో వ్యవసాయము వృద్ధిపొంది, అరణ్యాలను ఛేదించి సాగులోకి తెచ్చారు. నదులకు చిన్నచిన్న ఆనకట్టలు కట్టారు. వర్తక వ్యాపారాలు పెంపొందినవి. ఈ ఆర్థికాభివృద్ధిఫలితంగా, ఆంధ్రులు పెద్దపెట్టున ఇతర ప్రాంతాలకు వలసవెళ్లే అవసరం లేకపోయింది. ఒకేప్రాంతములో నివసిస్తూ, వర్తక వ్యాపారాది ఆర్థిక సంబంధాలతో పెనవేసుకు పోయిన

ఆంధ్రులు ఒక ప్రత్యేకజాతిగా రూపొందసాగారు. కన్నడ, ఆంధ్రలిపులు విడిపోయి వేర్వేరు లిపులుగా రూపొందినవి. ఈయుగం లోనే, నేటి మహారాష్ట్ర భాషకు ప్రాథమిక చిహ్నాలు ప్రారంభ మైనవికూడా. సత్యాశ్రయపులకేశి పరిపాలనలోనే ఈ పరిణామం దక్షిణ హిందూదేశంలోనే కాక ఉత్తర హిందూదేశంలోకూడా ప్రారంభమైంది. హర్షవర్ధనుడు 606 – 636 కనోజ్ రాజధానిగా ఉత్తరహిందూస్థానమంతా జయించి తనసామ్రాజ్యాన్ని స్థాపించాడు. బౌద్ధ హిందూ, జైన మతస్థుల నందరినీ సమానంగా ఆదరించాడు. అంతవరకు ప్రజల ప్రత్యేకతను వారిమతాలు తెలియజేస్తూ ఉండేవి. కాని 600 తో మత విద్వేషాలు, విభేధాలు తగ్గిపోయినవి. బౌద్ధమతం ప్రాచీన స్వరూపాన్ని పూర్తిగా కోల్పోయి, కేవలమొక వైజ్ఞానిక శక్తిగా మిగిలిపోయింది. (ఇంటలెక్చ్యుయల్ ఫోర్సు) బౌద్ధవిశ్వవిద్యాలయంగా పేరుపొందిన నలందా (బీహారు)లో హిందూ, బౌద్ధ, జైన తత్వశాస్త్రాలన్నిటినీ బోధిస్తుండే వారనీ, ఈ మతాలన్నీ భారతీయ సంస్కృతియొక్క వివిధ రూపాంతరాలుగా మాత్రమే అధ్యాపకులు భావించేవారని, నలందా విశ్వవిద్యాలయాన్ని చూచిన హు–యిన్–త్సాంగ్ వర్ణించాడు.

దక్షిణ హిందూదేశంలో ఈమార్పు మరింత ప్రస్ఫుటమైంది. క్రీ॥ శ॥ 600 నాటికి బౌద్ధమతం ఆంధ్రలో పూర్తిగా అడుగంటింది. హిందూ, జైన, మతాలు మాత్రమే, చాళుక్యరాజుల కాలంలో నిలచినవి. నాటివరకు వ్యక్తులమధ్య సన్నిహితత్వము మత ప్రాతిపదికపై ఉండేది. తెలుగుదేశపు బౌద్ధుడు, మహారాష్ట్ర బౌద్ధుడు, తాము అత్యంత సన్నిహితులమని భావిస్తుండేవారు. తమ ప్రక్కనే ఒకే గ్రామంలో నివసించే, మరొక మతస్థుణ్ణి పరాయివాడుగా యెంచుకునేవారు. బౌద్ధ భిక్షువుల నిరంతర సంచార కార్యక్రమాలు ఈ సన్నిహితత్వాన్ని ప్రోత్సహించాయి.

చాళుక్యయుగంతో ఇది నశించింది. బౌద్ధులైనా, జైనులైనా, హిందూవైనా, ఒకే భాష మాట్లాడుతూ, ఒకే ప్రాంతములో తర తరాలుగా నివసిస్తున్న వ్యక్తులే తమకు సన్నిహితులని ప్రజలు భావించసాగారు. మతభావంతగ్గి జాతిభావం ప్రారంభం కావటానికిది నాంది. సుస్థిర రాజకీయ, ఆర్థిక జీవితం కొనసాగిన మీదటనే ఇది సాధ్యమైంది. వ్యక్తులమధ్య అనుబంధాన్ని భాషవృద్ధి చేయసాగింది. మతం కొంత వెనుకడుగు వేసింది.

ఈ పరిణామం సామాన్య ప్రజలలో మాత్రమే పరిమితం కాక రాజులవరకూ వ్యాపించింది. చాళుక్యరాజులు సగర్వంగా ఇలా చెప్పుకున్నారు 772-806 సంవత్సరాలమధ్య పరిపాలించిన నాల్గవ విష్ణువర్ధనుని శాసనంలో ఇలా ఉన్నది.

అస్తి ప్రశస్త జాతీనాం రత్నమానివ వారిధిః
జన్మభూమిః చాళుక్యానాం దేశో వేంగీతి విస్తృతః

రత్నగర్భమైన సముద్రమువంటి అత్యంత ప్రసిద్ధిచెందిన వేంగి దేశము చాళుక్యుల జన్మభూమి.

చాళుక్యరాజుల మాతృభూమి :

ఆంధ్రదేశ చరిత్రలో ఇంతటి మార్పును తెచ్చిన ఈ చాళుక్య రాజు లెవ్వరనే విషయంలో చరిత్రకారులలోనే వివిధ సిద్ధాంతా లున్నాయి. తాము సూర్యవంశజులమని, చంద్రవంశజులమని పాండవుల సంతతివారమని, అతిశయోక్తులు ఈ రాజులు చెప్పు కున్నారు. కాని వాస్తవిక దృష్టితో చూస్తే వీరు దక్షిణాదివారేనని ఆంధ్రదేశమే బహుశా వీరి ప్రాథమిక జన్మస్థలమనికూడా నేటి చరిత్రకారు లభిప్రాయపడుతున్నారు.

నాగార్జునకొండ శిల్పాలలో మహాతలవర ఖండచాలికి రేమణక - అను ఒక సేనానాయకుడు హిరణ్య రాష్ట్రంలో

పరిపాలించినట్లు ఉంది. హిరణ్యరాష్ట్రం అనగా కడపజిల్లా కేంద్రం గాగల రాయలసీమ. దీనినిబట్టి క్రీ. శ. 200-250 ప్రాంతంలో చాలికి వంశస్థులు హిరణ్యరాష్ట్రంలో ఉన్నారని భావించవచ్చు.

క్రీ. శ. 458-480 మధ్యకాలంలో త్రిలోచన పల్లవునితో విజయాదిత్య చాళుక్యుడు పోరాడి ఓడిపోయినట్లు చరిత్ర తెలుపు తున్నది. గర్భవతియైన విజయాదిత్యుని భార్య కడపజిల్లా ముదివేము అగ్రహారంలో విష్ణుశర్మ అను బ్రాహ్మణుని ఇంట్లో తలదాచుకొని ప్రాణాలను కాపాడుకున్నది. ఆమెకు పుట్టిన కుమారుడు విష్ణు వర్ధనుడు. చాళుక్య వంశములో ఈ పేరు అనేకమంది రాజులు ధరించారు. చాళుక్య నామం, చళుకి, చల్కి, సలుకిసమీా అను ద్రావిడ నామాల రూపాంతరం మాత్రమే. కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు ఈ విషయమై పరిశోధనలుచేసి నూతన విషయా లను బైటపెట్టారు. "దివాకరం" అనబడు తమిళ భాషాకోశంలో - చాళుక్య వెండార్ అను పదానికి వెల్లాలకుల ముఖ్యులు అని అర్థం వున్నట్లు తెలుస్తున్నది. వెల్లాల తెగవారు కర్షకులు.

పై విషయాలన్నిటినీ సమన్వయం చేస్తే ఒక విషయం బోధ పడుతుంది. చాళుక్యుల ప్రాచీన నివాసస్థలము దక్షిణ హిందూ దేశం. అంతేకాదు, రాయలసీమ ప్రాంతంవారు. ప్రారంభంలో కర్షకులు. క్షాత్ర ధర్మ మవలంబించి, క్షత్రియులమని చెప్పుకొని పల్లవ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడారు. తాత్కాలికంగా ఓడిపోయినారు. తర్వాత ఉత్తరదిశగావెళ్ళి, మహారాష్ట్ర దేశంలో బాదామివద్ద, సత్యాశ్రయ ప్రథమ పులకేశి నాయకత్వాన ఒక సామ్రాజ్యం స్థాపించారు. తిరిగి ఆంధ్రదేశమంతా జయించి, ఒక శాఖవారు ఆంధ్రదేశంలో స్థిరపడ్డారు. వీరే వేంగీ చాళుక్యులు.

చోళులు అను పేరుగలవారు కావేరితీరంలోను, రాయలసీమ లోను, తెలంగాణా ప్రాంతంలోను క్రీ. శ. 4వ శతాబ్దంలో నివసించా

రనీ, వీరంతా కరికాలచోళుని వంశకర్తగా భావించిన విషయం మనము ఇంతకుముందే తెలుసుకున్నాము. అదేవిధంగా, వేంగీ చాళుక్యులు, బాదామి చాళుక్యులు, వేములవాడ చాళుక్యులు, ముదిగొండ చాళుక్యులు వీరంతా సత్యాశ్రయ పులకేశిని తమ వంశకర్తగా భావించి వివిధ ప్రాంతాలను పరిపాలించారు. బాదామి చాళుక్యులు మహారాష్ట్ర ప్రాంతాన్ని వేములవాడ చాళుక్యులు తెలంగాణాలోని కరీంనగరు ప్రాంతాన్ని, ముదిగొండ చాళుక్యులు మధిర, నూనుకోట, వరంగల్ ప్రాంతాన్ని వేంగీ చాళుక్యులు, కృష్ణా-గోదావరీ మధ్యాంధ్ర దేశాన్ని పరిపాలించారు.

## మూడు ప్రధాన ఘట్టాలు:

ఆంధ్రదేశంలో చాళుక్య పరిపాలనను మూడు దశలుగా విభజించవచ్చు.

1. క్రీ. శ. 625-753 వరకు మొదటిదశ. ఈదశలో చాళుక్య రాజులు తమ పరిపాలనను కోస్తా ఆంధ్రజిల్లాలలో, చీపురుపల్లి నుండి నెల్లూరువరకు విస్తరింపజేసుకున్నారు. నూరు సంవత్సరాలను పైగా సుస్థిరపరిపాలన చేశారు. పశ్చిమ దశగా ఉన్న తమ జ్ఞాతులైన బాదామి చాళుక్యులతోను, దక్షిణాన కంచిని పరిపాలిస్తున్న పల్లవులతోను, స్నేహసంబంధాలుఏర్పరచుకున్నారు. పల్లవులు-బాదామి చాళుక్యులు నిరంతరసంగ్రామాలలో నిమగ్నులై ఉన్నప్పటికీ, వేంగీ చాళుక్యులు ఈ తగాదాలలో జోక్యం కలిగించుకోక తటస్థంగా ఉన్నారు.

2. క్రీ. శ. 753-973 వరకు (200 సం॥లకు పైగా) రెండవ దశ. బాదామి చాళుక్యులు రాజ్యచ్యుతులై వారిస్థానంలో రాష్ట్రకూటాలు మహారాష్ట్రరాజ్యం పరిపాలించ సాగారు. వీరు వేంగీ రాజ్యాన్ని కబళించటానికి అనేక యుద్ధాలు చేశారు. కొంతకాలం

పరిపాలించారుకూడా. కాని తిరిగి వేంగీ చాళుక్యులు విజృంభించి రాష్ట్రకూటులను ఆంధ్రదేశమునుంచి తరిమి వేశారు. ఈ 200 సంవత్సరాలలో రాష్ట్రకూటుల దండయాత్రనుంచి ఆంధ్రదేశాన్ని రక్షించిన పోరాటాలలో వేంగీ చాళుక్యులు రాటుదేలి, తాము ఆంధ్రులమేనన్న ఆత్మజ్ఞానాన్ని పొంది, ప్రజలతో సన్నిహితత్వం పెంపొందించుకున్నారు. ప్రజాసహకారంతో అనేక ఘోర యుద్ధాలలో రాష్ట్ర కూటులను ఓడించి ఆంధ్రదేశ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టారు.

3. క్రీ. శ. 975_1076 వరకు మూడవదశ. రాష్ట్రకూటులు పదవీచ్యుతులై తిరిగి కళ్యాణి చాళుక్యులు మహారాష్ట్రాన్ని పరిపాలించసాగారు. తమ వంశస్థులన్న అభిమానం లేకుండా వారు వేంగీ దేశంపై దండెత్తారు. ఈ యుద్ధాలలో వేంగీ చాళుక్యులు ఒంటరిగా నిలవటం కష్టమని గుర్తించి, కంచిని పరిపాలించిన చోళ రాజులతో సంబంధా లేర్పరచుకొని - చోళ చాళుక్య వంశానికి పునాదులు వేశారు. ఈ ఆంధ్ర, తమిళ కూటమి - మహారాష్ట్ర - కర్ణాట కూటమిని ఎదిరించి అనేక యుద్ధాలు చేసింది. ఇవి ఎక్కువ భాగము కృష్ణా నదీతీరంలోను, కొన్ని రాయలసీమలోను జరిగినవి. ఈ పోరాటాలలో చిట్టచివరకు ఆంధ్ర - తమిళ కూటమి విజయం పొందింది.

చాళుక్య రాజులు మొత్తం క్రీ. శ. 624_1118 వరకు 500 సంవత్సరాలు ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. ఈవంశంలో మొత్తం 32 మంది రాజులకు పైగా ఉన్నారు. మొదట్లో కొద్దిరోజులు వీరి రాజధాని పిఠాపురం. తరువాత సుమారు 300 సంవత్సరాలు వేంగి. ఏలూరువద్దనున్న పెదవేగి_చినవేగి గ్రామాలు, తర్వాత 920_1120 వరకు, రాజమహేంద్రవరం వీరికి రాజధానిగా ఉంది.

సుస్థిర పరిపాలన దశ:

వేంగీ చాళుక్య వంశకర్త విష్ణువర్ధనుడు. ఇతనికి కొంచెం గూని వుండేది. కనుక కుబ్జ విష్ణువర్ధనుడు అని చరిత్ర ప్రసిద్ధి వహించాడు.

ఈతని శాసనములు చీపురుపల్లి, తిమ్మాపురం, చేజెర్ల, నెల్లూరు జిల్లాలలో సైతం లభించినవి. ముఖలింగం వరకు దండ యాత్ర జరిపి అచ్చటి శిల్పాలను బాగుచేయించాడు. రణకోవిదుడై స్థల, జల, దుర్గములను స్వాధీనపర్చుకొన్న రాజ్యస్థాపకుడగుట వలన విషమసిద్ధి అను బిరుదు వహించాడు.

641 నుండి 673 వరకు పరిపాలించిన, ఈతని కుమారుడు జయసింహ సర్వసిద్ధి. ఇతనిపేర నిర్మించబడ్డ సర్వసిద్ధిగ్రామం ఇప్పటికి, విశాఖజిల్లా ఎలమంచిలి తాలూకాలో ఉంది. ఇతడు నౌకాయుద్ధంలో గొప్ప ప్రవీణుడు. సమకాలికుడైన మహాకవి దండి దశకుమార చరిత్రలో జయసింహుని కళింగ దండయాత్రను వర్ణించాడు. కళింగ రాజును నౌకా యుద్ధంలో ఓడించి అతని కూతురైన కనకలేఖను వివాహమాడినట్లు ఆ కవి వర్ణించాడు. ఇతని కాలములోనే చైనా యాత్రీకుడు హు-యిన్-త్సాంగ్ ఆంధ్రదేశం సంచరించి, రాజధాని నగరమైన వేంగీనగరం చూచాడు. బౌద్ధమతం పూర్తిగా నశించిందని, హిందూ దేవాలయాలు ఎక్కడ జూసినా ఏర్పడ్డవని ఆ చైనా యాత్రీకుడు వర్ణించాడు.

జయసింహ వల్లభుని పరిపాలనలో మరొక విశేషముంది. నరసారావుపేట తాలూకా, విప్పర్రు గ్రామంలో ఈ రాజు ఒక శాసనాన్ని చెక్కించాడు. తెలుగు భాషలో వ్రాయబడిన మొట్ట మొదటి శాసనం యిదే. దీని కాలం క్రీ. శ. 649.

జయసింహుడు అనేక గ్రామాలను బ్రాహ్మణులకు దాన మిచ్చాడు. గ్రామాలలో వేద-సంస్కృత విద్యల పోషణకై ఘటి

కాస్థానాలు నిర్మించబడ్డవి. పూర్వపు బౌద్ధరామాయణాలవలె వేల కొలది విద్యార్థులు ఒకేచోట విద్య నభ్యసించే పద్ధతి చాళుక్యుల యుగంలో నశించింది.

దేశమంతటా వందలాది ఘటికా స్థానాలు ఏర్పరచి, వాటికి జయసింహ వల్లభుడు అగ్రహారాలు దానంచేశాడు.

ఈ రెండవదశలో మొత్తం 16 గురు రాజులు పరిపాలించారు. రాష్ట్రకూట రాజులతో యుద్ధాలుచేసి ఆంధ్రజాతి స్వాతంత్ర్యాన్ని కాపాడినవారు, తెలుగుభాషకు అత్యంత ప్రోత్సాహమిచ్చినవారు వీరిలో అనేకులున్నారు.

వీరిలో 808-847 వరకు పరిపాలించిన నరేంద్ర మృగరాజు ఒకడు. ఇతని కాలంలో చాళుక్య సింహాసనంకొరకు అన్నదమ్ముల బిడ్డలమధ్య అంతఃకలహాలు ప్రారంభమైనవి. రాష్ట్రకూట రాజులు ఇందులో జోక్యం కలిగించుకొని, భీమసళుక్కి అను నతనిని వేంగీ రాజ్యంపై అధిష్టితుని చేశారు. ఇతడు 12 ఏండ్లు పరిపాలించాడు.

నరేంద్ర మృగరాజు అను గౌరవబిరుదు వహించిన రెండవ విజయాదిత్యుడు, 12 సంవత్సరాలు అజ్ఞాతవాసంచేసి, సైన్యాలను కూడగట్టుకొని, రాష్ట్రకూటులను, వారి తొత్తు భీమసళుక్కుని పారద్రోలి వేంగి సింహాసనం ఆక్రమించాడు. మొత్తం ఇతని పరిపాలన 40 ఏండ్లలో, 108 యుద్ధాలుచేసి శత్రువులను ఓడించాడట. ఆ పాపపరిహారార్థము 108 శైవ దేవాలయాలను నిర్మించాడు.

ఇంతకంటెకూడ ప్రసిద్ధిచెందినవాడు గుణగ విజయాదిత్యుడు. చాళుక్య వంశములో 13 వ రాజైన ఇతడు 849-892 సం॥ మధ్య కాలంలో పరిపాలించాడు. ఈతడు తన రాజ్యాన్ని సుస్థిరం చేసుకోవటం మాత్రమేగాక విస్తరింప జేశాడు. దక్షిణానికి దండెత్తివెళ్ళి గాంగ పల్లవులను, నోలంబ, వైదుంబ, బాణులను ఓడించాడు. అనగా చిత్తూరు, కోలారు, ప్రాంతాలకు విస్తరించాడు. నెల్లూరు

జిల్లాలో చోయలు తిరుగుబాటు చేయగా, ఇతని సేనాని పండ రంగడు ఆ తిరుగుబాటును అణచివేశాడు. అంతేగాదు; రాష్ట్రకూట రాజధాని మాన్యఖేటం (హైదరాబాదులోని మాల్ఖేడు) ధ్వంసం చేసి తగులబెట్టాడు. ఈతని కాలంలోనే ధర్మవరంలోనే (ఒంగోలు వద్ద) మొట్టమొదట తెలుగులో సీసపద్యాలతో ఒక శాసనం చెక్కబడ్డది.

సీ॥ లోహాసనం బెక్కిరా హనునోడిచన
వల్లభు కొల్పున నెల్ల నెఱుంగ
కన్నరాభూపతి నన్నాజిలో జూపె
సంకిలాణ్ణును రేనిబింకముడిచె
దండివై వచ్చిన చెండై చోఱనిం
జేకొని కాచె భూలోకం చెఱుంగ
గీ॥ కిరనపురము, డహాలనిరతంబు
దఱెనాఁడు, నచలపురము
సొచ్చి వచలితుండు వల్లభుండు
గుణకెనల్లుండు వచ్చినంబండ రంగచూరె పండరంగు.

ఈ ప్రాచీన సీసపద్యంలో అనేక పదాలు పరిశీలించుట అవసరం. గుణకె నల్లుండు_గుణకేనల్లాన్ అను తమిళ వాక్యరూపం= మంచి గుణములు కలవాడు అని అర్థము. ఈ పద్యములో వర్ణించ పడ్డ, కిరనపురము, అచలపురము, మధ్యరాష్ట్రిలలోని ఇలిచ్‌పూర్, కిరన్‌పూర్ నగరాలు. బుందేలుఖండ్ ప్రాంతాన్నే డహాలనిరతంలనే వారు. గుణగ విజయాదిత్యుడు చాళుక్యరాజు లందరిలోకి శ్రేష్ఠుడు. రాజ్యాన్ని దూరప్రాంతాలకు విస్తరింపజేసాడు. తెలుగు భాషకు ఎంతో ప్రోత్సాహ మిచ్చాడు. గణితశాస్త్రంలో ఇతడు గొప్ప పండితుడు కనుకనే గుణగవిజయాదిత్యుడని, గణకవిజయాదిత్యుడని కూడ ఇతడు వ్యవహరించబడుతున్నాడు.

ఈతని తర్వాత అనేక రాజులు పరిపాలించారు. కాని ఇంతటి కీర్తి ఎవరికి లభించలేదు.

## చాళుక్య, చోళ మైత్రి:

మూడవదశలో చాళుక్య రాజులు చోళరాజులతో సంబంధ బాంధవ్యాలను ఏర్పరచుకున్నారు. 999 - 1011 సంవత్సరాలమధ్య శక్తివర్మ అను రాజు వేంగిరాజ్యాన్ని పరిపాలించాడు. ఆనాడు కంచిని పరిపాలిస్తున్న రాజరాజ కేసరివర్మ, తన సైన్యాలనుపంపి, శక్తివర్మను రాజమహేంద్రవర్మ సింహాసనంపై అధిష్టించాడు. అంతటితో సంతృప్తిపడలేదు. కల్యాణి చాళుక్యులకు తమకు జరుగుతున్న నిరంతర కలహాలలో వేంగిరాజుల స్నేహం అత్యావసరమని భావించి, శక్తివర్మ తమ్ముడు విమలాదిత్యునికి తన కూతురినిచ్చి వివాహం చేశాడు. విమలాదిత్యుడు 1011-1022 వరకు రాజ్యం చేసాడు. ఇతని కుమారుడే రాజరాజ నరేంద్రుడు (1022-1061). రాజరాజ నరేంద్రుడుకూడా మేనమామకూతురుని వివాహంచేసుకొని, చోళ రాజులతో తన సంబంధాన్ని ధృడతరం చేసారు. అతని కుమారుడు రాజేంద్రచోళుడు సైతం చోళరాజు కూతురును వివాహం చేసుకొని, చోళరాజ్యానికి వారసుడై కంచిలో పరిపాలించాడు. ఈ విధంగా మూడుతరాలుగా చాళుక్య - చోళ వైవాహిక సంబంధాల ఫలితంగా రాజరాజనరేంద్రుని కుమారుడు చోళత్తుంగ కుళోత్తుంగ దేవుడు చోళ - చాళుక్యరాజ్యానికి, అనగా ఆంధ్రతమిళ రాజ్యాలకు రాజై కంచి రాజధానిగా 1076-1118 వరకు పరిపాలించాడు.

రాజరాజ నరేంద్రుని 40 ఏండ్ల పరిపాలన సుఖమయ మైంది కాదు. ఇతని తమ్ముడు విజయాదిత్యుడు నిరంతరం కుట్రలుచేస్తూనే ఉన్నాడు. రాజరాజ నరేంద్రుడు అనేక సంవత్సరాలు అజ్ఞాతవాసం

చేసి, చోళరాజుల సహాయంతో సింహాసనం ఆక్రమించాడు. ఆఖరు రోజుల్లోకూడా కలహాలు తగ్గలేదు. యుద్ధరంగంలో తమ్ముడితో పోరాడుతూనే రాజరాజ నరేంద్రుడు ప్రాణాలు కోల్పోయాడు.

అన్నదమ్ముల కలహాలతో విసిగి వేసారి, రాజరాజనరేంద్రుడు సోదర కలహ ప్రధానమైన మహాభారత గ్రంథంపైపు దృష్టి సారించడంసహజం. కారణమేమైనా ఆంధ్రమహాభారత అవతరణను రాజరాజ నరేంద్రుడు కారణభూతుడైనాడు. ఈతని ప్రోత్సాహంతో నన్నయభట్టు ఆంధ్ర మహాభారత రచన కుపక్రమించాడు.

# ఆంధ్ర మహాభారతము

ఆంధ్రులు విశిష్ట లక్షణాలుగల ఒక జాతిగా చాళుక్యరాజుల పరిపాలనా కాలంలో రూపొందసాగారు. ఐక్య జాతీయ భావాన్ని పెంపొందింప జేయుటలో భాష ప్రధానపాత్ర వహిస్తున్నది. క్రీ. శ. 600–700 సంవత్సరాలవరకు తెలుగు, కన్నడ భాషల లిపి ఒకే విధంగా ఉండేది. ఆనాటితో యీ సంబంధం తెగిపోయింది. తెలుగు అక్షరాలు గుండ్రటి స్వరూపాన్ని స్వీకరించాయి. దీనిని వేంగీ చాళుక్య లిపి అనేవారు. కన్నడ తెలుగు లిపులను పరిశీలిస్తే ఒక విషయం బోధపడగలదు. కన్నడభాషలో ఇప్పటికీ గీతలు జాస్తి. తెలుగులో అవి లేవు.

ఇంతే కాదు. మరొక విశేషం కూడా ఉంది. క్రీ. శ. 930 సంవత్సర ప్రాంతంలో పరిపాలించిన రెండవ యుద్ధమల్లుడు బెజవాడలో ఒక శాసనము చెక్కించాడు. నేటి తెలుగు భాషలో నశించిన "ఱ" అను అక్షరం అందులో వుంది. ద్రవిడకజగం అనుమాటలో "ళ" అను మాటను తమిళ ప్రజలు ఎలా ఉచ్చరిస్తారో, అలాంటి ఉచ్చారణే యుద్ధమల్లుని శాసనంలోని అక్షరానికి కూడా ఉంది. ఈ అక్షరం యుద్ధమల్లునికి పూర్వము కూడా అనేక శాసనములలో ఉంది. తరువాత యీ అక్షరం పూర్తిగా నశించింది. ఈ ఉదాహరణ వల్ల రెండు విషయాలు స్పష్టమౌతున్నవి.

1. తమిళ, తెలుగు భాషలు ఒకే కూటమి నుండి ఆవిర్భ
వించినవి.

2. కాలక్రమేణ తెలుగుభాష పరిణామం చెంది కొన్ని అక్ష
రాలను పూర్తిగా వదిలివేసి సంస్కృత పద భూయిష్ఠంగా మార
సాగింది. నన్నయభట్టు రచించిన భారతంలో సగం తెలుగు, సగం
సంస్కృతం నుండి పుట్టిన తత్సమ పదాలు ఉన్నవి. తెలుగు, ద్రావిడ
భాషా కుటుంబంలో పుట్టినదన్న సిద్ధాంతాన్ని ఆధునిక భాషావేత్త
లంతా ఆమోదిస్తున్నారు.

తెలుగుకవిత్వానికి చాళుక్యరాజులిచ్చిన ప్రోత్సాహాన్ని నన్నె
చోడకవి కుమార సంభవ కావ్యప్రారంభంలో ఇలా ప్రస్తావించాడు:

కం. మునుమార్గ కవిత లోకం
బున వెలయగ దేశి కవిత బుట్టించి
తెనుంగున నిలిపి రంధ్ర విషయమున
జన సత్యాశ్రయునితొట్టి చాళుక్య నృపుల్.

నన్నెచోడుడు నన్నయభట్టుకు-ఇంచుమించు సమకాలికుడు.
అంతకుపూర్వము రాజులందరూ, సంస్కృత కవిత్వాన్ని మాత్రమే
ప్రోత్సహించగా చాళుక్యరాజులు మాత్రము తెలుగు కవిత్వాన్ని
(దేశకవిత) ప్రోత్సహించిన విషయం పై పద్యం వివరిస్తున్నది.

ఈపరిణామం తెలుగుభాషలో మాత్రమేగాక కన్నడభాషలో
కూడా అదేకాలంలో ప్రారంభమైంది. క్రీ. శ. 900 సంవత్సరం
నాటికే, కన్నడభాషలో, జైనమతస్థుడైన పంప, మహాభారతాన్ని
సంగ్రహరూపంలో వ్రాశాడు. సంస్కృత ఛందస్సులోలేని అనేక
రీతులను స్వతంత్రించి అందులో ప్రవేశపెట్టాడు.

ఆంధ్ర మహాభారత రచనకు ఇదికూడా కొంత ప్రోత్సాహ
మిచ్చింది.

మహాభారత యుద్ధంలో అర్జునునికి కృష్ణుడు సహాయపడ్డట్లు, భారత గ్రంథ రచనలో తనకు నారాయణభట్టు సహాయబడ్డాడని, నన్నయభట్టే అంగీకరించాడు. ఈ నారాయణభట్టు కన్నడదేశం నుండి వచ్చి తెలుగుదేశంలో స్థిరపడ్డ గొప్ప కన్నడభాషాపండితుడు. కన్నడకవులు స్వతంత్రించి దేశ భాషలలో కావ్యాలు అప్పటికే వ్రాయ సాగారు. నారాయణభట్టు ప్రోత్సాహంతో తెలుగు దేశం కూడా ఆ మార్గం తొక్కింది.

పాత సాంప్రదాయాన్ని కొంత వెనుకకు నెట్టి తెలుగులో కావ్యరచన చేయడానికి నన్నయభట్టు సాహసించటానికిగల కారణా లను తెలుసుకోవాలంటే నాటి సామాజిక జీవనాన్ని కొంత పరిశీ లించాలి.

## సా మా జి క జీ వ నం:

ప్రారంభంనుండి, కన్నడ - తెలుగుదేశాలమధ్య, తమిళ - తెలుగు దేశాలమధ్య సన్నిహిత సంబంధముంది. కన్నడప్రజలనే కులు వచ్చి ఆంధ్రదేశంలో స్థిరపడ్డారు. యుద్ధాలు ఘోరంగా జరుగు తున్న సమయంలో కూడా అనేక కుటుంబాలు ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి తరలిపోవటం ఉండేది. చాళుక్యుల చివరిదశలో చోళ - చాళుక్యరాజులమైత్రి ఫలితంగా అనేక తమిళ కుటుంబాలు ఆంధ్రదేశంలో స్థిరపడ్డాయి. ముఖ్యంగా రాజోద్యోగులు, సేనా పతులు, బ్రాహ్మణులు ఈవిధంగా వలసవచ్చారు. పేరూరు ద్రావి డులు, పుదూరు ద్రావిడులు - ఈవిధంగా దక్షిణదేశమునుండి వచ్చి స్థిరపడ్డవారే. చాళుక్యుల కాలంలో రాజోద్యోగులుగా వచ్చి స్థిరపడ్డ, అనేక రైతుకుటుంబాలు నేటికీ విశాఖజిల్లాలో ఉన్నాయి. చోళదేశంనుండి వచ్చిన 536 బ్రాహ్మణ కుటుంబాలను పిఠాపురం వద్ద "వీరచోడ చతుర్వేది మంగళం" అను ఒక అగ్రహారాన్ని ఒక

చాళుక్యరాజు నిర్మించాడు. కన్నడ ప్రాంతమునుండి వచ్చిన కుటుంబాలు ఎక్కువగా తెలంగాణ, గుంటూరుజిల్లా కొండవీడు ప్రాంతాలలో స్థిరపడ్డారు.

వివిధ ప్రాంతాలనుండి వచ్చి స్థిరపడిన ఈ ప్రజలతో బాటు కొత్తకొత్త పద్ధతులు, ఆచారాలు, సాంప్రదాయాలు ప్రవేశించ సాగినవి.

కులమత - విభేదాలు:

అంతేకాదు. నాటి మత పరిస్థితి కూడా చాలా గందరగోళంగా ఉండేది. బౌద్ధమతం పూర్తిగా నశించింది. హిందూ, జైనమతాలు మాత్రమే వ్యవహారంలో ఉన్నాయి. హిందూ మతంలో కూడా శైవ సాంప్రదాయం విశేషంగా వ్యాపించ సాగింది. చాళుక్యరాజులందరూ జైనమతాన్నో, శైవమతాన్నో ఆదరించారు. అమరావతీ, పాలకొల్లు, భీమవరం, ద్రాక్షారామం, పిఠాపురం అను అయిదు ప్రాంతాలు శైవమత కేంద్రాలుగా వుండేవి. వీనిలో ద్రాక్షారామం తప్ప మిగతావన్నీ ప్రారంభదశలో బౌద్ధమత కేంద్రాలు. చాళుక్యుల కాలంనాటికి ఇవి శైవమత కేంద్రాలైనవి.

అదే విధంగా జైనమతం కూడా విశేషాదరణలో ఉండేది. బెజవాడ, రామతీర్థం, (విశాఖ) హనుమకొండ (తెలంగాణ) దానవులపాడు, (కడప) ధర్మవరం (గుంటూరు) ప్రధానమయిన జైనకేంద్రాలు. ముఖ్యంగా బెజవాడ జైనమతానికి కేంద్రంగా వుండేది. సర్వలోకాశ్రయ జినాలయము, కటకాభరణ జినాలయము మొదలైనవి ఇక్కడ నిర్మించబడ్డవి. అయితే దీనికి పోటీగా మరొక చాళుక్యరాజు బెజవాడలోనే, సమస్త భువనాశ్రయ శైవ పీఠాన్ని నిర్మించాడు. సర్వలోకాశ్రయ జైనపీఠానికి, సమస్త భువనాశ్రయ శైవపీఠానికి నిరంతరం ఘర్షణలు సాగి, అప్పుడప్పుడు దారుణ రక్తపాతాలు జరుగుతూ వుండేవి.

ఆంధ్రదేశమంతటా ఇలాగే వుండేది. మతవిభేదాల ఫలితంగా నిరంతర కలహాలు దేశమంతా వ్యాపింపసాగినవి. ప్రజల మధ్య సన్నిహితత్వాన్ని పెంపుచేసేబదులు, ఈ విభేదాలు ద్వేషాన్ని, విరోధాన్ని హెచ్చుచేశాయి. భాష ఐక్యశక్తి కాగా, మత విభేదాలు విచ్ఛిన్న శక్తిగా పరిణమించాయి. తత్వశాస్త్ర రీత్యా వివిధ మతాలకు గల భేదాలు అత్యల్పం. ఆరామాలకు - శివాలయాలకు పెద్ద పెద్ద అగ్రహారాలుండేవి. ధనలోపం లేదు. ఉత్సవాలు, యాత్రలు, తిరునాళ్ళు విపరీతమైన ఆవేశాలతో జరుగుతూ వుండేవి. గుంటూరు జిల్లా చేబ్రోలులో మహాసేన దేవాలయం ఉండేదట. ఏటా అక్కడినుండి బెజవాడకు యాత్ర సాగేదని, యుద్ధమల్లుని బెజవాడ శాసనం తెలియజేస్తున్నది.

"జననుత చేబ్రోలునుండి
బెజవాడ జాత్రకువచ్చి...ఎత్తించె
గుడియు, మఠమును
కార్తికేయునకు"

చేబ్రోలునుండి బెజవాడ యాత్రలోవచ్చిన ఒకరు, కుమారస్వామిదేవాలయాన్ని అచ్చుటకట్టించారని పై పద్యం తెలియజేస్తున్నది.

కులభేదాలు స్థిరపడ్డాయి. జైనమతంసైతం ఆరంభనుండి కులాచారాలను అనుసరించసాగింది. బ్రాహ్మణులు కేవలమూ వేద శాస్త్ర పాండిత్యాలతోనే కాలంపుచ్చక, రాజోద్యోగాలు నిర్వహించసాగారు. సేనాపతులుగాకూడా పేరుపడ్డారు. క్షత్రియ రాజులకు బ్రాహ్మణ మంత్రులేర్పడ్డారు. రాజనరేంద్రునివద్ద వజియప్రగడ ప్రధానిగా వుండేవాడు. బ్రాహ్మణులు మంత్రిత్వం నిర్వహించే ఆచారం చాళుక్యుల కాలంలోనే ప్రారంభమైంది. నియోగి, వైదిక శాఖలకు ప్రారంభం జరిగింది.

రాజకుటుంబీకులు, వారి బంధువులు అంతా క్షత్రియులుగా పరిగణించబడేవారు. చాళుక్యులు, చోళులు, హైహయులు - తదితరులు క్షత్రియులుగానే భావించబడ్డారు.

కోమట్లకు, పశ్చిమగోదావరిజిల్లా పెనుకొండ కేంద్రం. 714 గోత్రాల వైశ్యులున్నట్లు వైశ్యపురాణం తెలియజేస్తున్నది. వ్యాపారస్తులంతా 'నాకరం' అను పేరుతో వర్తకసంస్థలను నిర్మించుకునేవారు.

శూద్రులలోకూడా వివిధ వృత్తులనుబట్టి వివిధ తెగలు ఏర్పడసాగాయి. వ్యవసాయము, సైనికవృత్తి, చేతిపనులు వీరి ప్రధాన వృత్తులు. నూనెగానుగఆడే తెలికవారికి, వస్త్రాలనునేసేచేనేతవారికి, విస్తారంగా అగ్రహారాలు యిచ్చినట్లు చాళుక్య శాసనాలు తెలియజేస్తున్నవి.

శూద్రులనేకులు, సైనికులుగా ప్రారంభించి, సామంత ప్రభువులుగా స్థిరపడ్డారు. కొండపడమటిరెడ్లు, చాగి వారు, ఏరిచేడివారు మొదలైన పేర్లు అప్పటికే ఏర్పడ్డాయి.

కులబేధాలు మాత్రమేగాక, గోత్ర బేధాలు ముఖ్యంగా అగ్రవర్ణాలలో ఏర్పడ సాగాయి. మతం, కులం, గోత్రం - అనే అడ్డుగోడలు అనేకం నిర్మించ బడసాగాయి. ఈ అడ్డుగోడలు కర్షకులలోకి వ్యాపించటానికి మరి రెండు వందల సంవత్సరాలు పట్టింది. పై వర్ణాలలో మాత్రము చాళుక్యుల కాలంనాటికే స్థిరపడ్డాయి.

వేశ్యావృత్తి అన్ని వృత్తులతోపాటు ఒక వృత్తిగా, రాజపోషణ క్రింద ఉండేది. ప్రతి గ్రామంలోను వేశ్యలుండేవారు. బహు భార్యాత్వ పద్ధతి సర్వ సామాన్యము. వర్ణ బేధాలున్నప్పటికీ, వివిధ వర్ణాలకుచెందిన స్త్రీ పురుషులమధ్య జరిగే వివాహాలు కూడా కొద్దిగా లేకపోలేదు.

ఈ మత, కుల విభేదాలు జాతీయైక్యతకు విచ్ఛిన్నంగా పని చేశాయి. నిరంతరం మతకలహాలు జాతి భద్రతకే భంగకరంగా ఉండేవి. సుస్థిర రాజ్యపాలన సైతం అసంభవమౌతుండేది. ఇతర రాష్ట్రాలనుండి దండెత్తివచ్చే రాజులను ఆహ్వానించే మతస్థులు, కులస్థులు ఎప్పుడూ ఎవరో ఒకరు ఉండేవారు. కుట్రలను, ఆరాచకాన్ని ప్రోత్సహించేవారికి మతం ఒక ముసుగుగా ఉపయోగపడేది.

## ఆంధ్ర మహాభారత అవతరణ :

ఈ విచ్ఛిన్నకర ధోరణులను కొంతవరకైనా అరికట్టి ఐక్య జాతి పరిణామాని కవసరమైన సంస్కృతిని నిర్మించిన ఘనత తెలుగు సాహిత్యానిది. అందుకు మహాభారతం నాంది.

మత ప్రవక్త దృక్పథం సంకుచితం. తన దేవుడిపై భక్తికంటె పొరుగు దేవుడిపై ద్వేషం జాస్తి. దేవతల ద్వేషం ప్రజలలో వ్యాపించి, అంతఃకలహాలకు కారణమైంది.

కవుల దృక్పథం వేరు. ప్రజా జీవితంలోని మతభేదాలకు అతీతమైన, సామాన్య మానవ భావాన్ని ప్రస్ఫుటంగా వ్యక్తీకరించటమే కవి కర్తవ్యము. గురుతర బాధ్యతను నిర్వహించిన కావ్యాలు భారత భాగవతాలు.

మహాభారతం సర్వజన వంద్యంగా ఉండవలెనని తాను రచించినట్లు నన్నయభట్టు ఇలా వివరించాడు :

సీ. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
అధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
ఐతిహాసికు లితిహాసమనియు

పరమ పౌరాణికుల్ బహుపురాణ స
ముచ్చయంబని మహింగొనియాడుచుండ
గీ. వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు.

సంస్కృత భారతము విశ్వజనీనమౌనో కాదో చెప్పలేము గాని, మతకులవిభేధాలతో ఛిన్నాభిన్నమౌతున్న ఆంధ్ర ప్రజలలోని వివిధ వర్గాలను, ధోరణులను ఐక్యపరచే ఒక మహాశక్తిగా ఆంధ్ర మహాభారతం ఉపకరించిందనే విషయం నిర్వివాదం. తామెంతటి మహత్కార్యానికి పూనుకున్నారో మహాభారత కవులు గుర్తించారు.

"నానారుచిరార్థం సూక్తినిధి
నన్నయభట్టు తెనుంగునన్, మహాభారత
సంహితా రచన బంధురుడయ్యె
జగద్ధితంబుగాన్"

"గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెరంగు వారికిన్ వ్యాసముని ప్రణీత"మైన మహాభారత గాథను వివరిస్తున్నానని నన్నయభట్టు మరొకచోట చెప్పాడు.

ఇదే విషయాన్ని భారతంలో అత్యధికభాగాన్ని రచించిన కవిబ్రహ్మ తిక్కన ఇంకా స్పష్టంగా చెప్పాడు.

ఉ॥ కావున భారతామృతము కర్ణ। పుటంబుల నారగ్రోలి, ఆంధ్రావని,
బోదముం మోరయునట్లుగ। సాత్యవతేయ సంస్మృతి
శ్రీ విభవాస్పదంబయిన! చిత్తముతోడ మహాకవిత్వ
దీక్షావిధి. నొంది పద్యముల। గద్యములన్ రచించెన్ కృతుల్"

— అంతేకాదు

తెలుగుభాషలో ప్రజాసామాన్యాని కందరికీ అర్థమయ్యే టట్లు వ్రాయటంలో పురుషార్థ సాధన ఇమిడివున్నదనికూడా తిక్కన భావించాడు.

తే॥ తెనుగుబాస వినిర్మింప దిరువు టగయ
భవ్యపురుషార్థ తరుపక్వ ఫలముగాదె॥

ఆంధ్ర మహాభారతం, నన్నయ ప్రారంభించినా, తర్వాత 200 సంవత్సరాలకుగాని పూర్తికాలేదు. ఏ ఆశయంతో నన్నయ భట్టు భారత రచన కుపక్రమించాడో, అదే ఆశయంతో 1260 ప్రాంతములో కాకతీయ గణపతిదేవుని ఆస్థానంలో తిక్కన ఆ కావ్యాన్ని పూర్తిచేసాడు.

ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాలలో, అన్నికులాలలోను మహా భారతం అంతటి విస్తార ప్రచారంగల గ్రంథం మరొకటిలేదు. పాండవ కౌరవ గాథలు, నాటినుండి నేటివరకు, సామాన్య ప్రజలకు విజ్ఞా నాన్ని, లోకానుభవాన్ని అందచేస్తూనే ఉన్నాయి.

మహాభారతం వైదిక మతాన్ని, హిందూ సంస్కృతిని ప్రచారం చేసినమాట నిజమే. సుస్థిర రాజ్యపాలనకిది లాభిస్తుందని నాటి రాజులు భావించినమాటకూడా వాస్తవము.

ఉద్దేశం ఏదైనా ఫలితం మాత్రం ఆంధ్రప్రజలకు లాభించింది. తెలుగుభాషలో ఉదాత్త కావ్యరచన ప్రారంభమైంది. ఐక్యసంస్కృతీ నిర్మాణానికి పునాది రాయి సుస్థాపితం చేయబడ్డది.

చాళుక్య యుగప్రశస్తి మహాభారత రచనతో ముగియలేదు. తెలుగులో గణితశాస్త్రం రచించిన పావులూరి మల్లన్న రాజ నరేంద్రుని ఆస్థానంలోని వాడే. పిఠాపురం వద్దనున్న నవఖండవాడ గ్రామం ఇతనికి అగ్రహారంగా ఇవ్వబడ్డది.

## పరిపాలనా వ్యవస్థ:

రాజాస్థానంలో మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజ, దౌవారిక, ప్రధాన అధ్యక్ష - ఇత్యాది వివిధోద్యోగులుండేవారు. గ్రామ పరిపాలనను పర్యవేక్షించడానికి కేంద్ర ప్రభుత్వము నైయో గిక వల్లభులను నియమించేవారు. వీరు కొన్ని పదుల గ్రామాలపై అధికారం చలాయించేవారు. కేంద్ర ప్రభుత్వానికే వీరు బాధ్యులు.

సరాసరి కేంద్ర పరిపాలనలో ఉన్న ప్రాంతం కాక స్థానిక పరిపాలకుల చేతులలో విస్తార ప్రాంతం ఉండేది. వీరి ఆంతరంగిక పరి పాలనలో చాళుక్యరాజులు జోక్యం కలిగించుకునేవారు కారు. కప్పంమాత్రం పుచ్చుకొనేవారు. ఎలమంచిలి, పిఠాపురం, ముదిగొండ ప్రాంతాలు ఇట్టిపరిపాలకుల చేతులలోఉండేవి. వీరందరూ విశ్వాస పాత్రంగా ఉంటేనే కేంద్రాధికారం సుస్థిరంగా ఉంటుంది. లేకపోతే నిరంతర కలహాలు తప్పవు, చాళుక్యరాజుల కాలంలో నిరంతర కలహాలకు యీ వ్యవస్థే ప్రధాన కారణం.

గ్రామస్థులను గ్రామేయకులు అనేవారు. రాజశాసనాలన్నీ సరాసరి గ్రామేయులకే సంబోధించి వ్రాయబడేవి. ప్రతి గ్రామం లోను గ్రామ పరిపాలనాధికారులతో పాటు, ప్రభుత్వోద్యోగి కూడా ఒకడుండేవాడు. ఇతనిపేరు గ్రామణి. శిస్తు వసూళ్ళ బాధ్యతలను ఇతడే చూస్తూండేవాడు. వారసత్వాధికారాలు గల గ్రామాధికారు లప్పటికి లేరు. అధికారులను ఇష్టంలేనప్పుడు రాజు తొలగిస్తూ ఉండేవాడు.

# పల్నాటి యుద్ధం

వేంగి చాళుక్యరాజుల పరిపాలన క్రీ॥ శ॥ 1100 సం॥తో అంతమైంది. చోళ-చాళుక్య మైత్రిఫలితంగా రాజరాజనరేంద్రు సంతతివారు కాంచీనగరంలో పరిపాలనచేయ ప్రారంభించారు. ఆంధ్ర దేశాన్నంతా వివిధస్థానిక సామంత ప్రభువులు పరిపాలించ సాగారు.

వీరిలో ప్రధానమైనవారు వెలనాటి చోడులు. కృష్ణ- పెన్నా నదులమధ్య ప్రాంతమంతా వెలనాడు అని వ్యవహరించబడుతూ వచ్చింది. వెలనాటిచోడులు, గుంటూరుజిల్లాలోని చందవోలు రాజధానిగా, కోస్తా ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. నామమాత్రంగా కాంచీపుర రాజులకు వీరు సామంతులుగా ఉన్నప్పటికినీ, వాస్తవానికి వీరు స్వతంత్రులే. ఈ వంశంలో మొత్తంరాజులు నలుగురు. 1106-1206 వరకు ఒక వంద సంవత్సరాలు వీరు ఆంధ్రదేశాన్ని పరిపాలించారు.

వీరిపరిపాలన శాంతంగా సాగలేదు. ఆంధ్రదేశ బలహీనతను కనిపెట్టి, పశ్చిమదిశనుండి, కళ్యాణి చాళుక్యరాజైన విక్రమాదిత్యుడు 1118 లో ఆంధ్రదేశంపై దండెత్తి వెలనాటి చోడులను ఓడించి 1135 వరకు సుమారు 17 సంవత్సరాలు ఆంధ్రదేశాన్ని పరిపాలించాడు. ఈ 17 సంవత్సరాలు కన్నడుల బావుటాక్రింద ఆంధ్ర దేశం అణగిఉంది. తెలుగుచోడులు అవకాశంకొరకు ఎదురుచూస్తూ

వేచివున్నారు. కన్నడదేశంనుండి ఉద్యోగులు, సేనానాయకులు, తదితరులు ఆంధ్రదేశంవచ్చి స్థిరపడసాగారు. ముఖ్యంగా వీరు తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలకు బాగా వ్యాపించారు.

1132 ప్రాంతంలో వెలనాటి రాజైన కొండపడ గొంకరాజు గొప్ప పరాక్రమశాలి. నాటి సామంతరాజులందరినీ ఏకంజేసి, కన్నడ పరిపాలకులకు వ్యతిరేకంగా గోదావరీ తీరంలో 1135 లో ఘోర యుద్ధాలు చేసి, వారిని ఓడించి, తిరిగి తెలుగు దేశాన్ని స్వతంత్రం చేశాడు. అటు తర్వాత 1206 వరకు ఆంధ్రదేశం వెలనాటి చోడుల క్రిందనే వుంది. కన్నడ పరిపాలనను ఓడించి తెలుగుదేశ స్వాతంత్ర్యాన్ని పునఃస్థాపించి వెలనాటి చోడులు తెలుగు చోడులనే గౌరవ నామం ధరించారు.

తెలుగు చోడులలో ఒకరిద్దరు రాజులు కోస్తా ఆంధ్రప్రాంతాన్నంతా పరిపాలించినప్పటికీ వారి పరిపాలన ప్రధానంగా గుంటూరు, నెల్లూరు జిల్లాలకు మాత్రమే పరిమితమై ఉండేది. మిగతాదేశమంతా వేరువేరు స్థానికరాజుల పరిపాలన క్రిందఉండేది. కృష్ణా-పెన్నామధ్య ప్రాంతంకూడా చిన్నచిన్న ఖండాలుగా విభజింపబడి వేర్వేరువంశస్థుల క్రింద ఉండేది.

గోదావరి జిల్లా ప్రాంతమంతా కోనదేశమని వ్యవహరించబడేది. కాలక్రమేణా ఇదే కోనసీమ అయింది. ఈ ప్రాంతాన్ని హైహయరాజులు పరిపాలించారు. కొల్లేరు ప్రాంతాన్ని తెలుగు నాయకులు, విజయవాడ ప్రాంతాన్ని చాగివారు, ధరణికోట (అమరావతి)లో కోటవారు, నరసరావుపేట కొణిదెనలో కొణిదెన చోడులు, పల్నాడుప్రాంతాన్ని హైహయులు, కొండవీడు ప్రాంతాన్ని కమ్మనాయకులు, నెల్లూరును నెల్లూరు చోడులు, కడపజిల్లా పుల్లంపేట ప్రాంతాన్ని పొత్తపి చోడులు, జమ్మలమడుగు ప్రొద్దుటూరు తాలూకాలు కేంద్రంగా రేనాటి చోడులు, ఇంకా అనే

కులు ఆంధ్రదేశంలో ఒక్కొక్క ప్రాంతాన్ని పరిపాలించేవారు. ఈ వంశాల పేర్లు కొన్ని ఇప్పటికీ మనదేశంలో నిలచిపోయాయి.

నామమాత్రంగా వెలనాటిచోళుల ఆధిపత్యాన్ని అంగీకరించినా నిజానికి వీరంతా సర్వస్వతంత్రులు. ఈ చిన్నరాజుల మధ్య తగాదాలు, వైషమ్యాలు, ఈర్ష్యలు అనేక కలహాలకు త్రోవ తీస్తూ ఉండేవి. ఈ కలహాలన్నీ చిలికిచిలికి గాలివానగా మారి పల్నాటి యుద్ధంగా పరిణమించింది. చరిత్ర ప్రసిద్ధిగాంచిన ఈయుద్ధం 1176_1182 సంవత్సరాల మధ్యకాలంలో పల్నాడుతాలూకా కారంచేడులో జరిగింది.

## పల్నాటి యుద్ధం:

గురజాల రాజధానిగా పరిపాలించిన నలగామరాజుకు అతని సవతితమ్ములైన మలిదేవరాజు సోదరులకు మధ్య రాజ్యాధికారం కోసం కలహం ప్రారంభమైంది. నలగామరాజు మంత్రి బ్రహ్మనాయుడు సవతితమ్ములపక్షం వహించి, మాచెర్ల ప్రాంతాన్ని వారికి ఇప్పించి తనుకూడా వారితోపాటు మాచెర్లకు తరలిపోయినాడు. పేరు మలిదేవరాజుదైనా, పరిపాలన అంతా బ్రహ్మనాయుడిదే.

బ్రహ్మనాయుడు వెళ్ళిపోయిన మీదట, నలగామరాజు నాగమ్మ అను ఒక కాపు స్త్రీని తనకు మంత్రిగా నియమించుకున్నాడు. ఈమె పల్నాటియుద్ధానికి మూలబీజాలు నాటింది. కనుకనే నాయకురాలు అని ప్రసిద్ధి చెందింది.

ఏదో విధంగా కవ్వించి బ్రహ్మనాయుడిని అష్టకష్టాలపాలు చేయాలనే ఉద్దేశ్యంతో, నాయకురాలు కోడిపందెములు ఏర్పాటు చేసి, అందులో బ్రహ్మనాయుడిని ఓడించింది. ఒప్పందం ప్రకారం, బ్రహ్మనాయుడు తనబలగాన్నంతా తీసుకొని కృష్ణనుదాటి, అరణ్యప్రాంతంలో వీరమేడపి అనే గ్రామం నిర్మించుకొని 7 సంవత్సరాలు

గడిపాడు. గడువు ముగిసినప్పటికీ, మాచెర్ల రాజ్యాన్ని ఇవ్వటానికి నలగామరాజు నాయకురాలు నిరాకరించటంవల్ల ఉభయ సైన్యాలకు కారంచేడులో ఘోరయుద్ధం జరిగింది. చిట్టచివరకు విజయం బ్రహ్మనాయుడికే లభించింది. కాని అతని అనుచరులు, బంధువులు, మలిదేవరాజు మొదలైన వారంతా నశించారు. దీనితో బ్రహ్మనాయుడు విరక్తిచెంది, రాజ్యమంతా తిరిగి నాయకురాలికే వదలివేసి అడవులలోకి తపస్సు చేసుకోవెళ్ళాడు. ఇప్పటికీ పల్నాడు తాలూకాలో ఈ వీరులగాథలు, చిహ్నాలు నిలచియున్నాయి. బ్రహ్మనాయుడి కొడుకు బాలచంద్రుడు, అతనిభార్య మాంచాల, సేనాని కన్నమనీడు – మొదలైనవారి వీరగాథలు ఆంధ్రదేశంలో శాశ్వతత్వాన్ని సంపాదించుకున్నాయి.

మహాభారత యుద్ధానికివలెనే, పల్నాటియుద్ధానికి కూడ సోదరుల రాజ్యకాంక్ష మూలకారణము. పల్నాటియుద్ధంలో నాటి ఆంధ్రరాజులందరూ ఏదో ఒక పక్షానికి సహాయం చేశారు. ఓరుగల్లు పరిపాలించిన మొదటి ప్రతాపరుద్రుడు 2 వేల గుర్రపురౌతులను నలగామరాజుకు సహాయంగా పంపాడు. కృష్ణా – గుంటూరు, నెల్లూరు, రాయలసీమలోని చిన్నరాజులందరూ తమ సైన్యాలను పంపి ఈయుద్ధంలో పాల్గొన్నారు. కన్నడ, ఘూర్జర, చేది, కళింగ రాజులు సైతం పాల్గొన్నారని శ్రీనాథుడు వర్ణించాడు. వివిధ రాజుల మధ్య అంతఃకలహాలు, ద్వేషాలు, తగాదాలు – అన్నీ ప్రోగుపడి పల్నాటి యుద్ధంగా రూపొందాయి. కనుక నాటి రాజకీయజీవితాన్ని తెలుసుకోడానికి ఈగాథ చక్కగా ఉపకరిస్తుంది.

ఈ యుద్ధంవల్ల కలిగిన అపారజననష్టంతో, రాజుల అహంకారాలు చల్లబడ్డాయి. సైనికబలం సన్నగిలింది. ఇదికూడా ఒక విధంగా మంచిదే అయింది. ఆంధ్రదేశమంతా ఒకే రాజకీయ పరిపాలనక్రింద లేకపోవడంవల్ల కలిగే నష్టాలను ప్రజలు చవి

రాయలు అనెగొంది రాజ్యాన్ని స్వాధీనపరచుకొని స్వతంత్ర హిందూరాజ్య స్థాపనకు హంపి విజయనగరంలో పునాదులు వేశారు. మహమ్మదీయుల దండయాత్ర ఫలితంగా ధ్వంసమైన తెలుగుదేశాన్ని పునరుద్ధరించటానికి జరిగిన యీ ప్రయత్నాలు 14 వ శతాబ్దపు ఆంధ్ర జీవితంలో ప్రధాన ఘట్టాలు. వీరిలో వెలమకులానికి చెందిన ముసునూరి ప్రోలయ నాయకుడు ముఖ్యుడు.

## ముసునూరి నాయకులు :

కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో సామంతులుగా ఉన్న పరిపాలకులు, చావగా మిగిలిన సేనానాయకులు ఏకమై ముస్లిం లను ప్రతిఘటించవలెనని నిశ్చయించారు. ముసునూరి ప్రోలయ నాయకుడు వీరికి నాయకుడు. ముసునూరు కృష్ణాజిల్లా, నూజవీడు తాలూకాలో ఉంది. ఆ ప్రాంతాన్ని ప్రోలయనాయకుడు పరిపాలిస్తూ ఉండేవాడు. ప్రోలయనాయకుని నాయకత్వాన్ని పిఠాపురం ప్రాంతానికి చెందిన కొప్పుల ప్రోలయనాయకుడు, అద్దంకిని పరిపాలించిన, ప్రోలయ వేమారెడ్డి, తెలంగాణాలోని రాజుకొండ పరిపాలకుడైన రేచర్ల సింగమనాయకుడు, ఇంకా అనేకులు అంగీకరించారు. వీరంతా కలిసి, ప్రజలను సంఘటితపరచి, క్రీ॥ శ॥ 1325, 26 ప్రాంతంలో కోస్తాజిల్లాలను విముక్తి చేసారు. వారు తిరుగుబాటు సేనలను సమకూర్చుకొని, అడవులలో కొండలలో తలదాచుకుంటూ, సమయం కనిపెట్టి ముస్లింసైన్యాలపై దాడిచేస్తూ ఉండేవారని మల్లవరం సంతమాగులూరు శాసనాలద్వారా తెలుస్తున్నది.

ప్రజల సహాయంతో జీవిస్తూ, శత్రువులపై మెరపుదాడులు చేస్తూ ముస్లింసేనలను చికాకుపరచేవారు. ప్రబలమైన ముస్లింసేనలను ముఖాముఖి ఎదుర్కొనుటకు సమయముకొరకు కాచి ఉన్నారు. తెలంగాణాప్రాంతం పూర్తిగా ముస్లింల స్వాధీనంకావటంవల్ల, కోస్తాప్రాంతంలో ముఖ్యంగా భద్రాచలంకొండ ప్రాంతాలలో

విముక్తి కార్యక్రమం ప్రారంభించారు. 1325 లో భద్రాచలంవద్ద రేకపల్లిలో వీరు తిరుగుబాటు జెండా లేవనెత్తారు.

అదేసంవత్సరం ఢిల్లీలో పాదుషా గియాసుద్దీన్ తుగ్లక్ మరణించాడు. అతనికొడుకు ఉల్లూఖాన్ వరంగల్లువదలి ఢిల్లీ వెళ్లాడు. దానితో తెలంగాణా ప్రాంతంలోకూడా ఈ తిరుగుబాటుదారుల కార్యక్రమాలు విస్తరించసాగాయి.

ప్రోలయనాయకుడు మరణించాడు. అతని తమ్ముడు కాపయ నాయకుడు ఈ తెలంగాణా విముక్తి పోరాటానికి నాయకత్వం వహించాడు.

ఈవిధంగా పదిసంవత్సరాలకుపైగా గెరిల్లా యుద్ధచర్యలు జరిపి, చివరకు 1336-37 సంవత్సరాలలో కాపయనాయకుడు ఓరుగల్లును స్వాధీనము చేసుకున్నాడు. కాకతీయ రాజ్యపతనానంతరం 13 సంవత్సరాలు ఓరుగల్లు, సుల్తానుపురమను పేరుతో నవాబుల పరిపాలనక్రింద ఉండి తిరిగి హిందూరాజుల స్వాధీనమైంది.

ఇదే కాలంలో ఆర్వీటి సోమదేవరాజు రాయలసీమలోని పాతానికోట, కందనోలు, గంగినేనికొండ, యాదగిరి మొదలైన కోటలను స్వాధీనంచేసుకొని మహమ్మదీయులను ఆ ప్రాంతంనుండి తరిమివేసాడు.

సరిగ్గా అదేసంవత్సరం హరిహర, బుక్క-రాయలు విద్యారణ్య పండితుని ప్రోత్సాహంతో హంపీ, విజయనగరం సామ్రాజ్య శంకుస్థాపన చేసారు.

## అంతఃకలహాల పునర్విజృంభణ :

అయితే ఈ మూడు ప్రయత్నాలకు పరస్పర సమన్వయము లేదు. ముస్లిం దండయాత్రను ప్రతిఘటించవలెనన్న ఐక్యదృష్టితో పాటు, ఎవరికివారు ముఖ్యఅధినేతలు కావాలనే రాజ్యకాంక్షకూడా వీరందరికీఉంది. కాపయనాయకుడు ఓరుగల్లును స్వాధీనం చేసు

కున్నమీదట అంతవరకు అనుచరులుగా నున్న సామంతు లందరూ అతని నాయకత్వాన్ని నిరాకరించి స్వతంత్ర పరిపాలకులుగా రూపొందసాగారు. కాపయనాయకుడు 'ఆంధ్రదేశాధీశ్వర', 'ఆంధ్ర సురత్రాణ' బిరుదులు ధరించాడు. కాకతీయసామ్రాజ్య వైభవాన్ని పునఃస్థాపించ ప్రయత్నించాడు.

కాని ప్రయత్నాలు ఫలించలేదు. రాచకొండ, దేవరకొండ వెలమ నాయకులు కాపయనాయకునితో నిరంతరం పోరాడుతూ ఉండేవారు. ఇది ఇలాఉండగా అల్లాఉద్దీన్ హసన్‌గంగూ అను ముస్లిం సేనానాయకుడు ఢిల్లీ పాదుషా పరిపాలనను ధిక్కరించి, దక్కనులో ఒక స్వతంత్రరాజ్య స్థాపనను పూనుకున్నాడు. అన్యమతస్థుడైనప్పటికీ ఒక సుస్థిర ప్రభుత్వము పొరుగున ఏర్పడుటం దేశక్షేమదృష్ట్యా మంచిదని భావించి కాపయనాయకుడు, హసన్‌గంగూ ప్రయత్నాలను బలపరచాడు. 1347 లో గుల్బర్గా రాజధానిగా బహమనీ రాజ్యం స్థాపించబడ్డది.

తెలంగాణాలో ఏర్పడిన ఈ రాజ్యాలకు నిరంతరం యుద్ధాలు జరుగుతూనే ఉండేవి. హిందూ, ముస్లిం అనే విభేదాలుగాక, కేవలం రాజ్యకాంక్షతో ఈ రాజులు ఒకరితో ఒకరు స్నేహం చేయటమో లేక విరోధించడమో జరుగుతూ వచ్చింది. కాపయ నాయకునికి, బహమనీ సుల్తానులకు జరిగిన అనేక యుద్ధాలలో, రాజుకొండ పద్మవెలమనాయకులు బహమనీ సుల్తానులను బలపరచారు. ఈ అంతఃకలహాల పరిణామంగా, 1368 లో ఓరుగల్లు సమీపంలో జరిగిన యుద్ధంలో కాపయనాయకుడు చనిపోయాడు. రేచర్ల సింగమనాయకుడు ఓరుగల్లును స్వాధీనం చేసుకున్నాడు. నాటినుండి రాచకొండ పద్మనాయకు లొకవైపున, బహమనీ సుల్తానులు మరొకవైపున రాజ్యాధికారంకొరకు పెనగులాడ సాగారు.

## కొండవీటి రెడ్డిరాజులు (1324-1424):

తెలంగాణా ప్రాంతంలో కలహాలు కొనసాగుతూండగా, కృష్ణకు దక్షిణాన గుంటూరు జిల్లాలో అద్దంకిలో ప్రోలయ వేమారెడ్డి అను రెడ్డిరాజు 1324 లో స్వతంత్ర ప్రభుత్వాన్ని నెలకొల్పాడు. ఈ ప్రోలయ వేమారెడ్డి గుంటూరు, నెల్లూరుజిల్లాలు జయించి, శ్రీశైలంవరకూ తన రాజ్యాన్ని విస్తరింపచేశాడు. ఈతడు 74 కోటలను కట్టించాడట. వినుకొండ, కొండవీడు, కొండపల్లి, బెల్లంకొండ, చందవోలు, ధరణికోట – మొదలైన కోటలన్నీ ఈ వేమారెడ్డి కట్టించినవే.

ఇతని కుమారుడు అనపోతారెడ్డి రాజధానిని అద్దంకినుండి కొండవీటికి మార్చాడు. అప్పటినుండి కొండవీడే రెడ్డిరాజులకు రాజధానిగాఉంది. ఇది గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకాలో ఉంది. కొండవీడు రాజధానిగా రెడ్డిరాజులు 1424 వరకు పరిపాలించారు. సుమారు నూరు సంవత్సరాలు నిలచిన యీ కొండవీటి రాజ్యాన్ని పరిపాలించినవారిలో అనవేమారెడ్డి ముఖ్యుడు. ఇతడు కృష్ణా, గోదావరిజిల్లాలను మాత్రమేగాక, విశాఖజిల్లాను సైతం జయించి, తన రాజ్యాన్ని విస్తరింప జేశాడు. అనవేమారెడ్డి దానధర్మాలకు ప్రసిద్ధుడు.

ఇతని తర్వాత కుమారగిరిరెడ్డి, పెదకోమటి వేమారెడ్డి, రాచవేమారెడ్డి అను ముగ్గురు రాజులు పరిపాలించారు. 1424 లో ఈ వంశం అంతరించింది.

కొండవీటి రెడ్డిరాజులలో ఒకడైన కుమారగిరిరెడ్డి తన బావమైన కాటయ వేమారెడ్డి యొక్క శౌర్య సాహసాలనుమెచ్చి రాజమహేంద్రవరం రాజ్యం అతనికి యిచ్చివేసాడు. అప్పటినుండి కొండవీడు, రాజమహేంద్రవరం రెండు ప్రత్యేక రాజ్యాలైనవి. కాటయవేముడు రాజమహేంద్రవరంలోను; కోమటివేముడు కొండ

వీడులోను పరిపాలించసాగారు. వీరిద్దరిమధ్య కలహాలు కొనసాగాయి. ఈ కలహాలలో రాచకొండ పద్మనాయకులు, హంపీ విజయనగరాన్ని పరిపాలించ నారంభించిన వంశస్థులు జోక్యం కలిగించుకోసాగారు. ఈ యుద్ధాల ఫలితంగా 1414 రాజమహేంద్రవర పరిపాలకుడైన కాటయ వేముడు మరణించాడు. ఆ తర్వాత అల్లాడ వేమారెడ్డి, వీరభద్రారెడ్డి అనురాజులు 1447 వరకు ఈప్రాంతాన్ని పరిపాలించారు.

ఇవిమాత్రమేగాక తూర్పుగోదావరి కోరుకొండలో ఒకటి, నెల్లూరుజిల్లా కందుకూరులో ఒకటి స్వతంత్ర రాజ్యాలు స్థాపించబడ్డాయి. వీరిమధ్య నిరంతర అంతఃకలహాలు సాగుతూండేవి. వీటన్నింటినీ కబళించి ఒకే సామ్రాజ్యాన్ని స్థాపించవలెనని, హంపీ విజయనగరరాజులు, కళింగగజపతులు, బహమనీసుల్తానులు నిరంతరం ప్రయత్నిస్తూనే వచ్చారు. అయితే కొండవీటి రెడ్డిరాజుల పరిపాలనసాగినంతవరకూ ఇది సాధ్యం కాలేదు.

రెడ్డిరాజులు సుమారు నూరుసంవత్సరాలు కోస్తా ఆంధ్ర దేశాన్ని పరిపాలించారు. వంశస్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి మహమ్మదీయ వ్యతిరేక పోరాటంలో పాల్గొని స్వతంత్ర రాజ్య స్థాపన చేశాడు. కాని ఆ తర్వాత జరిగిన యుద్ధాలన్నీ పరస్పర రాజ్యకాంక్షతో జరిగినవితప్ప వేరుగాదు. దక్కను పీఠభూమిలో బహమనీ రాజ్యం స్వతంత్రంగా స్థాపించబడటంతో అదికూడా మిగతా స్వతంత్ర రాజ్యాలలో ఒకటి అయింది. ఎవరో పరాయి దేశస్థులు మనమీద దండెత్తి వచ్చారన్న భావం నశించింది.

**సమాజం - సాహిత్యం:**

రాజుల రాజ్యకాంక్షలో హిందూముస్లిం విచక్షణనశించింది. 'శత్రువుయొక్క శత్రువు మిత్రుడు' అను సూత్రం ఈ రాజులంతా పాటించారు. బహమనీ రాజ్యం, రాచకొండ రాజ్యం

ఇరుగు పొరుగువి. రాచకొండపై బహమనీరాజులు దండెత్తి నపుడు కొండవీటి రెడ్డిరాజులు బహామనీరాజులను బలపరచారు. కొండవీటి, రాజమహేంద్రవరం రెడ్డిరాజుల కలహాలలో విజయనగర రాజులు రాజమహేంద్రవరంవారికి సహాయపడ్డారు. కొండవీటి రాజులు విజయనగర సామ్రాజ్య విస్తృతికి ప్రత్యక్ష అవరోధంగా ఉండుటకు ఇది కారణం.

వీరి శౌర్యసాహసాలు ఎంత గొప్పవైనప్పటికీ, యావదాంధ్ర దృక్పథం వీరిలో ఎవరికీ లేదు. స్వార్థపరత్వము, కులదురభిమానము, రాజ్యకాంక్ష ఈ యుద్ధాలకు మూలకారణం.

రెడ్డిరాజులు ప్రజలకొరకు అనేక సౌకర్యాలు కలిగించారు. చెరువులు, కాలవలు, భావులు అనేకం త్రవ్వించి వ్యవసాయాభి వృద్ధికి సాయపడ్డారు. మోటుపల్లి రేవును అనపోతారెడ్డి ఎంతో అభివృద్ధిచేసి విదేశవ్యాపారాన్ని ప్రోత్సహించాడు. మొత్తంమీద దేశం సుభిక్షంగా ఉండి, వర్తక వాణిజ్యాలు బాగా అభివృద్ధి చెందినవని చరిత్ర తెలియజేస్తున్నవి. అవచి తిప్పయసెట్టి అను సుప్రసిద్ధ వ్యాపారి రాజులకుసైతం అప్పులిచ్చేవాడు. శ్రీనాథుడు వ్రాసిన హరవిలాసం ఈ తిప్పయసెట్టికే అంకితం ఇవ్వబడ్డది.

రెడ్డిరాజులంతా వీరశైవమతాన్ని ఆదరించారు. చివరి రోజు లలో మాత్రం వైష్ణవమతంకూడా వ్యాపించసాగింది. భైరవతంత్రం, కాపాలికమతం మొదలైన మత విభాగాలు మొదట్లో వ్యాప్తిలో ఉండేవి.

రాజులు కేవలం భోగలాలసులు కాజొచ్చారు. కుమారగిరి రెడ్డి (1386-1402) అను రాజు కాలంలో వసంతోత్సవం విరివిగా వ్యాప్తిలో ఉండేది. నేటికీ ఉత్తరహిందూస్థానంలో ఉన్న హోలీ పండుగవంటిదే నాటివసంతోత్సవము.

కొండవీటి రెడ్డిరాజులందరూ స్వయంగా గొప్పపండితులు. కుమారగిరిరెడ్డి వసంతరాజీయమను నాటకశాస్త్రాన్ని, కాటయ వేముడు కాళిదాస కావ్యాలకు వ్యాఖ్యానాన్ని వ్రాసారు. కోమటి వేమారెడ్డి సంగీత చింతామణి, సాహిత్య చింతామణి అను గ్రంథాలు వ్రాసాడు. ఇవన్నీ సంస్కృతంలో ఉన్నాయి.

తెలుగు కవులుకూడా అనేకులు ఈకాలంలో వృద్ధిచెందారు. వీరిలో శ్రీనాథుడు, బమ్మెరపోతన ముఖ్యులు.

శ్రీనాథుడు 1385-1475 సంవత్సరాలమధ్య జీవించాడు. కొండవీటి రాజమహేంద్రవర రెడ్డిరాజులవద్ద ఆస్థానపండితుడుగా ఉండి, అనేక కావ్యాలు వ్రాసాడు. కాశీఖండం, భీమఖండం, నైషధం, హరవిలాసం మొదలైనవన్నీ శ్రీనాథుడు వ్రాసినవే. రాజాస్థానంలో ఉండి శృంగారరచనలను రచించినవాడు శ్రీనాథుడు.

ఇందుకు విరుద్ధంగా బమ్మెర పోతన (1400-1460) భక్తి ప్రధానమైన మహాభారతం వ్రాశాడు. వరంగల్లునద్దనున్న ఒంటిమిట్ట బమ్మెరపోతనకవి నివాసస్థలము. రాజులకు అంకితమివ్వటం పాపమని, వారిని నోరారదూషించి, తనకావ్యాన్ని శ్రీరామున కంకితమిచ్చాడు. శ్రీనాథుడు నాటి పాలకవర్గాల భోగలాలసతకు ప్రతినిధి. ఆ భోగ లాలసతపై తిరుగుబాటుచేసి దైవభక్తిని ప్రచారం చేసినవాడు పోతన. నాటి సాంఘిక జీవనంలో రెండు విరుద్ధధోరణులకు వీరిద్దరు ప్రాతినిధ్యం వహిస్తారు. వీరుగాక కవులనేకులు రెడ్డిరాజులకాలంలో రచనలు సాగించారు.

## విజయనగర రాజ్య స్థాపన :

విజయనగర రాజ్యస్థాపకులైన హరిహర, బుక్కరాయలు ప్రతాపరుద్రునివద్ద ప్రధానోద్యోగులుగా ఉండేవారు. వీరిద్దరు అన్నదమ్ములు, ప్రతాపరుద్రునికి దగ్గర బంధువులు. కాకతీయరాజ్య పతనానంతరం వీరిద్దరు ఆనెగొంది వెళ్ళి, అక్కడ అప్పటికే రాజ్యం

చేస్తున్న జంబుకేశ్వరుడను కన్నడరాజువద్ద ఉద్యోగులుగా చేరారు జంబుకేశ్వరునికి, ఢిల్లీ రాజైన మహమ్మదు తుగ్లక్కు జరిగిన యుద్ధంలో వీరిద్దరినీ నవాబు ఖైదీలుగా ఢిల్లీ తీసుకువెళ్ళాడు.

ఢిల్లీ వెళ్ళినమీదట వీరిద్దరు మహమ్మదీయ మతాన్ని స్వీకరించారని కొందరు చరిత్రకారుల వాదన. ఏమైనా తిరిగి, ఆనెగొందిలో కల్లోలపరిస్థితు లేర్పడటంవల్ల, ఢిల్లీ పాదుషా వీరిద్దరిని విడుదలచేసి ఆనెగొందిరాజ్యము పరిపాలించవలసిందిగా పంపివేశాడు. తిరిగి వచ్చినమీదట మాధవీవిద్యారణ్యులను ఒకపండితుని సలహాపై వీరు ఢిల్లీ పాదుషాను ధిక్కరించి, స్వతంత్రంగా విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు.

ఆంధ్ర కర్ణాటక ప్రాంతాలకు మధ్యగా కీలక ప్రాంతంలో వీర్ను రాజ్యాన్ని స్థాపించారు. తత్ఫలితంగా విజయనగర రాజులు కృష్ణకు దక్షిణంగా ఉండే ఆంధ్ర కర్ణాటక ప్రాంతాలను మాత్రమే గాక, మధిర తంజావూరు ప్రాంతాలనుసైతం జయించగలిగారు.

# ఆర్థిక జీవితము

**14** వ శతాబ్దంలో నివసించిన ఆంధ్ర ప్రజల ఆర్థిక జీవితం తెలుసుకోటానికి నాటి శాసనాలు, గ్రంథాలు, తదితర చారిత్రక సామగ్రి మన కుపయోగిస్తాయి.

ప్రజల ముఖ్యజీవనాధారము వ్యవసాయము. అడవులనునరికి, భూమిని సాగులోకి తేవటం, చెరువులు, కాలువలుత్రవ్వించి నీటిపారుదల సౌకర్యాలు కలిగించటం రాజులప్రప్రథమ కర్తవ్యంగాఉండేది. **14** వ శతాబ్దంలో కోస్తాప్రాంతాన్ని పరిపాలించిన రెడ్డిరాజులు ఈ విషయంలో విస్తారంగా కృషి.చేశారు. అయినప్పటికీ, సాగు చేయబడే భూమితో పోల్చిచూపే అడవులు, గుట్టలు విస్తారంగా ఉండేవని నాటి గ్రంథాలద్వారా తెలుస్తోంది.

నేడు సస్యశ్యామలమైన కోనసీమ ప్రాంతంలోని ముమ్మిడి వరంచుట్టూ దట్టమైన అరణ్యాలు ఉండేవి. అదేవిధంగా రామచంద్రపురం తాలూకాలో ప్రవహించే గోదావరి ఉపనది తుల్యభాగకు రెండువైపుల మారేడుచెట్లతో నిండిన అడవులు ఉండేవి.

గోదావరీతీరమే ఇలా ఉండగా ఇతర ప్రాంతాల విషయమై చెప్పనక్కరలేదు. పల్నాటిసీమను వర్ణిస్తూ శ్రీనాథుడు ఇలాఅన్నాడు.

ఆ॥ చిన్న చిన్న రాళ్ళు చిల్లరదేవుళ్లు
నాగులేటినీళ్ళు నాపరాళ్లు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులునుదేళ్ళు
పలనాటిసీమ పల్లెటూళ్ళు.

మెట్టపొలం లేక వెలిపొలము, మాగాని లేక నీరునేల, తోట భూమి అని భూసారాన్నిబట్టి, నీటిసౌకర్యాలనుబట్టి భూమి మూడు రకాలుగా విభజింపబడి ఉండేది. కొలతలను 'గడ' అనే ఒక ప్రమాణం వాడబడేది. అయితే ఈగడ ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్కరకంగా ఉండేది. నాలుగువైపుల 'గడ' పొడవుగల చతురస్రము, కుంట అని వాడేవారు. కుంట అనుపేరు ఇప్పటికీ వాడుకలో ఉన్నది. 2½ కుంటలు ఒక ఎకరముగా నేడు లెక్కకడుతున్నాము. క్షేత్ర గణితంలో కుంట ఇలా వర్ణించబడ్డది.

కం॥ నానాదేశములందును
నానా విధమైన గడలు నగ్గడపైనన్
దాన నలుదిక్కు లొకసరి
గా నుండిన చేను కుంట, గణితవిధిజ్ఞా.

ఇవిగాక ధాన్యాన్ని కొలవటానికి పుట్టి, తూము, కుంచము, మొదలైన కొలతలు ఈనాటివలెనే ఉండేవి. కాలవలు, దొరువులు, పాయలు, బావులు మొదలైన వాటిద్వారా నీటిసప్లయి జరుగుతూ ఉండేది. వ్యవసాయపనిముట్లలోగూడా నాటినుండి నేటికి పెద్ద మార్పేమీలేదు. చెరువులు, కట్టలు నిర్మించే విషయంలో ఆనాడు ఎంతశ్రద్ధ తీసుకోబడేదో ఈక్రింది పూరుమామిళ్ళ శాసనంద్వారా తెలుసుకోవచ్చు. ఈశాసనము విజయనగర రాజులచే 1380 ప్రాంతం లోను, కడపజిల్లా పూరుమామిళ్ళలో చెక్కించబడ్డది.

"చక్కని తటాకం నిర్మించవలెనంటే ఈక్రింది 12 లక్షణా లుండాలి.

1. ప్రజాశ్రేయస్సునుకోరే సమర్థుడైనరాజు.

2. జలవిద్యలో పాండిత్యంగల బ్రాహ్మణుడు.

3. గట్టినేల.

4. కనీసం మూడు ఆమడలదూరం (24 మైళ్ళు పొడుగైనా) గల తీయనినీరుగల నది.

5. చెరువు కట్టదలచుకొన్న ప్రాంతంలో రెండువైపులరెండు గుట్టలు (సహజరక్షణకు)

6. ఈ రెండుగుట్టలమధ్య, రాతితోకట్టిన గట్టి ఆనకట్ట.

7. ఆనకట్ట రెండువైపులా పండ్లతోటలుండరాదు. (ఆన కట్ట ఫలితంగా వచ్చే ముంపువల్లను ఆ భూమిఅంతా మునుగుతుంది.)

8. కొండరాళ్ళు సమృద్ధిగా దొరికే క్వారీ.

9. చెరువుక్రింద సాగుకుపయోగపడే సారవంతమైన భూమి.

10. విశాలమైన చెరువు లోతట్టు భూమి.

11. చెరువుల నిర్మాణంలో కుశలులైన కూలీలు, మేస్త్రీలు.

12. నదిలో జల సమృద్ధి.

ఈవిధంగా నాటి నీటి వనరుల నిర్మాణం జరిగేది.

## ప్రజలపై పన్నుల భారం:

నాటి పన్నుల విధానాన్ని తెలియజేసేందుకు "సకల నీతి సమ్మతం" అనే గ్రంథం, ప్రౌఢకవి మల్లనవ్రాసిన రుక్మాంగద చరిత్ర ఎంతో ఉపయోగపడతాయి. ఆ గ్రంథాల సహాయంతో పరిశీలిస్తే ఈ క్రింది సమాచారం మనకు లభిస్తుంది. రాజుకు 7 రకాలుగా ఆదాయం లభిస్తూ వుండేది.

1. కృషి ప్రపంచము – వ్యవసాయపుపన్ను.

2. గనులు.

3. గోకులం – పశువులపై పన్ను.

4. సుంకము - ప్రయాణంపన్ను.
5. వణికినేయి - వ్యాపారంపన్ను.
6. నందనవనం - విలాసారామాలపై పన్ను.
7. కప్పము - సామంతరాజులు చెల్లించేపన్ను.

వీటిలో అతిప్రధానమైంది వ్యవసాయపు పన్ను. మాగాని ప్రాంతాలనుండిమాత్రం పన్నుధాన్యరూపంలో వసూలుచేయబడేది. మిగతా పన్నులన్నీ ధనరూపంలో ఉండేవి. ముసునూరి నాయకుల కాలంలో పండిన పంటలో ఆరవవంతు పన్నుగా విధించబడది. దాదాపు ఆంధ్రదేశమంతటా ఇదే పద్ధతిలో అమలులో వుండేది. ప్రతి గ్రామంలోను ఇలా వసూలైన ధాన్యాన్ని "రాచగాదెలు" అనబడే గాదెలలో పోసి, ప్రభుత్వోద్యోగులు కాపలా కాస్తుండే వారు. సైన్యాలు ఊరిపైగా వెళ్ళినపుడు, లేక ప్రభుత్వోద్యోగుల ప్రయాణాలకు యీ ధాన్యాన్ని వాడేవారు. మిగతా ధాన్యాన్ని అమ్మి డబ్బును రాజధానికి పంపేవారు. నాటి ప్రభుత్వాదాయంలో ధాన్యాదాయం, సువర్ణాదాయం రెండూకూడా ప్రధానమైనభాగాలే.

గ్రామాలలోని బంజరు భూములు, పచ్చిక బీళ్ళు అన్నీ రాజుగారి అధీనంలోనే ఉండేవి. వాటిలో పశువులకు మేతమేపుననే హక్కును పుల్లరి అనేవారు. పశువుల కాపర్ల వద్ద పుల్లరి వసూలు చేసి బీళ్ళలో పశువులను మేపుకోనిచ్చేవారు. పుల్లరి విషయమై 12వ శతాబ్దంలో నెల్లూరును పాలించిన మనుమసిద్ధి రాజును, గొల్లల నాయకుడైన కాటమరాజును పంచలింగాలవద్ద ఘోరమైన యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలోనే ఖడ్గతిక్కన అనబడే మనుమసిద్ధి సేనాని మరణించాడు. ఈ గాథ నేటికీ ఆంధ్రదేశంలో విస్తారప్రచారంలోఉంది.

గ్రామాలలో మూడు రకాలు ఉండేవి. రాచఊళ్ళు, అగ్ర నాయంకరపాట్లు. వీటిలో రాచ ఊళ్లు అనేవి రాజు గ్రామాలు. ఇందులో నుండి వచ్చిన ఆదాయం అంతా

రాజుగారి స్వంత ఖర్చులకే వినియోగించబడేది. ఈ గ్రామంలోని సర్వాధికారాలు రాజోద్యోగులకే ఉండేవి. రెడ్డిరాజుల కాలంలో ఈ రాచ ఊళ్ళే విజయనగర కాలంలో భండార గ్రామాలనీ, మహమ్మదీయుల కాలంలో హవేలీ గ్రామాలనీ పిలువబడ్డాయి. నిన్న మొన్నటివరకూ ఉన్న జమీందార్ల స్వంత గ్రామాలు, స్వంత భూములకు ఇవే పునాది.

రెండవరకం గ్రామాలు అగ్రహారాలు. వీటిలో పన్ను అంతా బ్రాహ్మణులకే పోతుంది. రాజుకు ఈ గ్రామాలపై ఏ అధికారమూ లేదు. సైన్యాలుగాని, ప్రభుత్వాధికారులుగాని అగ్రహార గ్రామాల సమీపంలోకి సైతం వెళ్ళరాదని రెడ్డిరాజులు కఠిన శాసనాలు చేసారు.

మూడవరకం గ్రామాలు నాయంకరపాట్లు. ఈ మాట ప్రస్తుతం వాడుకలో లేదు. మామూలు గ్రామాలన్నీ ఈ మూడవ రకంలోకి వచ్చేవి.

రాచ ఊళ్ళలో పొలాన్ని రాజే స్వయంగా కౌలుకిస్తూ ఉండేవాడు. శ్రీనాథుడు తన చివరిరోజులలో, కృష్ణానదిఒడ్డున బొడ్డుపల్లి అనే గ్రామంలో కొంతభూమిని కౌలుకు తీసుకొని పంటలు చెడిపోగా ప్రభుత్వ శిస్తుచెల్లించలేక బాధపడట్లు ఈ క్రింది పద్యంద్వారా తెలుస్తున్నది.

తే॥ గీ॥ కృష్ణవేణమ్మ గొనిపోయె - నింతఫలము
బిలబిలాక్షులుతిని పోయె - తిలలుపెసలు
బొడ్డు పల్లెను గొడ్డేలి మోసపోతి
నెట్లుచెల్లింతు టంకంబు రేడునూర్లు.

గనులనుండి వసూలయ్యే పన్నులుగాక, వివిధవృత్తు కూడా ప్రభుత్వానికి పన్నులు చెల్లించేవారు. చేనేతవా

గానుగలవారు, తదితరులు చెల్లించే ఈ పన్నులను వృత్తికట్నాలు అనేవారు.

వీటన్నింటికంటె ప్రభుత్వానికి ప్రధానఆదాయం సుంకాల ద్వారా వచ్చేది. వ్యవసాయ పన్ను తర్వాత ఇదే ప్రధానమైంది. రేవులవద్ద ఎగుమతి - దిగుమతి సుంకములు, రోడ్లమీద ప్రయాణం చేసే వ్యాపారస్థులవద్ద రవణా సుంకములు, ప్రధాననగరం ప్రవేశించినపుడు, తిరిగి వెళ్ళిపోయేటప్పుడు, సరుకు బండ్లమీద విధించే సుంకాలు వుండేవి. ఇవిగాక నేలసుంకం అనివుండేది. సంతలో ఉత్సవాల సమయంలో వ్యాపారస్థులు కట్టుకున్న దుకాణాలపైన ఈ సుంకము వసూలు చేయబడేది.

కాకతీయుల కాలంలో ఈ సుంకాలను ఖచ్చితంగా నిర్ణయించి, ప్రభుత్వోద్యోగులే వసూలు చేసేవారు. కాని రెడ్డిరాజుల కాలంలో ఈ అధికారాన్ని వేలంపాట వేసేవారు. కాంట్రాక్టు పద్ధతివల్ల, ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రకంగా రవాణా సుంకాలు, ఎగుమతిదిగుమతి సుంకాలు విధింపబడి వర్తకులు నానా ఇబ్బందులు పడేవారు. సుంకాలు వసూలుచేసేవారిని సుంకరులు, సుంకాధికారులు అనేవారు. ఉప్పుపైనకూడా పన్ను పూర్వకాలం నుండీ విధించబడుతూ ఉండేది.

ఒకగ్రామం మొత్తంమీద, రాజుకు చెల్లించవలసిన పన్నును కప్పం అనేవారు. సామంత రాజులు చెల్లించేదాన్నికూడా కప్పం అనేవారు. మొత్తంమీద పన్నులభారం విపరీతంగా ఉండేదని స్పష్టంగా తెలుసుకోవచ్చు.

## స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థ:

వ్యవసాయప్రధానమైన ప్రతిసమాజానికి గ్రామజీవితం పునాది. గ్రామ ఆర్థికసంబంధాలు గ్రామజీవితానికి కీలకము కనుక ప్రాచీన గ్రామాలలోని ఆర్థికసంబంధాలు కొంతవరకు తెలుసుకుందాము.

గ్రామంలోని భూ సంబంధాలు ఎలా ఉండేవో స్పష్టంగా తెలుసుకొనటానికి తగిన ఆధారాలు ఇప్పటికీ లేవు. గ్రామ కైఫీయతులను, తదితర సామగ్రినీ ఇంకా పరిశోధించవలసి ఉంది. భూములను ఈనాటివలె కొనటం, అమ్మటం విస్తారంగా జరిగేదికాదు. కాని రైతుకు తన భూమిని ఇతరులకు అమ్మేహక్కు ఉండేది. తాను వ్యవసాయం చేయలేనప్పుడు, అప్పులపాలైనపుడు, మరొక గ్రామం తరలిపోవు సందర్భంలోనూ, గ్రామపెద్దల అనుమతితో తనభూమిని ఇతరులకు అమ్మేవాడు. సర్వవరంవద్ద దొరికిన ఒక శాసనంలో ఖండిక విస్తీర్ణం భూమి ఖరీదు 20 టంకాలని ఉంది. దీనినిబట్టి స్వంత ఆస్తివలె భూమి అమ్మట్టానికి, కొనటానికి హక్కుండేదని స్పష్టమైంది.

గ్రామంలోని భూమిని వివిధ రైతు కుటుంబాలు విడివిడిగా సాగుచేసుకుంటూ ఉండేవారు. ఆ భూమిపై రైతుకుగల పెత్తనం, గ్రామ పంచాయితీకి లోబడిఉండేది. ఇదే ఆనాటికీ నేటికీగల తేడా.

అయితే వ్యాపారసరకులవలె భూములను అమ్మటం, కొనటం విస్తారంగా ఉండేదికాదు. ఏ గ్రామాని కా గ్రామం ఒక చిన్న కేంద్రంవలె ఉండేది. నిత్యజీవితాని కవసరమైన వస్తువులన్నీ ఆ గ్రామంలోనే ఉత్పత్తి అయ్యేవి. అరుదుగా కావలసిన వస్తువులు, పశువులు మొదలైనవి సంతలలో కొనేవారు. ఓరుగల్లు నగరంలో మడిసంత, మైలసంత – అని రెండు సంత ప్రదేశా లున్నట్లు క్రీడాభిరామంలో వర్ణించబడ్డది.

వర్తక వ్యాపారాలు క్రమతో కూడుకున్నవిగా ఉండేవి. దొంగల భయం విస్తారం. సాగుభూముల నంటుకునే అడవులు, గుట్టలు ఉంటూ ఉండేవి. ఈ కారణాలవల్ల ప్రతి ముఖ్య గ్రామానికీ చుట్టూ ప్రహరీగోడ ఉండేది. ప్రహరీచుట్టూ కాపలా తిరిగి గ్రామరక్షణ బాధ్యత నిర్వహించే వ్యక్తి ప్రహరీకాపు. ఈపేరు క్రమంగా పారికాపు, బారికాపు, బారికాడు – అని మారింది.

గ్రామ పరిపాలనలోని బాధ్యతలు నిర్వహించే వ్యక్తులు, రెడ్డి, కరణము, పురోహితుడు, తలారి, బారికాపు, కమ్మరి, కుమ్మరి, సాలె, కంసాలి తదితరులుండేవారు. రైతు వ్యవసాయంలో నిమగ్నుడై ఉండగా, అతని కవసరమైన ఇనుపసామానులు కమ్మరి, పాత్ర సామానులు కుమ్మరి, వస్త్రాలు సాలె, బంగారు వెండి సామానులు కంసాలి చేస్తూ ఉండేవారు. గ్రామ పరిపాలనా బాధ్యత అంతా రెడ్డిది. గ్రామ మునసబును ఇప్పటికీ రెడ్డి అని పాడటం ఆంధ్రదేశంలో సర్వసామాన్యంగా ఉన్న విషయమే.

గ్రామంలో అందరికంటె ధనం, పలుకుబడి హెచ్చుగా గలవాడు సాధారణంగా రెడ్డిగా ఎన్నుకోబడేవాడు. గ్రామస్థులు ఎన్నుకున్నమీదట, రాజు అనుమతికూడా పొందటం అవసరం. కాని ఈ పద్ధతి త్వరలో నశించి, రెడ్డి, కరణం పదవులను సరాసరి రాజులే నియమించటం జరిగింది. కాకతీయుల కాలంనుండి (12 వ శతాబ్దం) ఈ పదవులు, రాజుచే నియమించబడటంతోపాటు వంశ పారంపర్యంగా రావటంకూడా ప్రారంభమైంది.

రైతులేఏ శుభాశుభకార్యాలు జరుపుకున్నా పురోహిత బ్రాహ్మణుడి ప్రమేయం ఉండవలసిందే. గ్రామాని కుండవలసిన అత్యవసర విషయాలను సుమతీ శతకకారుడు ఇలా చెపుతున్నాడు:

క. అప్పిచ్చువాడు వైద్యుడు
ఎప్పుడు ఎడతెగకపారు నెరును ద్విజుడున్
చొప్పడిన ఊరనుండుము
చొప్పడకున్నట్టి ఊరుజొరకుము సుమతీ.

దీనినిబట్టి, రైతులకు అవసర సమయంలో అప్పు ఇవ్వగల ధనికుడు కూడా నాటి గ్రామజీవితంలో ప్రధానపాత్ర వహించేవాడని తెలియగలదు.

గ్రామ సమిష్టిజీవిత నిర్వహణకు సాయపడేవారందరికీ ఈనాములు ఇవ్వబడేవి. వీనినే భటవృత్తి ఈనాములు అనేవారు. వీనిపైన నామమాత్రం పన్నువుండేది. చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి, మొదలైనవారందరికే ఇలాగే ఈనాములున్నవి: ఈ భూములను గ్రామస్థులే తమ పశువుల సహాయంతో దున్నిపెడుతూ వుండేవారు. ఈ విధంగా ఏగ్రామానికి ఆగ్రామం స్వయంసమృద్ధిగా ఉంటూ ఉండేవి. అయితే ఈ విధానంలో గ్రామప్రజలంతా సుఖులుగా ఉండేవారని, ధనికులు, అగ్రవర్ణాలు - ఇతరులపై దోపిడీచేయటం ఉండేదికాదని భావించటం పొరపాటు. ముఖ్యంగా వెట్టివారు అన బడే అస్పృశ్యులు మూడురకాలవెట్టి చేయవలసిఉండేది. రాచవెట్టి, గ్రామవెట్టి; కులవెట్టి. రాజులకుచేసే సేవ, గ్రామానికిచేసే సేవ, కులానికిచేసే సేవ - ఈ శ్రమకంతా ప్రతిఫలితంగా గ్రామస్థులు వారికి ఎంతో కొంత ముట్టజెప్తుతూ ఉండేవారు.

గ్రామం అంతా ఒకటిగా ఉండవలసిన అవసరం ఆనాడు ఎంతో ఉండేది. నిరంతరయుద్ధాలు, రాజకీయ పరిణామాలు, కల్లోలాలు జరుగుతుండే ఆకాలంలో స్వయం సంపూర్ణ గ్రామజీవితం మాత్రం పెద్దగా మార్పుచెందకుండా సుస్థిరంగా వస్తూనే ఉంది.

రాజులు మారినపుడల్లా, పన్నులు హెచ్చు కావటం, కట్నాలు, కానుకలు విశేషంగా వసూలుచేయడం, లేక వైష్ణవ శైవమతోద్యమాల ప్రభావంలో గ్రామజీవితం రెండుగా చీలిపోవటం జరుగుతూనే ఉండేది. ఈ ఒడుదుడుకులను తట్టుకుంటూ, మొత్తంమీద ఈ స్వయం సంపూర్ణ గ్రామజీవితం బ్రిటిషు పరిపాలకులు మనదేశంలో అడుగుపెట్టేవరకూ కొనసాగుతూనే ఉంది.

అయితే గ్రామ ఆర్థిక సంబంధాలలో స్వల్పమైన మార్పులు రాకపోలేదు. కాని పెట్టుబడిదారీ వస్తూత్పత్తిపై ఆధారపడిన ఆర్థిక విధానం మనదేశంలోనికి రానంతవరకూ, సాధారణ వస్తూత్పత్తి

(Simple Commodity Production) పై ఆధారపడిన స్వయం సంపూర్ణ విధానం సహజంగా, కొనసాగుతూ వచ్చింది.

<u>గృహ పరిశ్రమలు, వర్తకము:</u>

వ్యవసాయం ఎంత ప్రధానమో, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, కంసాలి, శిల్పపనులుకూడా అంతే ప్రధానమైనవి. పంచలోహాలతో పనిచేసేవారిని పంచాననంవారు అనేవారు. మొదట్లో పై పన్నులన్నీ విశ్వకర్మలనబడే కంసాలులే చేస్తూండేవారు. క్రమంగా ఇంగులో కూడా కులవిభజన ఏర్పడ్డది.

మోటుపల్లి ప్రాంతంలో వజ్రాలగను లుండేవని మార్కోపోలా వ్రాశాడు. విజయనగరంనుండి 15 రోజుల ప్రయాణంలో చేరుకునే ఒక చోట వజ్రాల పరిశ్రమ ఉండేదని, నికోలిడే లాంటి అనుచరిత్రకారుడు వ్రాశాడు.

విదేశాలతో విస్తారంగా వ్యాపారం జరుగుతూ ఉండేది. కుమారగిరి రెడ్డివద్ద సుగంధా భాండాగార అధ్యక్షుడైన అవచి తిప్పయశెట్టికి శ్రీనాథుడు తన 'హరవిలాసం' అనే గ్రంథం కృతి ఇచ్చాడు. నాడు విదేశవ్యాపారం ఎంతగా సాగుతూ ఉండేనో ఈ క్రింది పద్యము తెలియ జేస్తుంది.

సీ॥ పంజాబు కర్పూర పాదపంబుల తెచ్చి
జలనోది బంగారు మొలక తెచ్చి
సింహళంబున గంధ సింధూరములు తెచ్చి
కురుమంజిబలు తేజి హరులు తెచ్చి
గోవ సంశుద్ధ సంకుమ ద్రవము తెచ్చి
యాసన నాణిముత్యాలు తెచ్చి
చోటంగి కస్తూరి కాటంకములు తెచ్చి
చీని చీనాంబర శ్రేణి తెచ్చి

వస్త్రపరిశ్రమకు ఆంధ్రదేశం మొదటనుండి ప్రసిద్ధి చెందింది. పల్నాటిసీమలో ఏకులు వడకటం దాదాపుగ ప్రతిఇంట్లోను ఉండేదని శ్రీనాథుని పద్యంద్వారా తెలుస్తున్నది.

క. రసికుడు పోవడు పలనా
డె సగంగా రంభయైన నేకులె వడకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

నూనె గానుగలు ఆడే తెలికవారికి విశేష ప్రాధాన్యత ఉన్నట్లు కొన్ని శాసనాల ద్వారా తెలుస్తున్నది. చాళుక్యుల కాలంలో (క్రీ. శ. 1084లో) ప॥ గో॥ జిల్లా ఒక గ్రామంలో నివసించే ఒక వేయి తెలిక కుటుంబాలకు, అంతకుపూర్వంలేని కొన్ని సాంఘిక మర్యాదలు కలిగిస్తూ కుళోత్తుంగ చోళుడు ఒక శాసనం చేశాడు. వృత్తి సహకార సంస్థలు ఉండేవి. తెలికవారంతా సమయము అనబడే ఒక వ్యాపారకట్టుబాటుకు లోబడి వుండేవారు. ఇది కేవలం కట్టుబాటుమాత్రమేకాదు. మత, కుల వ్యవహారాలన్నీ యీ కట్టుబాటుకు లోబడివుండేవి. అదేవిధంగా వర్తకులు నగర అను ఒక సంస్థగా ఏర్పడేవారు. క్రమంగా నగరం అంటే పట్టణం అనే అర్థం రూఢి అయింది.

నేర విచారణ – శిక్షాస్మృతి :

నాటి నేర విచారణ అతిదారుణంగా ఉండేది. ఎర్రగా కాగుతున్న ఇనుప బంతిని – దీనిని మడు అనేవారు – చేతిలో పెట్టుకోవాలి. అప్పటికి చేయి కాలకపోతే అతడు నిర్దోషి. లేకపోతే దోషి. ఈ విచారణను మడ్డుపట్టుట అనేవారు. ఈ ఆచారం యెంత విరివిగా ఉండేదో ఈ క్రింది ఉదాహరణ ద్వారా తెలుస్తుంది.

కాకతీయ రాజు ప్రతాపరుద్రుడు మహమ్మదీయులకు ఓడిపోయాడు. తన వద్దనున్న ధన, కనక, వస్తు వాహనాలన్నీ ఇచ్చి

వేశాడు. తనవద్ద ఏమీ మిగలలేదన్నాడు. కాని మహమ్మదీయ సేనా నిని ఖుస్రూఖాన్ నమ్మలేదు. నుడ్డుపడ్డుట ద్వారా, తాను నిజమే చెప్తున్నట్లు ప్రతాపరుద్రుడు నిరూపించుకోవలెనని ఆజ్ఞాపించాడు.

సలసలకాగే నూనెలో చేయి ఉంచటం, ఇనుప కడ్డీలతో నాలుకను కాల్చటం మొదలైనవి కూడా నేర విచారణలో భాగంగా వుండేవి.

నేరస్థులను పట్టుకోటానికి తలారులకు విశేషాధికారాలు ఇచ్చేవారు. ఈ విధి నిర్వహించే వానిని యామికుడు అంటారు. ఇతడు గ్రామం మొదట్లోగాని చివరలోగాని మకాం బెట్టి, వచ్చే పోయేవారినందరినీ పరీక్షిస్తాడు. అనుమాన మున్నపుడు అందరినీ ప్రశ్నించటం, అవసరమైతే హామీలు కోరటం జరుగుతుంది. ఈ పోలీసుల అధిపతి పెద్ద తలవరి. దొంగతనం జరిగినచోట పోలీసు దొంగను పట్టుకొనలేకపోతే పోలీసే దొంగిలించబడిన ఆస్తికి బాధ్యు డవుతాడు. అందుకని ఏ అమాయకుడిపైననో నేరం మోపక పోలీ సులకు విధిలేదు. గ్రామంబైట కాపలాకాసేవారిని వెలికావలివారని ఇతరులను అచ్చుకావలివారని అనేవారు. ముతరాజు కులంవారు ఎక్కువగా యీ కావలి పనికి వినియోగించబడేవారు. రెడ్డిరాజుల నాటి ఒక శాసనంలో ఇలా ఉంది.

"అనవేమారెడ్డిగారి ప్రభుత్వంలో...చోరుల ఉపద్రవం చేత నిర్వాహకం లేక సంసార్లు ప్రభువుతో చెప్పుకున్నంతలో, బిప్పేటి బోడిలింగమనాయుడు అనే ముతరాచ కోల్వాడు అయివుండగా అతని సామర్థ్యంను అచ్చుకావలి నిర్వాకం చేయగలడని ప్రభువుకు తోచి, ఈ కోట మొదలైన సీమలుకొన్నింటికి అచ్చుకావలి నిర్ణయం చేసినారు. అడపా సింగమ నాయనికి వెలికావలి".

నాటి శిక్షలు చిత్రవధ తప్ప మరొకటి కాదు. రుక్మాంగద చరిత్రలో యీ పద్యము చూడండి :

ఉ॥ కట్టిరి కొట్టిరీడ్చి రథికంబునలాగిరి గుండు రొమ్మునన్
బెట్టిరి బెంగద్రోచిరి తపింపగ నెండలనిల్పిరంటగా
జుట్టిన పచ్చడంబునడి జూడన ద్రోచిరి పట్టుకారులన్
బట్టిరి నిట్టుపాసముల పాలుగజేసిరి ఎఱ్ఱవిందడున్.

ఒక ముస్లిం చరిత్రకారుడు ఇలా వ్రాస్తున్నాడు:

"కాళ్ళు చేతులు నరకటం, చెవులు, ముక్కులు కోసివేయటం, కళ్ళు పీకివేయటం, సీసం కరిగించి నోట్లోపోయటం, గోళ్ళల్లో మేకులు కొట్టటం, మనుషులను సజీవంగా దహించటం, రంపంతో కోయటం, లేక కొరతవేయటం సర్వసాధారణం."

శ్రీనాథునంతటి కవికి సైతం పన్ను చెల్లించనందుకు ఈ క్రింది శిక్షలు విధించబడ్డాయి:

సీ॥ కవిరాజు కంఠంబుదా కౌగిలించెనుగదా
పురవీధి నెదురెండ పొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెను గదా వెదురుగడియ
సార్వభౌముని భుజస్కంధ మెక్కెను
గదా నగరి వాకిటనుండు నల్లగుండు.

మత సాంఘికాచారాలు:

రెడ్డి రాజులకాలంలో ఆంధ్రదేశంలో శైవమతం విస్తారంగా వ్యాప్తిచెందింది. ఈ కాలంలో మతాచారాలలో ఒక విశేషం కనబడుతున్నది. దానధర్మాలు, వ్రతాలు, నోములు, పండుగలు మొదలైనవి అంతులేకుండా పెరిగిపోయినవి. చాతుర్వర్గ చింతామణి అనే గ్రంథంలో వ్రతఖండం అనే విభాగంలో హేమాద్రి అనేకవి ఈ వ్రతాలను విరివిగా వర్ణించాడు. ఏకాదశి ఉపవాసం, ద్వాదశి పారణ,

శివరాత్రి ఉపవాసం - మాఘస్నానాలు, కార్తీక స్నానాలు - ఇలా అంతులేకుండా ఉన్నాయి. వీనిని అన్ని కులాలవారు, ఆచరిస్తూండేవారు. ముఖ్యంగా రెడ్డిరాజులు ఈ వ్రతాలనన్నింటినీ ఆచరించేవారట.

దీనిలో ఇమిడివున్న మూఢనమ్మకాల విషయం అలావుంచి వ్రతాలు, నోములు, దానధర్మాలు - మొదలైన వానిద్వారా నిత్యం వివిధకులాలమధ్య ప్రజలకు ఏదోరకమైన సంబంధం ఏర్పడుతూ ఉండేది. అంతేగాదు. మహమ్మదీయుల మతావేశానికి, పోటీగా వీరశైవమతావేశం రెడ్డి, వెలమరాజులు ప్రజలలో బాగా ప్రచారము చేసారు. దేవతలకు పశువులను బలిఇవ్వటం మాత్రమే గాక, భక్తులు తమతలలనుసైతం దుర్గకు బలిఇవ్వటము ఒక ఆచారమైంది. భైరవుడు, వీరభద్రుడు, దుర్గ మొదలైన ప్రచండ దేవతల ఆరాధన హెచ్చింది. వీరారాధనలు వీరపూజలు జరిగేవి. వీరముష్టి, మైలారు వీరభటులు అను సాహసికులు ఉండేవారు. దేవుని రథంనడుస్తూంటే ఆ రథచక్రాలక్రిందపడి నలిగి చనిపోవటం మోక్షదాయకంగా భావించేవారు. విజయనగరంలో తాను ఇలాంటి ఘటనను స్వయంగా చూచానని నికోలోడి కాంటూ అనుచరిత్రకారుడు వ్రాసాడు.

సహగమన ఆచారంకూడా ఉండేది. అయితే తప్పనిసరిగా నిర్బంధంగా మాత్రం జరిగేదికాదు. సహగమనంచేసిన స్త్రీలు అరుదుగా ఉండేవారు. అలాంటి వారిని పేరంటాళ్ళుగా నేటికీ తెలుగు దేశంలో అక్కడక్కడా ఆరాధిస్తున్నారు.

మంత్ర తంత్రాలలో నాటి ప్రజలకు విశేషంగా నమ్మకముండేది. భూతవైద్యులు, తాంత్రికులు దేశమంతటా ఉండేవారు. రసవిద్యద్వారా బంగారం తయారుచేయటం సాధ్యమౌతుందని ప్రజలు విశ్వసించేవారు. ఈ విశ్వాసాన్ని అవకాశంగా తీసుకొని అనే

కులు గురువులు వెలిసారు. నాటిపండుగలలో నేటికి నశించిన వాటిలో ముఖ్యమైనది వసంతోత్సవము. మిగతావన్నీ నేటికీ నిలచిఉన్నవి. ఇది, ఆనాటి ఆర్థిక, సాంఘిక జీవనం. మతము, మూఢనమ్మకాలు కులాచారాలు ఒకవైపున, ఉత్సవాలు వేడుకలూ మరొకవైపున నాటిసాంఘిక జీవితంలో ప్రధానపాత్ర వహించేవి. .

# విజయనగర సామ్రాజ్యం

కాకతీయరాజ్య పతనానంతరం, ఆంధ్రదేశమంతా మహమ్మదీయ దండయాత్రకు లొంగిపోయే ప్రమాదమేర్పడ్డది. మాలిక్ కాఫరు సైన్యాలు తమిళదేశం ప్రవేశించి మధురనుకూడ స్వాధీన పరచుకున్నాయి. తమిళదేశం నడిబొడ్డులో ఒకముస్లింరాజ్యం ఏర్పడ్డది.

ఈ మహమ్మదీయ దండయాత్రను జయప్రదంగా ప్రతిఘటించి, ఆంధ్రదేశాన్ని మాత్రమేకాక, దక్షిణ హిందూదేశాన్నంతటినీ, ఒకేఒక త్రాటిన నడిపించిన ఘనత హంపీ - విజయనగరం రాజులది. కాకతీయరాజులు నిస్సందేహంగా సాహసికులే. కాని ఉత్తరహిందూస్థానంనుండి ముంచుకువస్తున్న ముస్లిం దండయాత్రను ప్రతిఘటించడానికి, దక్షిణ హిందూదేశంలోని రాజులను ఐక్యం చేయవలసిన ఆవశ్యకతను వారు గుర్తించలేదు. మహారాష్ట్ర పరిపాలకులైన దేవగిరి యాదవులతో ఓరుగల్లు కాకతీయులకు మొదటినుండి కలహాలున్నాయి. ఈ కలహాలను అవకాశంగా తీసుకొని మహమ్మదీయులు మొదట దేవగిరిని, తరువాత ఓరుగల్లును స్వాధీనపరచుకున్నారు. పరాయిశత్రువును ప్రతిఘటించడానికి ఇరుగుపొరుగురాజ్యాలు ఐక్యత కావలెనన్న రాజనీతి కుశలతను కాకతీయ ప్రతాపరుద్రుడు ప్రదర్శింప జాలకపోయినాడు. కనుకనే వీరోచితంగా పోరాడినప్పటికీ ఆంధ్రరాజ్యం పతనమైంది.

ఇదేవిధంగా ముసునూరి నాయకుల ప్రయత్నం కూడా త్వరలోనే విఫలమైంది. రెడ్డి, వెలమ, కాపు - వైషమ్యాలను అధిగమించలేని ఫలితంగా, అల్పకాలంలోనే వీరి ప్రయత్నం విఫలమైంది. 10 సంవత్సరాలుమాత్రమే ఓరుగల్లును పరిపాలించి ముసునూరి కాపయనాయకుడు, రాచకొండ వెలమ ప్రభువుల చేతులలో ఓడిపోయినాడు. అటు తర్వాత ఒక వందసంవత్సరాలు తెలంగాణా ప్రాంతం రాచకొండ వెలమవారి పరిపాలనక్రింద ఉండి 1468 ప్రాంతంలో పూర్తిగా బహమనీ సుల్తానుల స్వాధీనమైంది. కృష్ణకు దక్షిణాన కోస్తా ఆంధ్ర ప్రాంతంమాత్రం రెడ్డిరాజుల పరిపాలనక్రింద ఉండేది.

హంపీ-విజయనగర రాజ్యాన్ని స్థాపించిన హరిహరరాయలు, బుక్కరాయలు పైఘటనలలోని గుణపాఠాలను గ్రహించారు. దక్షిణ హిందూదేశములోని ఆంధ్ర, కర్నాటక, తమిళప్రాంతాలన్నిటినీ ఒకే సామ్రాజ్యంక్రింద వ్యవస్థీకరించినపుడే మహమ్మదీయుల దండయాత్రలను జయప్రదంగా ప్రతిఘటించగలమని గ్రహించారు.

ముస్లిం దండయాత్రవలన నానాబాధలు అనుభవిస్తున్న ప్రజలుకూడా ఈ ప్రయత్నాన్ని బలపరచారు. కనుకనే హరిహర బుక్కరాయల సామ్రాజ్యస్థాపన ప్రయత్నం జయప్రదమైంది.

ఈ ఉద్దేశాని కనుగుణ్యంగా ఆంధ్ర, కన్నడ సరిహద్దులలో, తుంగభద్రా నదీతీరంలో, సహజరక్షణ కుపయోగపడే కొండల నడుమ విద్యానగర పట్టణాన్ని హరిహరరాయలు నిర్మించాడు. ఈ సామ్రాజ్య స్థాపనను, మాధవ విద్యారణ్యుడను ఒక మహాపండితుని నైతిక ప్రోత్సాహం కూడా చాలవుంది. మహారాష్ట్ర స్వాతంత్ర్య వీరుడగు శివాజీకి సంతరామదాసు ఏవిధంగా ధార్మిక, నైతిక ప్రోత్సాహాన్నిచ్చాడో అలాగే విజయనగర సామ్రాజ్యస్థాపనను

మాధవ విద్యారణ్య స్వామికూడా సహాయపడ్డాడు. హిందూ సంస్కృతి, మతము, రక్షింపబడవలెననే ఆశయంతో ఈ సామ్రాజ్య స్థాపన జరిగింది.

విజయనగర సామ్రాజ్య చరిత్రను మూడుదశలుగా విభజింప వచ్చును.

1. 1336 – 1480 వరకు ప్రథమ దశ – ఈ దశలో విజయ నగర రాజ్యము, కన్నడ తమిళ ప్రాంతాలను రాయలసీమను ఆక్ర మించుకున్నది.

2. 1480 – 1550 ఈ దశలో తెలంగాణా మినహా ఆంధ్ర దేశమంతా కృష్ణరాయల పరిపాలన క్రింద ఉన్నది.

3. 1550-1650 ఇది పతనావస్థ. 1565లో తళ్ళికోట యుద్ధములో ఓడిపోయిన మీదట క్రమంగా రాజ్యం శిథిలమై, 1650 కి రాజ్యం పూర్తిగా అంతరించింది.

## సామ్రాజ్యస్థాపన (1336-1480)

ఈ దశను వివరించేముందు విజయనగర సామ్రాజ్య స్థాపకులు ఆంధ్రులా కన్నడులా అనే సమస్యను చర్చించవలసి వుంటుంది. సామ్రాజ్య స్థాపనలో ప్రధానాశయము, హిందూరాజుల నైక్య పరచి, మహమ్మదీయులను ప్రతిఘటించటం అనే విషయం మనం గమనిస్తే సమస్య తేలికగా పరిష్కారమవుతుంది. హరిహర, బుక్క రాయలిద్దరూ కాకతీయ ప్రతాపరుద్రుని బంధువులు. తెలుగువారు. అతనివద్ద సైనికాధికారులుగా ఉన్నవారు. ఓరుగల్లు పతనానంతరం అనెగొంది (హంపీ) వెళ్ళి అక్కడ కన్నడరాజైన జంబుకేశ్వరుని కొలువులో చేరారు. మహమ్మదుబిన్ తుగ్లక్‌చే ఖైదుచేయబడి తిరిగి విడిపించబడి రాజ్యస్థాపనకు పూనుకున్నారు. ఈ వంశం తెలుగు వంశం. అయినప్పటికీ, కన్నడదేశంలో స్థిరపడి, 150 సంవత్సరాలు ప్రధానంగా కన్నడదేశాన్నే పరిపాలించినందువల్ల వీరిని కన్నడరాజు

లుగా భావించటం సమంజం. కన్నడభాషను ప్రధానంగాను, తెలుగును కొంతవరకు వీరు పోషించారు.

కాని 1480 నుండి విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన సాళువ, తుళువ, ఆర్వేటి వంశాలు మూడు తెలుగు వంశాలు. వీరంతా తెలుగు భాషను ప్రధానంగాను, కన్నడభాషను కొంతవరకు ప్రోత్సహించారు. వీరిలో అత్యంత ప్రసిద్ధుడైన కృష్ణదేవరాయలు స్వయంగా ఆముక్తమాల్యద అను తెలుగు కావ్యం వ్రాసాడు. "దేశ భాషలందు తెలుగు లెస్స" అని ఉద్ఘాటించాడు. తెలుగు కన్నడ విభేదాలకు అవకాశమివ్వకుండా విజయనగర రాజులంతా పరిపాలించారు.

విజయనగర సామ్రాజ్యం 1336 లో స్థాపించబడ్డది. రాజ్య స్థాపకుడు హరిహరరాయలు. ఇతని రాజ్యము, మైసూరు కర్ణాటకం ప్రాంతాలకు విస్తరించి ఉండేది. ప్రస్తుత మైసూరురాజ్యము ఆనాడు హొయిసలరాజ్యం అనబడేది. ఈ రాజ్యాన్ని పరిపాలిస్తున్న నాల్గవ బల్లాళ రాజును జయించి హరిహరరాయలు ఆ ప్రాంతాన్నంతా ఆక్రమించుకున్నాడు.

ఇతని తర్వాత (350 - 77) వరకు ఇతని తమ్ముడు బుక్క-రాయలు రాజ్యపాలన చేసాడు. ఇతనికాలంలో మధుర రాజ్యం కూడా విజయనగరంలో కలిసి పోయింది. ఈ విజయాన్ని సాధించిన వాడు బుక్కరాయల కుమారుడు కుమారకంపనుడు. ఈ మధురా విజయమును కంపరాజు భార్య గంగాదేవి ఒకసంస్కృత కావ్యరూపంలో వ్రాసింది. మహమ్మదీయుల పరిపాలనలో ప్రజలు పడ్డ అగచాట్లను ఈమె సవివరంగా వర్ణించింది. హిందూమతాభిమాన ఫలితంగా కలిగిన అతిశయోక్తులు కొన్ని ఉన్నప్పటికీ నాటిసమాజ పరిస్థితులను తెలుసుకోటానికి ఈ గ్రంథం యెంతో ఉపకరిస్తుంది. మధురానగర దండయాత్ర 20 ఏండ్లు పట్టింది. ఈ విజయంతో దక్షిణహిందూదేశ

వీరనరసింహరాయలకు చూపించాడు. దాంతో అతడు నిశ్చింతగా చనిపోయాడు.

అతని మరణానంతరం మంత్రి తిమ్మరుసు సహాయంతో కృష్ణదేవరాయలు పరిపాలించసాగాడు. ఈతడు 1509 నుండి 1530 వరకు పరిపాలించాడు. కృష్ణదేవరాయలు అత్యంత ప్రతిభశాలి. మహాసేనాని, బహుభాషా కోవిదుడు. రాజ్య తంత్రజ్ఞుడు కనుకనే సామ్రాజ్య విస్తరణ ఒకవైపున చేస్తూనే సుస్థిరపరిపాలన కవసరమైన అనేక సంస్కరణలను ప్రవేశపెట్టాడు. తెలుగు, కన్నడ భాషలను రెంటినీ ఆదరించాడు. కాని తెలుగుభాషపట్ల సహజంగా అభిమానం చూపాడు. ఆముక్త మాల్యదలో ఇలా అన్నాడు:

ఆ॥ వె॥ తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగు రేడ నేను, తెలుగొకండ
ఎల్లవారు వినగ ఎరుగవే బాసాటి
దేశభాషలందు తెలుగులెస్స.

అని తన ఆంధ్రాభిమానాన్ని స్పష్టంచేసుకున్నాడు. కృష్ణదేవరాయలు మొట్టమొదట దక్షిణ దిగ్విజయం ప్రారంభించి ఉమ్మత్తూరు శివసముద్రం దుర్గాలను సాధించాడు. ఈ రెండూ కావేరీ తీరమునవున్నవి. అంతటితో సంతృప్తి పడక శ్రీరంగపట్నంకూడా స్వాధీనపరచుకున్నాడు. తన దక్షిణాపథరాజ్యానికంతా శ్రీరంగపట్టణం కేంద్రంగాచేసి కెంపగౌడ్, వరప్పగౌడ్ అను వారిని తన సామంతులుగా నియమించాడు. నాటినుండి ఈ ప్రాంతమంతా ఈ పాళెగాండ్ర పాలనలో కృష్ణరాయలకు లోబడిఉన్నది. ఈ దక్షిణ దండయాత్ర 1512 లో జరిగింది. ఇదేసమయంలో తంజావూరు, మధుర, జింజిప్రాంతాలనుకూడా ఆక్రమించుకున్నారు.

తంజావూరు, మధురలను పరిపాలకులుగా తెలుగు సేనానులు నియమించబడిరి. విజయనగరరాజ్యం పటిష్టంగా ఉన్నంతవరకూ

ఈ రెండురాజ్యాలుకూడా సామంతరాజ్యాలుగా ఉండేవి. అటు తర్వాత ఇవి స్వతంత్ర రాజ్యాలైనవి. తంజావూరు రాజ్యమునకు చెవ్వప్పనాయకుడు - కృష్ణదేవరాయల అనంతరం పరిపాలించిన అచ్యుతరాయలచే 1535 లో నియమింపబడ్డాడు. మధురకు పరిపాల కుడుగా విశ్వనాథ నాయకుడు కృష్ణదేవరాయల కాలంలోనే నియ మించబడ్డాడు.

## కృ ష్ణ దే వ రా య లు :

ఈ విధంగా తెలుగుసేనానులు దక్షిణదేశంవెళ్ళి పరిపాలించ టంతో వారితోబాటు కొన్నివేల తెలుగు కుటుంబాలు ద్రావిడ దేశానికి తరలిపోయినవి. ఇప్పటికీ మధుర, తంజావూరు ప్రాంతా లలో, ఇళ్ళలో తెలుగుమాట్లాడుకునే రాష్ట్రేతరాంధ్రులు కొన్ని లక్షలమంది ఉన్నారు. విజయనగర రాజ్యపతనానంతరం మధుర, తంజావూరు నాయకులు ఆంధ్రభాషా పోషకులుగా పేరుపొందారు. ఈ విధంగా కృష్ణదేవరాయల దక్షిణదిగ్విజయం ఫలితంగా ఆంధ్ర భాష, సంస్కృతి పరరాష్ట్రాలకుకూడా వ్యాపించింది.

దక్షిణ దిగ్విజయం తరువాత కృష్ణరాయలు ఉత్తరదిగ్వి జయను ప్రారంభించాడు. ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, బెల్లం కొండ, నాగార్జునకొండ, అద్దంకి మొదలైన దుర్గాలన్నిటినీ గజపతుల వద్దనుండి ఘోరయుద్ధాలుచేసి జయించాడు. అంతకుపూర్వం కొండ వీటి రెడ్డిరాజులు విజయనగరానికి నామమాత్రంగా సామంతులుగా ఉన్నారేకాని దుర్గాలు ఎల్లప్పుడూ వారి అధీనంలోనే వుండేవి. ఈ మధ్యకాలంలో ఒరిస్సానుండి గజపతులు ఆంధ్రదేశానికి దిగివచ్చి ఈ దుర్గాలన్నిటినీ స్వాధీనపరచుకున్నారు. తిరిగి వీటిని స్వాధీనపరచు కుని ఓఢ్రరాజులను తరిమివేసినవాడు కృష్ణదేవరాయలు.

అటుతర్వాత కృష్ణానదిదాటి, శాతవాహనులకాలంనుండి ప్రసిద్ధిచెందిన శ్రీకాకుళం గ్రామాన్ని అక్కడ ఆంధ్ర విష్ణుదేవా

లయాన్ని కృష్ణదేవరాయలు చూసాడు. ఈ దేవాలయాన్ని చూసి, ప్రాచీనసామ్రాజ్యాధిపతులను స్మృతికితెచ్చుకున్న మీదటనే కృష్ణదేవ రాయలుఆముక్తమాల్యదగ్రంథంవ్రాసాడు. సింహాచలం, పొట్నూరు, కటకంవరకు కృష్ణదేవరాయల దిగ్విజయం సాగింది. కటకం పూర్తిగా ధ్వంసంచేయబడింది. దాంతో ప్రతాపరుద్ర గజపతికీ కృష్ణరాయ లకు సంధి జరిగింది. ప్రతాపరుద్ర గజపతికూతురును కృష్ణరాయలు వివాహం చేసుకున్నాడు. ఇదంతా 1515 లో జరిగింది.

రాయల మూడవదండయాత్ర రాయచూరు దుర్గంపైన. ఇంత వరకు కృష్ణదేవరాయలు ముఖాముఖి మహమ్మదీయులతో తలపడ లేదు. తనసామ్రాజ్యాన్ని విస్తరించుకోవటంలో మాత్రమే నిమగ్నుడై నాడు. కాని 1520 లో రాయచూరు దుర్గాన్ని ముట్టడించి ఆ దుర్గాన్ని స్వాధీనం చేసుకున్నాడు.

ఒకవైపున కృష్ణదేవరాయలు దక్షిణ హిందూదేశాన్నంతటిని జయించి ఏకచ్ఛత్రాధిపత్యము చేస్తూ ఉండగా, రెండవవైపున దక్కనులోని బహమనీరాజ్యము బీజాపురం, అహమ్మదునగరం, బీదరు, బీరారు, గోల్కొండ - అని ఐదు విభాగాలైంది. శత్రు రాజ్యములో వచ్చిన ఈ అంతఃకలహాలను అవకాశంగా తీసికొని 1520 లో కృష్ణదేవరాయలు రాయచూరు స్వాధీనంచేసుకున్నాడు.

రాయచూరు ముట్టడి అనంతరం మిగతా పదిసంవత్సరాలూ రాజ్యపరిపాలన విషయమై శ్రద్ధవహిస్తూ, భాషాపోషణ గావిస్తూ కృష్ణరాయలు కాలంగడిపాడు. రాయలకాలంలోని సాంఘికజీవితం, ఆంధ్రసాహిత్య, సంస్కృతీవికాసం, పరిపాలనావ్యవహారాలు ప్రత్యేకంగా తెలుసుకోవలసిన విషయాలు.

## సామ్రాజ్యపతనం (1550-1650)

కృష్ణదేవరాయలతర్వాత అతనిసవతితమ్ముడు, అచ్యుతరాయలు పదిఏండ్లు పరిపాలించాడు. అతనితర్వాత కృష్ణదేవరాయల అల్లుడు

అళియ రామరాయలు పరిపాలించసాగాడు. ఇతడు రాజ్యవిస్తరణే ప్రధానోద్దేశ్యంగా పెట్టుకొని మహమదీయరాజ్యాలమధ్య అంతఃకలహాలలో జోక్యం పెట్టుకోసాగాడు. బిజాపూరు, అహమ్మదునగరు నవాబులను ఒకరిపై నొకరిని ప్రోత్సహించి యుద్ధాలను ప్రేరేపించి, వారి రాజ్యాన్ని ఆక్రమించుకోసాగాడు. అంతేగాక దురహంకారంతో మహమ్మదీయులను అవమానపరచటం, వారి స్త్రీలను చెరపట్టటం, వారి గ్రామాలను దోచుకోవటం మొదలైన ఘోరకృత్యాలు చేసాడు. అంతవరకూ విజయనగరరాజులు, రాజ్యసౌష్టవమే ప్రధానంగా భావించేరు. కాని అళియ రామరాయలు ఈ విధానానికి స్వస్తి చెప్పి పరరాజ్య అపహరణ, పరమతద్వేషం అనుసరించసాగాడు.

1543–44,1551,1553 సంవత్సరాల్లో అనగా తన 20 సంవత్సరాల పరిపాలనలో 4 సార్లు అహమ్మదునగరు, బీజపూరు రాజులపై యుద్ధాలు చేశాడు. మహమ్మదీయులను నానాహింసలు పెట్టాడు. ఈవిధానం ఫలితంగా మహమ్మదీయ రాజ్యాలన్నీ ఏకమై 1565 లో తళ్ళికోటవద్ద, రామరాయలుతో ఘోరయుద్ధం చేసాయి. ఈయుద్ధంలో విజయనగరసేనలు పూర్తిగా ఓడిపోయినవి. రామరాయలు చనిపోయినాడు. ముస్లింసేనలు విజయనగరాన్ని మూడునెలలవరకు కొల్లకొడుతూనే ఉన్నాయి. దీంతో విజయనగర సామ్రాజ్యపతనం ప్రారంభమైంది.

రామరాయల తమ్ముడు తిరుమలరాయుడు, అనంతపురంజిల్లా పెనుగొండ రాజధానిగా చేసుకొని 1568 నుండి 4 ఏండ్లే పరిపాలించాడు. అటుతర్వాత శ్రీరంగరాయలు, అతని తమ్ముడు వెంకటపతిరాయలు 1614 వరకు పరిపాలించారు. పెనుగొండ మహమ్మదీయులకు అందుబాటులో ఉన్నదని వెంకటపతిరాయలు తన రాజధానిని చంద్రగిరికి మార్చాడు. 1614 నుండి – 1646 వరకూ చంద్రగిరి రాజధానిగా మూడవ శ్రీరంగరాయలు పరిపాలించాడు. చివరకు

మహమ్మదీయుల దండయాత్రకు భయపడి, మైసూరురాజు శరణు జొచ్చాడు. దాంతో విజయనగరరాజ్యం పూర్తిగా అస్తమించింది.

ఈలోగా గోల్కొండ నవాబులు కోస్తా ఆంధ్రదేశాన్నంతా జయించారు. రాజమహేంద్రవరం, కొండవీడు, బెల్లంకొండ, ఉదయగిరి - మొదలైనవన్నీ ఒక్కొక్కటే మహమ్మదీయుల వశమై పోయినవి. 16‥ లో ఉత్తర ఆర్కాటుజిల్లా రాయవేలూరుకూడా మహమ్మదీయులవశమైంది. మధుర, తంజావూరు, జింజి ప్రాంతాలన్నీ స్వతంత్రం ప్రకటించుకున్నవి. మైసూరురాజును రాజఒడయరు అనుసామంతరాజు ఆక్రమించుకొని స్వతంత్ర ప్రభుత్వాన్ని స్థాపించుకున్నాడు. నేటి మైసూరు రాజ్యానికి ఈ ఒడయరే మూల పురుషుడు.

1639 లో చంద్రగిరి పాలకుడైన మూడవ శ్రీరంగరాయలు, తూర్పు ఇండియాకంపెనీవారికి మద్రాసులో కోట కట్టుకొనుటకు అనుమతించాడు. భారతదేశంలో ఆంగ్లేయుల ప్రవేశానికిదినాంది.

1336 లో ప్రారంభమైన విజయనగరసామ్రాజ్యం మూడు వందల సంవత్సరాలపాటు నిలచి నశించింది. దక్షిణ హిందూదేశమంతా 200 సం॥ పాటు వీరు పరిపాలించారు. ముఖ్యంగా ఆంధ్రదేశంలో విజయనగరరాజ్యకాలం ఒకవిధంగా స్వర్ణయుగం. వర్తక వ్యాపారాలు, సాహిత్యం, లలితకళలు విస్తారంగా వృద్ధిచెందినవి. తెలుగుసాహిత్యం ఈ యుగంలో పొందినంతప్రచారం, ఆదరణ మరేయుగంలోను పొందలేదు.

# సాహిత్య వికాసం

హంపీ విజయనగర పాలననాటి రాజుల వైభవము మొదలైన విషయాలను గురించి సమకాలికులైన న్యూనిజ్, పేస్: అనుపోర్చుగీసు చరిత్రకారుల రచనలవల్ల మనం తెలుసుకోగలము. వీరిద్దరు కృష్ణదేవరాయలు, అచ్యుతదేవరాయలు పరిపాలించిన కాలములో విజయనగర ఆస్థానములో ఉన్నారు. కృష్ణదేవరాయల రాయచూరు దండయాత్రను న్యూనిజ్ స్వయంగా చూచి వర్ణించాడు. విజయనగరం కేవలంరాజ్యంకాదు. సామ్రాజ్యము. ఆంధ్ర, తమిళ, కన్నడ ప్రాంతాలను ఒకే త్రాటిమీద నడిపించడం సామాన్య విషయము కాదు. సామ్రాజ్య నిర్వహణ కవసరమైన సైనికబలమును, రాజనీతిజ్ఞత విజయనగరరాజులు అలవర్చుకొన్నారు.

కృష్ణదేవరాయలకుగల సైనికబలాన్ని గురించి పేస్ ఇలా వ్రాస్తున్నాడు. "ఈ రాజువద్ద పదిలక్షల సైనికులు సంవత్సరము పొడుగున ఉంటారు. ఇదంతా స్థిరసైన్యము (Standing army). వీరిలో 35 వేలమంది గుఱ్ఱపు రౌతు లున్నారు. ఏ క్షణంలోనైన ఈ సైన్యం యుద్ధానికి సిద్ధంగా ఉంటుంది. ... ఇంత పెద్ద సైన్యాన్ని పోషించటానికి రాజుకు డబ్బెక్కడనుండి వస్తుంది అని ఎవరన్నా అడుగుతారేమో: ఈ సైన్యమంతా వివిధ సామంతనాయకుల

పోషణక్రింద ఉండేవి. ఈ సామంతులకు వేర్వేరు ప్రాంతాలపై అధికారం ఉంటుంది.

ఆ ప్రాంతములో పన్నులు వసూలు చేసుకోవటం మొదలైన బాధ్యత అంతా ఆ సామంతులదే. ప్రతి సామంతరాజు ఎంతెంత సైన్యాన్ని పోషించాల్సింది కృష్ణదేవరాయలే నిర్ణయిస్తాడు.......

"ఈ సామంతులు సైన్యాన్ని పోషించుటతో పాటు ప్రతి సంవత్సరం ఇంత కప్పం అని రాజుకు చెల్లిస్తూ ఉంటాడు. రాజుగారికి కూతురులు పుట్టినప్పుడు, కొడుకులు పుట్టినప్పుడు, రాజుగారి జన్మదినోత్సవమునాడు వీరు బహుమానా లిస్తూ ఉంటారు" అని ఈచరిత్రకారుడు వ్రాశాడు. కృష్ణరాయలు సైనికవందనంస్వీకరించే దృశ్యాన్ని పేస్ కన్నులకు గట్టినట్లు వర్ణించాడు. అశ్వకదళం, గజదళం, పదాతులు, ధానుష్కులు, ఫిరంగిదళం మొదలైనవాటి నన్నిటిని వర్ణించాడు. పోర్చుగీసు సైనికదళం ఒకటి ఉండేది. గుర్రాలు, ఫిరంగులు - పోర్చుగీసువారి సహాయంతోనే కృష్ణదేవ రాయలు సంపాదించగలిగాడు.

ఇదే విషయమై న్యూనిజ్ ఇలా వ్రాస్తున్నాడు: "విజయ నగర రాజులు ఎంత సైన్యం కావాలంటే అంత సైన్యాన్ని సమీకరించగలరు. అచ్యుతరాయలకు పదాతిదళమే 6 లక్షలకు పైగా వుంది. 24 వేల గుర్రాలున్నవి. వీటి పోషణ బాధ్యత అంతా సామంతులదే. ఈసామంతులు కౌలుదార్ల వంటివారు (Rentors). ఒక సామంతు డున్నాడు. అతను తన ప్రాంతంలో 120 లక్షల నాణెములు వసూలుచేస్తాడు. ఇందులో 60 లక్షల నాణెములు కప్పము చెల్లిస్తాడు. మిగతా ధనంతో సైన్యాన్ని పోషిస్తాడు. సామాన్యరైతులు చాల బాధపడుతున్నారు. ఈ సామంతప్రభువులు అతి నిరంకుశంగా పరిపాలనచేస్తూ ఉంటారు."

కృష్ణదేవరాయలకు పూర్వం ఇంతటి పెద్దసైన్యాన్ని పోషించిన రాజులు లేరు. కాకతీయులకు గల స్థిరసైన్యం కొద్దిపాటి మాత్రమే. యుద్ధం వచ్చినపుడు గ్రామాలనుండి సైనికులను సమీకరించేవారు. విస్తారమైన స్థిరసైన్యాన్ని పోషించేపద్ధతి మహమ్మదీయులు మొట్ట మొదట ప్రారంభించారు. ఇతర రాజ్యాలను ఆక్రమించి సామ్రా జ్యాన్ని విస్తరింపచేయుటయే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న ఢిల్లీ నవాబులు లక్షలకొలది సైన్యాన్ని ఎప్పుడూ పోషిస్తూ ఉండేవారు. కృష్ణదేవరాయలుకూడా అదేపద్ధతి అవలంబించాడు. ఈ విషయంలో పోర్చుగీస్ వ్యాపారస్తులు, సైనికులుకూడా చాల సహాయపడ్డారు.

ఈ విధానంవల్ల ప్రజలపై పన్నులభారం హెచ్చుట, సామం తుల నిరంకుశ పరిపాలనకు హద్దులేకపోవడం సహజంగా జరిగింది. ఐతే కృష్ణదేవరాయలు మాత్రం సామంతులను గట్టిగా అదుపులో ఉంచగలిగాడు. ఆ తర్వాత వచ్చినవారు ఇది చేయలేకపోయినారు.

## పరిపాలన – రాజ్యవైభవము :

విజయనగర రాజులందరూ వర్తక వాణిజ్యాల అభివృద్ధికి వ్యవ సాయాభివృద్ధికి విస్తారంగా కృషిచేశారు. నాటి హంపీ విజయనగర వైభవాన్ని చరిత్రకారులందరూ పొగడారు.

పేస్ ఇలా వ్రాస్తున్నాడు :

"విజయనగరం చుట్టూ 72 మైళ్ళు పొడవుగల కొండలవరుస ఉంది. ఈ ఆవరణలోపల పండ్లతోట, సారవంతమైన భూములు విస్తారంగా ఉన్నాయి. జలసమృద్ధిగల చెరువులు అనేకం ఉన్నవి. వర్తకులు నివశించు వీథులలో కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్యములు కుప్పలు, కుప్పలు ఉన్నాయి. నేనొక కొండ యెక్కి పట్టణమంతా చూశాను. రోము నగరమంత పెద్దదిగాను, సుందరమైనదిగాను నాకు విజయనగరం కనిపించింది."

ఇదే విషయమై అబ్దుల్ రజాక్ అను ముస్లిం చరిత్రకారుడు ఇలా వ్రాస్తున్నాడు : "సప్తప్రాకారములచే చుట్టబడిన ఏడు దుర్గములు ఈ నగరంలో ఉన్నాయి. మొదటి దుర్గము మొదలు మూడవ దుర్గమునరకు పొలములు ఉద్యానవనములు ఉన్నాయి. మూడవ దుర్గమునుండి ఏడవ దుర్గమువరకు ఇండ్లు, వాకిళ్ళు; బజారులు ప్రజలతో కిటకిటలాడుతున్నవి."

వ్యవసాయాభివృద్ధికి విజయనగర రాజులు చేసినకృషి ప్రత్యేకం గమనార్హం. నేడు నిరంతరం కరువుతో బాధలుపడుతున్న రాయలసీమ ఆ కాలంలో రతనాలసీమగా ఉండేదనే విషయంలో అతిశయోక్తి లేదు. రాయలసీమలో ఎక్కడచూచినా రాయలనాటి చెరువులు అనేకం కనపడతాయి. బుక్కరాయ చెరువు, కార్తి సముద్రము, నాగవ్వ చెరువు, బిచ్చపుచెరువు-మొదలైనవనేకం త్రవ్వించబడ్డవి. రాయల్ చెరువు అను పేరుతో వ్యవహరించబడే చెరువులు రాయలసీమలోని అన్ని జిల్లాల్లోను ఉన్నాయి. ఈ చెరువులకు నిరంతరం నీరువచ్చేటట్లు అనేక కాలువలుకూడా విజయనగర రాజులు త్రవ్వించారు.

మొదటి దేవరాయలు విజయనగరానికి 12 మైళ్ళ దూరాన తుంగభద్రకు ఆనకట్టకట్టి ఒక కాలువద్వారా విజయనగరానికి నీటి సప్లయి చేశాడు. కృష్ణదేవరాయలు 1521 కొర్రగల్లువద్ద తుంగభద్రకు మరొక ఆనకట్ట కట్టించి, అనేక చెరువులకు నీరువచ్చేటట్లు చేశాడు. పోర్చుగీసు ఇంజనీర్లుకూడా ఈ ఆనకట్టల నిర్మాణంలో తోడ్పడ్డారు.

కృష్ణదేవరాయల కాలంలో మహార్నవమి ఉత్సవం అతివైభవంగా 9 రోజులు జరిగేదట. ఇప్పటికి మహార్నవమిదిబ్బ అను ప్రసిద్ధస్థలాన్ని హంపీలో చూడవచ్చు. కృష్ణదేవరాయలకు 12 మంది భార్యలు. వారిలో ముగ్గురురాణులు. అందులో ఒకరు పట్టమహిషి.

ఇతని తమ్ముడు అచ్యుత దేవరాయల అంతఃపురములో 500 మంది స్త్రీ లుండేవారని న్యూనిజ్ వ్రాస్తున్నాడు.

రాజనీతి విషయమై కృష్ణదేవరాయలుకుగల అభిప్రాయాలను ఆయన వ్రాసిన ఆముక్తమాల్యదనుండి గ్రహింపవచ్చును. దేశ మధ్యంలో అరణ్యా లుండరాదు. దానిని దొంగలు, దారిద్రోపిడీ గాండ్రు స్థావరం చేసుకుంటారు. కాని సరిహద్దులలో అరణ్యాలుండటం మంచిది. అరణ్యంలో అడవి జాతులవారితో స్నేహ సంబంధాలు నెలకొల్పుకొనుటద్వారా, రాజ్యానికి వారు కాపలావారుగా ఉంటారు. అంతేగాదు, ఆ పరిసర భూములు నిర్ధనులైన పౌరులకు ఉచితంగా సాగుకు యివ్వవలెను. అడవి జాతుల వారు, ఈ పౌరులు ఒకరి ప్రక్కనే ఒకరు ఉండటంవల్ల ఒకరిమీద మరొకరు కాపు (Watch) గా ఉంటారు. ఇద్దరిమధ్య అంతఃకలహాలు వచ్చినా మంచిదే. ఆ అవకాశాన్ని వినియోగించుకొని రాజు తన పెత్తనాన్ని స్థాపించుకోవచ్చు...శత్రురాజుల సామంత ప్రభువులను, సామదాన భేద దండోపాయాలద్వారా లోబరచుకొని పర రాజ్యాలను ఆక్రమించవలెను. రాజు శత్రువులను జయింపవచ్చును. దుర్గములను కట్టుకొనవచ్చును. కాని శత్రు స్త్రీలను పుట్టింటి ఆడపడుచులవలె గౌరవించవలెను. వారి యెడల అనాదరముగాని, వాక్పారుష్యముకాని పనికిరాదు..." సామ్రాజ్యాన్ని విస్తరింపజేసి దానిని దృఢతరంచేయడాని కవసరమైన రాజనీతిని కృష్ణదేవరాయలు అవలంబిస్తూ ఉండేవాడనటానికి ఈ ఉదాహరణ చాలు.

కృష్ణదేవరాయల పరిపాలనలో కరువుకాటకాదులు లేకుండా దేశం సుభిక్షితంగా ఉండేదని, వర్తక వ్యాపారాలకు చోరభీతి లేకుండా కఠిన శాసనాలు అమలు జరపబడెనని పై చరిత్రకారులే వర్ణించారు. అయితే విస్తార సామ్రాజ్యం అంతటా ఇలా ఉండేదని చెప్పలేము. రాయలసీమ మాత్రం సుఖమయ జీవితం గడిపింది.

సాహిత్యం - లలితకళలు :

కృష్ణరాయలు పరిపాలనలో ఆంధ్ర సాహిత్యం పొందినంత వ్యాప్తి అంతకు పూర్వము ఏ యుగములోనూ పొందలేదు. కన్నడ సంస్కృత కవులను కూడా కృష్ణరాయలు పోషించినట్లు ఉదహారణలు వున్నాయి. కాని తెలుగు భాషను ప్రత్యేక అభిమానంతో కృష్ణరాయలు పోషించాడు. అష్ట దిగ్గజములని పేరుపడిన 8 మంది పండితులు, కవులు ఆయన ఆస్థానంలో ఉండేవారు. వారిలో అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, మాదయ్యగారి మల్లన, ధూర్జటి మొదలైనవారు ప్రసిద్ధులు. అల్లసాని పెద్దన వ్రాసిన మనుచరిత్ర ప్రబంధ యుగానికి నాంది.

సాహిత్యంలోకూడా ఒక మార్పు వచ్చింది. అంతవరకూ సంస్కృత కావ్యాలు, తర్జుమాలు, పురాణ గ్రంథాలు మాత్రమే తెలుగులోన రచించబడ్డవి. వానిలోకూడా భక్తి ప్రధానమైన గ్రంథాలు విస్తారంగా ఉన్నాయి.

కాని రాయల కాలంలో తర్జుమాలమీద మోజు, భక్తి పారవశ్యము తగ్గింది. శృంగార రసం ప్రాధాన్యత వహించింది. రాజాస్థానాలలో సర్వసుఖాలుపొందుతూ, రాజులను మెప్పించేందుకై నాటి కవులు రచనలు సాగించారు. పెద్దన, తిమ్మన వీరిలో ముఖ్యులు. కృష్ణరాయల సమకాలికులు కాకపోయినా ఆతర్వాత విజయనగరం పరిపాలించిన రాజుల కాలంలోకూడా కవులనేకు లుద్భవించారు. పింగళి సూరన్న, రామరాజ భూషణుడు, తెనాలి రామకృష్ణుడు మొదలైన వారనేకులు కావ్యరచన చేశారు.

వీరిలో తెనాలి రామకృష్ణుడు రచించిన పాండురంగ మహాత్మ్యము సమకాలిక సాంఘిక జీవనాన్ని ప్రతిబింబించే గ్రంథము. వేశ్యాలంపటుత్వము నాడు సర్వసామాన్యం. ముఖ్యంగా రాజులు, బ్రాహ్మణులు మొదలైన అగ్ర వర్ణాలలో ఇది మరీ హెచ్చు. అవి

నీతికరమైన ఇట్టి జీవితంవల్ల కలిగే కుటుంబ విచ్ఛిత్తి ఈ ఒడుదుడుకులను సద్దటానికి చేసే ప్రయత్నాలు, పాండురంగ మహాత్మ్యములోని నిగమశర్మోపాఖ్యానము చక్కగా వివరిస్తుంది.

రాయల ఆస్థానంలో నివసించిన మరొక కవి ధూర్జటి. ఇతను శివభక్తుడు. కృష్ణరాయలు స్వయంగా వైష్ణవ మతాన్ని ఆదరించినా అన్య మతాలను ద్వేషించలేదు. హిందూ మతంలోని వివిధ మత భేధాలమధ్య సామరస్యం సాధించబడ్డది. జైనమత అవశేషాలనుకూడా విజయనగర రాజులు కాపాడారు; శ్రావణ బెల్గోలాలో ఇప్పటికి నిలిచిఉన్న గోమతీశ్వరుని దేవాలయాన్ని కొందరు వైష్ణవులు ధ్వంసం చేశారు. విజయనగరం రాజులలో రెండవవాడైన బుక్కరాయలు, ఈ తగాదాలో జోక్యం కలిగించుకొని, తిరిగి ఆ వైష్ణవులే, జైనాలయాన్ని కట్టించి ఇచ్చునట్లు తీర్పు ఇచ్చాడు. ఇప్పటికీ ఆ ఆలయం చెక్కు చెదరకుండా ఉంది.

ధూర్జటి కవి కాళహస్తీశ్వర మహాత్మము అనేభక్తి ప్రధానమైన కావ్యాన్ని వ్రాశాడు. ఆ తర్వాత కొంతకాలానికి కాళహస్తీశ్వర శతకముకూడా వ్రాశాడు. బహుశా కృష్ణరాయల మరణానంతరం రాజాదరణ నశించి, రాజ సభలయందు విరక్తిజెంది కాళహస్తికి వెళ్ళి అక్కడ ఈ శతకం వ్రాసిఉంటాడు.

ధూర్జటి ఆ శతకంలో "రాజుల్మత్తులు వారి సేవనరకప్రాయంబు" "రాజకీటములనే సేవింపగానోప" "నరనాథాశ్రయము ప్రాణహాని" "నృపాలాధమున్ భజింపమాతురు భావ్యమే" అని అనేకపద్యాలలో రాజసేవను నిరసిస్తూ వ్రాశాడు.

విజయనగర కాలంలో సాహిత్యంతోపాటు చిత్రకళ, శిల్పాలు కూడా వృద్ధిచెందాయి. హంపిలో, నేటికి నిలచివున్న అనేక దేవాలయాలు పెనుకొండలోని గగనమహల్ మొదలైనవన్నీ నాటి అవశేషాలే. ఆంధ్రదేశములో మాత్రమేగాక తమిళదేశంలోకూడా

విజయనగరరాజులు అనేక దేవాలయాలు నిర్మించారు. చిదంబరం, తిరువణ్ణామలై దదితర యాత్రాస్థలాలలో, కృష్ణదేవరాయలు కొత్త దేవాలయాలు నిర్మించి, పాతదేవాలయాలను బాగుచేయించి శిల్ప కళను విస్తారంగా ఆదరించాడు.

శిల్పకళతోపాటు చిత్రకళకూడా వృద్ధిచెందింది. హిందూ పురానికి 9 మైళ్ళదూరంలో లేపాక్షి అనుచోట పెనుకొండ విరూ పన్న అను కృష్ణరాయల ఉద్యోగి వీరభద్రేశ్వరాలయాన్ని నిర్మిం చాడు. ఆలయం గోడలమీాద శివలీలలను ప్రదర్శించే రకరకాల చిత్రాలు చెక్కించబడ్డవి. లేపాక్షిచిత్రాలకు భారతీయ చిత్ర కళలో విశిష్టస్థానము గలదని విజ్ఞుల అభిప్రాయము. కీర్తిశేషులైన శ్రీ అడవిబాపిరాజుగారు ఈ లేపాక్షి చిత్రలేఖన ప్రాశస్త్యాన్ని ఆంధ్ర దేశానికి తెలియజేసిన వారిలో ముఖ్యులు.

**తంజావూరు – మధుర రాజ్యాలు :**

ఈ రెండూకూడా విజయనగర రాజులకింద సామంతరాజ్యా లుగా ఉండేవి. వీటిని పరిపాలించిన నాయక రాజులు చివరివరకు ఆంధ్రభాషను పోషిస్తూనే వచ్చారు.

1535 నుండి 1673 వరకు తంజావూరు రాజ్యాన్నిసుమారు 140 సంవత్సరాలు నాయకరాజులు పరిపాలించారు. ఈ వంశము ఆఖరువరకు విజయనగర రాజులపట్ల విశ్వాసపాత్రులుగా ఉంటూ వచ్చారు.

వీరిలో ప్రథముడైన చెవ్వప్పనాయకుడు కృష్ణరాయల తమ్ము డైన అచ్యుతరాయలకు బావమరిది. తెలుగుదేశంనుండి వలస వెళ్ళిన ఈతడు తమిళదేశంలో నాటుకుపోయి ప్రజారంజకుడనే పేరు సంపాదించు కున్నాడు. సింహళదేశంవరకు ఈతడు దండ యాత్రలు చేశాడు. ఈతని కాలంలోనే క్రైస్తవ మతప్రచారకులు మొట్టమొదటగా దక్షిణదేశంలో తమ మతప్రచారం ప్రారంభించారు.

ఈతని కుమారుడు అచ్యుతనాయకుడు అధికారంలోకి వచ్చేసరికి విజయనగర రాజ్య వైభవము నశించింది. మధురరాజులు విజయ నగరంపై బహిరంగంగా ధ్వజ మెత్తారు. మధుర రాజులకు, విజయ నగర రాజులకు జరిగిన యుద్ధాలలో అచ్యుతనాయకుడు విజయనగర పక్షం వహించాడు.

ఈ విధంగా మధుర తంజావూరు రాజ్యాలకు నిరంతర కలహాలు ప్రారంభమైనాయి. తంజావూరు రాజులు డచ్చి సాహూ దారుల కాశ్రయమివ్వగా మధురవారు పోర్చుగీసువారికి ఆశ్రయ మిచ్చేవారు.

ఈ కలహాలు ఒకవైపున ఉన్నప్పటికీ, తంజావూరు రాజులు భాషాపోషణ, శిల్పచిత్రకళాభివృద్ధి విశేషంగా చేశారు. దక్షిణదేశం దేవాలయాలకు ప్రసిద్ధి. అందులోను ఒక్క తంజావూరు జిల్లాలోనే 2000 దేవాలయాలున్నవి. వీనిలో ఎక్కువభాగము ఈ నాయక రాజులు కట్టించినవే. బృహదీశ్వరాలయం మొదలైనవన్నీ ఈ నాయక రాజులచేతనే ప్రారంభించబడి తర్వాత వారిచే వృద్ధిచేయ బడ్డాయి.

అచ్యుతనాయకుని కుమారుడు రఘునాధనాయకుడు ఈ రాజులందరిలోకి అతి ప్రసిద్ధుడు. ఇతడు గొప్ప పండితుడు. కవి. అనేకులు తెలుగుకవులు కవయిత్రులు ఈతని ఆస్థానంలో ఉండే వారు. నృత్య సంగీత శాస్త్రాలు ఈతని ప్రోత్సాహంతో విశేషంగా వృద్ధిపొందాయి. ఈతడు స్వయముగా పారిజాతాపహరణము, గజేంద్రమోక్షం మొదలైన భారత భాగవత గాధలను యక్షగానాల రూపంలో వ్రాశాడు. రఘునాధమేళ అను సంగీతగ్రంధాన్ని ఇతడు వ్రాశాడు. ఈతని గురువైన గోవిందదీక్షితుడు సంగీత సుధ అను గ్రంధాన్ని, ఈతని కుమారుడు యజ్ఞనారాయణ దీక్షితుడు అనేక అలంకార గ్రంధాలను వ్రాశారు. చేమకూర

వెంకటపతి, కృష్ణాధ్వరి మొదలైన కవులు, రామభద్రాంబ, మధుర వాణి మొదలైన కవయిత్రులు ఈయన ఆస్థానంలో ఉండేవారు. రామభద్రాంబ, మధురవాణి – వీరిద్దరు వేశ్యలు. గొప్పపండితులు. రామభద్రాంబసంస్కృతములో రఘునాథాభ్యుదయమను గ్రంథాన్ని వ్రాసింది. మధురవాణికూడ రామాయణ గ్రంథాన్ని సంస్కృతంలో వ్రాసింది.

ఆనాటి తెలుగుసాహిత్యం :

రఘునాథ నాయకుని కుమారుడు విజయరాఘవ నాయకుడు సంగీత సాహిత్యప్రియుడు. కాని అసమర్థుడైన పరిపాలకుడు. ఈతడు స్వయంగా రఘునాథాభ్యుదయ' మనే నాటకం వ్రాశాడు. ఇది తెలుగులో మొదటినాటకం. ఈతన ఆస్థానంలో రంగాజమ్మ అను వేశ్య మన్నారుదాసవిలాపము, ఉషాపరిణయము మొదలయిన యక్షగానాలు వ్రాసింది. విజయరాఘవుని ఆస్థానంలో క్షేత్రయ్య అనే సుప్రసిద్ధ గాయకుడుండేవాడు. ఈతని అసలునివాసస్థలం కృష్ణా జిల్లా మొవ్వ. మొవ్వ గోపాలపదములనే పేరుతో శృంగార ప్రధాన మైన జావళీలు వ్రాసినది ఈ క్షేత్రయ్యయే. క్షేత్రయ్య గేయాలు ప్రధానంగా వేశ్యకులంలోనే ఇంతవరకు వ్యాప్తిలో ఉన్నాయి. క్షేత్రయ్యవలెనే తంజావూరు ఆస్థానంలోనే నివసించి జావళీలు వ్రాసినవారు అనేకున్నారు. కంకితవరాజు, వరదయ్య వీరిలో ముఖ్యులు. ఈ క్షేత్రయ్య శిష్యుడు సుప్రసిద్ధుడయిన త్యాగరాజు. త్యాగరాజుకూడ ఆంధ్రుడు. తన పాటలన్ని తెలుగులోనే వ్రాశాడు. విజయరాఘవ నాయకుని తర్వాత తంజావూరును పరిపాలించిన వెంకోజీ కాలంలో త్యాగరాజు జీవించాడు. 1673 సంవత్సరములో మధురరాజులు తంజావూరును పూర్తిగా ఆక్రమించుకున్నారు.

ఇదేవిధంగా 1539 నుండి 1736 వరకు షుమారు 200 సంవత్స రాలు మధురరాజ్యాన్ని ఆంధ్రనాయకులు పరిపాలించారు. వీరిలో

ప్రథముడు విశ్వనాథ నాయకుడు. చివరి ఆమె మీనాక్షి అను రాణి. మొత్తం 13 గురు పరిపాలించారు. మధురలోని దేవాలయాలలో ఎక్కువభాగం కట్టించింది వీరే. ఈ రాజులకు తంజావూరు రాజులకు గల నిరంతరకలహాలలో వీరు మహమ్మదీయుల సహాయాన్ని స్వీకరించారు. విజయనగరరాజ్యం; తంజావూరు రాజ్యం పతనంకావటానికి వీరుకూడా సాయపడ్డారు. ఇలా చేసినవారిలో ముఖ్యుడు తిరుమల నాయకుడు (1623-1659). తిరుమలనాయకుని కాలంలో లింగనమఖి శ్రీ కామేశ్వరకవి అనునాతడు రుక్మిణీపరిణయము సత్యభామా సాంత్వనము అను గ్రంధాలువ్రాసాడు, 1706-1732 వరకు పరిపాలించిన విజయరంగ చొక్కనాథుని ఆస్థానంలో సముఖము వెంకట కృష్ణప్ప అనుకవి, అహల్యా సంక్రందనము, అనుగ్రంధాన్ని శేషము వెంకటపతి అనునతడు తారాశశాంకం అను గ్రంధాన్ని వ్రాసారు.

పద్యరచన మాత్రమేగాక ఈ కాలంలో వచనరచన ప్రారంభమైంది. విజయరంగ చొక్కనాథుడు స్వయంగా, శ్రీరంగమహాత్మ్యము, మాఘమహాత్మ్యము అను వచన గ్రంధాలు వ్రాశాడు. తెలుగు వచన గ్రంధాలకిదే ప్రారంభం.

ముద్దుపళని అను మరొక కవయిత్రికూడా ఈ కాలంలోనే ఉన్నది. ఈమె 1736-53 సంవత్సరములమధ్య తంజావూరును పరిపాలించిన (ప్రతాపసింహుడను మహారాష్ట్రి) రాజువద్దను, అంతకుముందే మధుర పరిపాలించిన విజయరంగ చొక్కనాథుని ఆస్థానంలోను జీవించింది. ఈమె రాధికాసాంత్వనం అను గ్రంధం వ్రాసింది.

మధుర తంజావూరులలో రచింపబడిన తెలుగు సాహిత్యాల విషయమై ఒకముఖ్యాంశము గమనించాలి. ఈ సాహిత్యంలో ముప్పాతిక మూడువీసాలు శృంగారసాహిత్యం. అందులోను అసభ్య శృంగారము. రాజులు, వేశ్యలు, పండితులు - ఈ వలయంలోనే ఈ సాహిత్యంరచింపబడ్డది. చదివి ఆనందించబడ్డది. మధుర, తంజావూరు

ప్రాంతప్రజలు తమిళులు. ఈసాహిత్యం వారిలోకి వెళ్ళలేదు. తాళపత్ర గ్రంథాలలోఉండి నశించినది. పోగా మిగిలినది పరిశోధకుల కృషివల్ల ఇప్పుడు బైటపడుతున్నది.

కృష్ణరాయలకాలంలోనే సాహిత్యంలో శృంగారరసము వృద్ధి అయింది. అయితే ఇది కొంతమోతాదులో ఉండేది. ఈ ధోరణి తంజావూరు మధుర సాహిత్యంలో విపరీతరూపాన్ని పొంది, అసహ్యకరంగా వెగటుగా పరిణమించింది.

ప్రజలతో సంబంధంపోయి, పరాయిరాష్ట్రంలో, రాజాస్థానాలలో మాత్రమే మిగిలిపోవటంవల్లనే, బహుశా తెలుగు సాహిత్యానికి దుర్గతి పట్టిఉంటుంది.

# గోల్కొండ నవాబులు

విజయనగర రాజ్యపతనం ఆంధ్రుల చరిత్రలో ప్రధాన ఘట్టము. ఇంగ్లీషు వ్యాపారస్తులు మద్రాసులో ఫోర్టు సెంటుజార్జి కోటను కట్టుకొని క్రమంగా తమ వ్యాపారాన్ని, అధికారాన్ని దక్షిణాదిన వ్యాప్తి చేసుకోసాగారు. తెలంగాణా కోస్తా ప్రాంతాలు, రాయలసీమ, గోల్కొండ నవాబులచే కొంతకాలం, మొగలు సుబేదారుచే కొంతకాలం పరిపాలించబడ్డాయి.

క్రీ. శ. 1347 వ సంవత్సరమున ప్రారంభమైన బహమనీ రాజ్యం 1512 లో అయిదు రాజ్యాలుగా విడిపోయింది. వీనిలో గోల్కొండ నవాబులు తెలంగాణా ప్రాంతాన్ని పరిపాలించారు. గనుక వీరిని తెలుగు నవాబులని పిలువవచ్చు.

అల్లా ఉద్దీన్ హసన్‌గంగూ, దక్కను పీఠభూమిలో బహమనీ రాజ్యం స్థాపించినప్పుడు, ముసునూరి కాపయ నాయకుడు ఆ ప్రయత్నాన్ని బలపరచిన విషయం మనం గుర్తుంచుకోవాలి. పొరుగున ఒక స్థిరమైన ప్రభుత్వం ఏర్పడడం, ఆంధ్రరాజ్యానికి క్షేమకరమని ముసునూరి కాపయనాయకుడు గుర్తించాడు. ఓరుగల్లు, బహమనీ రాజ్యాలు ఒక కట్టుమీద ఉంటే, ఢిల్లీ పాదుషా దండయాత్రలను ప్రతిఘటించవచ్చునని అతడు ఆశించాడు.

మతద్వేషాన్ని అవతలపెట్టి రాజకీయచతురత ప్రదర్శించాడు.

అంతేగాదు, బహమనీసుల్తానులు, దక్కనులోని ముస్లిములు-పరాయి దేశస్తులు కారు. వీరిలో ఎక్కువమంది మతాంతరులైన హిందువులు, దక్కనులో తరతరాలుగా నివసిస్తున్నవారు. హిందువులు, ముస్లిములు ఒకే జాతికి చెందినవారు. ఇలాంటి రాజ్యంతో స్నేహ సంబంధాలు నెలకొల్పుకోవడమే క్షేమమని, కాపయ నాయకుడు గుర్తించాడు.

ఇదే దూరదృష్టిని కృష్ణదేవరాయలుసైతం ప్రదర్శించాడు. అటు బహమనీ సుల్తానులలో సైతం కొందరు ఈ సమరసవైఖరిని అవలంబించారు. మరికొందరు మతోన్మాదవైఖరిని బలపరచారు. హిందువులతరఫున అళియరామరాయలు ఈ మతోన్మాదవైఖరిని బలపరచినవారిలో ముఖ్యుడు.

ఈ కారణాలవల్ల, 1565 లో జరిగిన తళ్ళికోట యుద్ధం, హిందూముస్లిం రాజుల యుద్ధంగా పరిణమించింది. ఆ యుద్ధముతో విజయనగర సామ్రాజ్యము నాశనమైంది. బహమనీ సుల్తానుల మధ్య ఏర్పడ్డ తాత్కాలిక ఐక్యతకూడా క్రమంగా నశించింది.

## గో ల్కొ ం డ న వా బు లు

ఈ నవాబులు 1512 నుండి 1687 వరకు 158 సంవత్సరాలకు పైగా తెలంగాణాను కోస్తాజిల్లాలలో కొంతభాగాన్ని పరిపాలించారు. ఈ 150 సంవత్సరాలు రాయలసీమ ప్రాంతాన్ని విజయనగర రాజులు పెనుగొండ, చంద్రగిరి నగరాలు రాజధానులుగా పరిపాలించారు. ఇది ఆనాటి ఆంధ్రదేశస్థితి.

గోల్కొండ నవాబులు మొత్తం ఐదుగురు. వీరిపేర్లు కులీ, జంషీద్, ఇబ్రహీం, మహమద్ అబ్దుల్లా, అబ్దుల్ హసన్‌లు. కుతుబ్ షా అనే గౌరవబిరుదు అందరూ ధరించారు!

వీరిలో మొదటివాడైన కులీకుతుబ్ షా 1512-1543 వరకు రాజ్యం చేశాడు. ఇతడు రాజ్యాన్ని స్థాపించినప్పుడు తెలంగాణాలో

కొంతభాగము మాత్రమే ఇతనిపరిపాలనలో ఉంది. మిగతా తెలంగాణా, కోస్తా ఆంధ్రదేశము గజపతుల ఆధీనంలో ఉంది. కృష్ణదేవరాయలు కళింగ దండయాత్రజరిపి, కోస్తా ఆంధ్రదేశాన్నంతా జయిస్తున్న సందర్భములో, రాచకొండ, దేవరకొండ దుర్గాలను కులీకుతుబ్ షా స్వాధీనం చేసుకున్నాడు. కాని త్వరలో కృష్ణదేవరాయలుతో జరిగిన ముఖాముఖి యుద్ధంలో ఈతడు పూర్తిగా ఓడిపోయినాడు. రాయల మరణానంతరం ఇతడు విజృంభించి ఓరుగల్లు, ఖమ్మంమెట్టు, బెల్లంకొండ, కొండపల్లి, కొండవీడు దుర్గాలను; మెతుకు; పానుగల్లుదుర్గాలను జయించాడు. తెలంగాణా అంతటా ఇతని ఆధీనంలోకి వచ్చింది.

ఈ యుద్ధాలలో సీతాపతిరాజు అను ఒక ప్రముఖ వీరునితో కులికుతుబ్ షా పోరాడవలసివచ్చింది. ఈ సీతాపతిరాజు - సీతాబుఖాన్, చిత్తాపుఖాన్ అనికూడ చరిత్రలో వ్యవహరించబడ్డాడు. మహమ్మదీయ రాజ్య విస్తరణను కొంతవరకైనా ప్రతిఘటించే ఉద్దేశముతో ఇతడు ఖమ్మంమెట్టును తనకేంద్రంగా చేసుకొని దక్షిణ తెలంగాణాను పరిపాలించసాగాడు. ఇతడు మొత్తం మూడుసార్లు కొండపల్లి, ఖమ్మంమెట్టు, ఓరుగల్లు-ప్రాంతాలలో కులీకుతుబ్ షాతో ఘోరంగా పోరాడాడు. కాని మూడుసార్లు ఓడిపోయినాడు. తాను పరిపాలించిన స్వల్పకాలంలో ఈ సీతాపతిరాజు ఓరుగల్లులోని దేవాలయమును బాగుచేయించి పాకాలచెరువును మరమ్మతు చేయించి ప్రజోపయోగకార్యాలనేకము చేశాడు.

ఈ వంశంలో మూడవవాడైన ఇబ్రహీం (1550-80) సుప్రసిద్ధుడు. తనఅన్న జంషీకు భయపడి అళియరామరాయలవద్ద కొన్ని సంవత్సరాలు ప్రవాసంగడిపాడు. ఆకాలంలో ఇతనికి తెలుగు భాషతోను, తెలుగు కవులతోను పరిచయం ఏర్పడ్డది. ఆ తర్వాత ఇతడు అళియరామరాయలపై కత్తిగట్టి మిగతా బహమనీ నవాబులతో కలసి తళ్ళికోటలో విజయనగర రాజ్య పతనానికి కారకుడైనాడు.

కాని గోల్కొండ నవాబులందరిలోకి ఈతడు ప్రజాహిత కార్యాలు ఎక్కువగా చేశాడు. ఇతని గురించి కొమర్రాజు లక్ష్మణ రావుగారు తన మహమ్మదీయ మహాయుగంలో ఇలా వ్రాశారు. "ఈ నవాబు విద్వాంసుడు. ఇతని రాజ్యములో దొంగలభయంలేదు. మశీదులను, ప్రాసాదములను కట్టించి చెరువులను తవ్వించి ఎన్నో ప్రజోపయోగమైన పనులు చేశాడు." గోల్కొండ దుర్గానికిచుట్టూ ప్రహరీగోడ, ఇబ్రహీంబాగ్, పూల్ బాగ్ అను తోటలు, హుస్సేన్ సాగరు అను బ్రహ్మాండమైన చెరువు, మూసీనదికి బడవల్ వద్ద ఆనకట్ట ఇవన్నీ ఇతడే కట్టించాడు. ఈతని కాలంలో టర్కీ, అరేబియా, పర్షియానుండి విదేశవర్తకులు గోల్కొండకు విస్తారంగా వచ్చేవారు.

ఈరాజు అనేకమంది తెలుగుకవులను పోషించాడు. 'మల్కిభరాం' అను పేరుతో కవులీతనిని కీర్తించారు. పొన్నెకంటి తెలగన్న అనుకవి, అచ్చ తెలుగులో యయాతిచరిత్ర అను గ్రంథం వ్రాసి ఇతని సర్దారైన అమీన్ ఖాను అనునతనికి కృతి ఇచ్చాడు. ఈ అమీన్ ఖాను పొట్లచెరువులో పరిపాలిస్తూ ఉండేవాడట. ఈ ఖాన్ హిందూముస్లిం భేధంలేక ప్రజలకు సహాయం చేసేవాడు. వివాహంకాని బ్రాహ్మణులకు ధనసహాయంచేసి, పెండ్లిండ్లుచేయించే వాడట. అద్దంకి గంగాధరుడను మరొకకవి, తపతీసంవరణోపాఖ్యానం వ్రాసి, స్వయంగా ఇబ్రహీంషాకు అంకితం ఇచ్చాడు. ఇదేకాలంలో కందుకూరు రుద్రకవి నిరంకుశోపాఖ్యానము అను ఒక కావ్యాన్ని, సుగ్రీవ విజయమను యక్షగానాన్ని వ్రాశాడు. ఈకవికి ఇబ్రహీంషా చింతలపాలెం అను అగ్రహారం దానంచేశాడు. ఇదే కాలంలో మల్లారెడ్డిఅను మరొక కవికూడా జీవించాడు. ఈకవి శివధర్మోత్తరము షట్చక్రవర్తి చరిత్రము మొదలైన గ్రంథాలు వ్రాశాడు. వీరు గాక ఇంకా అనేక కవులు ఇబ్రహీం పరిపాలన కాలంలో వర్ధిల్లారు. మతసామరస్య ధోరణిలో ఈ రాజు పరిపాలించాడు అనటానికి ఈ ఉదారణలు చాలు

తానీషా - అక్కన్న మాదన్నలు :

ఇబ్రహీంతర్వాతపాలించిన మహమ్మద్ కుతుబ్ (1580-1611) హైదరాబాదు నగరాన్ని కట్టించాడు. ఈ రాజును భాగ్యవతి అను హిందూ భార్య ఉండేది. ఆమెపేర యీ నగరాన్ని మొదట భాగ్య నగరం అని పేరుపెట్టాడు. ఆమె చనిపోయిన తర్వాత తన కుమారుని స్మారకార్థం ఆ పేరును హైదరాబాదు అని మార్చాడు. ఈతని కుమారుడు అబ్దుల్లా హుస్సేన్ (1611-1658) కాలములో ఆంధ్రదేశ మంతా గోల్కొండ నవాబుల స్వాధీనమైంది. చంద్రగిరిలో నామ మాత్రావ శేషంగావున్న విజయనగర వంశస్తులనుకూడా గోల్కొండ నవాబులు జయించారు. రాయలసీమలో సైతం నవాబుల రాజ్యం ప్రారంభమైంది. గోల్కొండనవాబులలో ఆఖరువాడు అబ్దుల్ హసన్ కుతుబ్ షా (1658-1687). ఇతనినే తానాషా, లేక తానీషా అని చరిత్రకారులు వ్యవహరిస్తున్నారు. తానాషా అనగా మంచి రాజు. ఈతడు ప్రజాహితంగా పరిపాలించేవాడు. అయితే పాలన అంతా సామంతుల చేతులలో వదలిపెట్టి, నిత్యమూ ఆట పాటలతో కాలక్షేపం చేశాడు. ఇతని వద్ద అక్కన్న అను సేనాని, మాదన్న అను ప్రధానమంత్రి ఉండేవారు. వీరిద్దరు అన్నదమ్ములు. ఈ అక్కన్న మాదన్నలకు మేనల్లుడే కంచర్ల గోపన్న. రామదాసను పేరుతో ప్రసిద్ధిచెందినవాడు. ఈ గోపన్నయే భద్రాచలం తాసీల్దారుగా ఉన్న గోపన్న. సర్కారుడబ్బుతో దేవాలయంనిర్మించాడు. శిస్తు చెల్లించ నందుకు గోపన్నను కొంతకాలం తానీషా ఖైదుచేసి, ఆ తర్వాత అతడు గొప్ప భక్తుడని గుర్తించి వదలివేశాడు. ఈ గాథఇప్పటికీ విస్తారప్రచారంలో ఉంది. ఈరామదాసు దాశరథీశతకము వ్రాశాడు.

తానీషాకాలంలోనే మొగల్ పాదుషా ఔరంగజేబు, దక్క నును జయించాలని ప్రబలప్రయత్నంచేశాడు. 1686 లో గోల్కొండ ముట్టడి ప్రారంభమైంది. తానీషాసంధికి సిద్ధమైనాడు. కాని ఔరంగ

జేబు అంగీకరించలేదు. చివరకు యుద్ధంజరిగింది. 7 నెలల ముట్టడి తర్వాత గోల్కొండదుర్గం ఔరంగజేబు వశమైంది. కొందరు తానీషా సేనానులు లంచంతీసుకొని స్వామిద్రోహం చేయడంవల్లనే ఇలా జరిగింది. తానీషా ఖైదుచేయబడి దేవగిరి దుర్గంలో మరణించాడు. దీంతో గోల్కొండ స్వతంత్రప్రభుత్వం అంతమైంది.

గోల్కొండ రాజ్యాన్ని కాపాడటానికి అక్కన్న మాదన్నలు అబ్దుల్ రజాక్ అనుసేనాని ఎంతో కృషిచేసారు. మహారాష్ట్ర నాయకుడైన శివాజీకి, తానీషాకు సఖ్యత ఏర్పరచి ఔరంగజేబు పాదుషాను ప్రతిఘటించవలెనని అక్కన్న మాదన్నలు తీవ్రంగా కృషిచేసారు. కాని వారికృషి ఫలించలేదు. కొందరు మతోన్మాదులు ఔరంగజేబు ప్రేరేపణపై హైద్రాబాదు వీధులలో బహిరంగంగా అక్కన్న మాదన్నలను ముక్కలుముక్కలుగ వధించారు. యుద్ధంవచ్చినమీదట అబ్దుల్‌రజాక్ వీరోచితంగా పోరాడాడు. ఈతడు 9 నెలల యుద్ధంలో నూరుగాయములు తినికూడా యుద్ధరంగమునుండి తప్పుకోలేదు. గోల్కొండ సర్వనాశనమైన మీదట కూడా అబ్దుల్‌రజాక్ ఔరంగజేబుక్రింద పనిచేయుటకు అంగీకరించక జీవితశేషాన్ని విశ్రాంతితో గడిపి మరణించాడు.

1686 లో గోల్కొండ రాజ్యం పతనమైంది. అంతకు పది ఏండ్లకుముందే 1675 లో చంద్రగిరిలోని విజయనగర రాజ్యపాలన అంతమైంది. పరదేశంలోని తంజావూరు నాయుకరాజుల పాలనకూడా 1673 తో అంతమైంది. ఆంధ్రప్రభుత్వాలన్నీ కూలిపోయినవి. దారిదోపిడీగాండ్రు ఆంధ్రదేశం నలుమూలలా స్వైరవిహారం చేయసాగారు. ఆంధ్రుల క్షీణదశకిది ప్రారంభము.

## అరాచకము - ప్రజల కడగండ్లు:

ఔరంగజేబు 1687లో దక్కనుజయించాడు. 20ఏండ్ల తర్వాత 1707 లో చనిపోయినాడు. ఔరంగజేబుకాలంలో దక్కనును

సుబేదారుగా నిజాముల్ ముల్కు అసఫ్‌జా అనునాతడు నియమించ బడ్డాడు. ఔరంగజేబు మరణానంతరం, 1724లో ఈనిజాముల్ ముల్కు స్వతంత్రతను ప్రకటించుకున్నాడు. నేటికి ఈ అసఫ్‌జా వంశమే హైద్రాబాదును పాలిస్తున్న విషయం పాఠకులకు తెలిసినదే.

ఆంధ్రదేశంలో అరాచకంవ్యాపించింది. ఒక మూల మొగలు సేనల దోపిడి, రెండోవైపున తూర్పు ఇండియా కంపెనీకి చెందిన బ్రిటీషువారి ఆక్రమణ సాగుతున్నరోజులు. నిజాముల్ ముల్కు పరిపాలనకు గోల్కొండ నవాబుల పరిపాలనకు ఎంతో వ్యత్యాసముంది. గోల్కొండ నవాబులు మొత్తంమీద ప్రజారంజకంగా పరిపాలించారు. కాని నిజాముల్ ముల్కు ఏదోవిధంగా రాజ్యాన్ని నిలుపుకోవటమే ప్రధానాశయంగా పెట్టుకున్నాడు. మొగలు సుబేదారుగా ప్రవేశించాడు. వీలు చిక్కగానే స్వతంత్రం ప్రకటించుకున్నాడు. బ్రిటీషు ఫ్రెంచిసేనలకు తనదేశంలో స్వేచ్ఛా విహారం ఇచ్చాడు. దేశముఖులను దేశపాండ్యాలకు వారి ప్రాంతాలలో వారికి సర్వాధికారా లిచ్చాడు. ఈ విధంగా ప్రజల కడగండ్లు విపరీతమైనవి.

ఈ వాతావరణంలో శతక వాఙ్మయం వృద్ధిచెందింది. ఇందులోని ఎక్కువభాగం భక్తి ప్రధానంకాని 'సమకాలిక ప్రజల ఇబ్బందులను ప్రతిబింబిస్తూ వ్రాసిన కొన్ని శతకాలు కూడా లేక పోలేదు.

గోగులపాటి కూర్మనాథుడను కవి 1724 ప్రాంతంలో విశాఖ జిల్లాలోని విజయనగరాన్ని పరిపాలించిన మొదటి ఆనందగజపతి ఆస్థానంలో ఉన్నాడు. ఈ ఆనందగజపతి, పాయకారావుపేటను పరిపాలిస్తున్న, పాయకరావు అను ఉత్కళరాజు. నైజాంవద్ద కొన్ని లక్షలు అప్పుతీసుకొని ఇవ్వనందున నైజాంసేనలు, ఆ ప్రాంతాన్ని కొల్లకొట్టసాగినవి. నాటి ప్రజల దుస్థితిని నైజాం సేనల దుండగా

లను, గోగులపాటి కూర్మనాథకవి, సింహాద్రి నరసింహస్వామిపేర ఇలా వివరిస్తున్నాడు.

సీ॥ యవనేశుధాటికి నడలి సర్వస్వమ్ము
విడిచి మందిరములు వెడలువారు
వెడలియు దలదాచ వెరమేమిగానక
నడవుల నిడుమల బడెడువారు
బడియునెచ్చట కూడుబెట్టగానక తమ
శిశువులతో వెతజెందువారు
జెంది డెందముగుందగాంది శీక తనభి
మానార్థులై ఖేదమూనువారు
గీ॥ నైరి యొక్కొక్క భార్యతో నవని ప్రజలు
అష్టమహిషులపై పదియారువేల
సతులతో నీవు వలసకేచ్చటి కరిగెదు
వైరి నరసింహ సింహాద్రి నారసింహ.

సీ॥ పొట్టేళ్ళగతిబట్టి బోడిసన్యాసుల
ఢీయని తాకులాడించు నొకడు
సోమయాజుల బ్రహ్మసూత్రముల్ త్రెంచి
సింగాణి విండ్లకు నల్లెగట్టు నొకడు
ఖూబ్ ఖోడాయంచు గుడికీలు గుర్రమునెక్కి
ధేయని తరలెత్తునొకడు
పైకాలు గొమ్మని బల్మికోమటివారి
చెలువపై బడి బూతు సేయునొకడు.

సీ॥ గ్రామముల్ నిర్ధూమ ధామమ్ములయ్యెను
సస్యంబులెల్ల నాశనముజెందె
దొడ్లలో శాకముల్ దుంప శుద్ధిగబోయె
దోచిరి సర్వంబు గోచిదక్క.

సీ॥ కనిపించు కోవుగా ఖలులు మార్గస్థుల
కొంకక ముక్కులు గోయునప్పుడు
ఆలకింపవు గదా అయ్యయో ప్రజఘోష . .
ధూర్తులు వడి సూళ్ళుదోచునప్పుడు
జాలిరాదాయగా చటుల తురుష్కులు
భామినులను చెరపట్టినపుడు

ఈవిధంగా ప్రజల బాధలను వర్ణించి ఈకవి ఈ బాధలనుండి కాపాడవలసిందిగా సింహాద్రి నరసింహుని వేడుకుంటున్నాడు.

సీ॥ మా మొఖాసాను గ్రామంబులిమ్మనలేదు.
కొంపలుగాల్పింప కూడదంటి
కరి హయాదుల మేము కాంక్షింపగాలేదు
గోవధ సూన్పించి పోవుమంటి
మాకు మిమ్ములను సామ్రాజ్యమిమ్మనలేదు
జనులనుదోపింప జనదటంటి
స్వామి మా కొరకేమి కామింపగా లేదు
క్షితిలోన ప్రజలరక్షితమంటి

♦ ♦ ♦

వైరి హరరంహ, సింహాద్రి, నారసింహ ఈ విధంగా ప్రజల బాధలను వర్ణించిన వారనేకులున్నారు. వారిలో భద్రగిరి శతకం వ్రాసిన భళ్ళాపేరయ, వెంకటాధ్వరిముఖ్యులు.

స మా జ క ల్లో ల ము

ఒకవైపు మహమ్మదీయ సేనల అఘాయిత్యాలు, మరొక వైపున బ్రిటీషు ఫ్రెంచిసేనల పదఘట్టనలు ఆంధ్రదేశంనలుమూలలా వ్యాపించాయి. సాంఘిక క్షేమం నశించింది. తిండికి, గుడ్డకు కరువు వచ్చింది. 2 వేల సంవత్సరాలనుండి అవిచ్ఛిన్నంగా వస్తున్న స్వయం సంపూర్ణ గ్రామవ్యవస్థ, బ్రిటీషు సరుకుల దిగుమతితో భగ్నం

కొనసాగింది. గృహపరిశ్రమలు, చేతిపరిశ్రమలు మూలపడసాగినవి. యావద్భారతదేశంలోను ఈ పరిణామం ప్రారంభమైంది.

ఈ పరిణామానికి కారణం ప్రజలు తెలుసుకోలేక పోయినారు. ఆర్థిక విచ్ఛిత్తితోపాటు సమాజంలో కులవిభేధాలు మూఢాచారాలు, కట్టుబాట్లు మితిమీరిపోయినవి.

ఈ దశలో దైవభక్తిధోరణి ఒకటి ప్రారంభమైంది. ఉత్తర హిందూస్థానంలో కబీరు అను భక్తుడుద్భవించి కులభేదాలను ఖండించి రామభక్తిని ప్రచారం చేశాడు. భద్రాచల రామదాసు తెలుగుదేశంలో పుట్టి అదేపని చేశాడు. దేశమంతా భక్తి వాతావరణం వెల్లివిరిసింది. ఉత్సవాలు తిరునాళ్ళ రూపంలో దేవునిపేరు తలచుకొని ప్రజలు తిరిగి ఆత్మవిశ్వాసం పొందటానికి ప్రయత్నించారు. నాటి శతక వాఙ్మయంలో ముప్పాతికవంతు భక్తిప్రధానమైనవి. ఈభక్తిలోకూడా ఒక విశేషమున్నది. 11 వ శతాబ్దమునాటి వీరశైవ ఉద్యమంలో పుట్టిన భక్తి వాఙ్మయము ఒక మత ప్రచారముకొరకు, అన్యమతాలనుఖండిస్తూ పుట్టింది. కాని 18వ శతాబ్దంలో ఆంధ్రలో వ్యాపించిన భక్తి అలాంటిదికాదు. ఇది వైష్ణవభక్తి. దాసభావంతో, ప్రతిఫలాపేక్ష లేకుండా, కేవలం ఆత్మసంతృప్తికి దేవుని పూజించటం ఇందులో ప్రధానాంశం. ఇదేకాలంలో మహారాష్ట్రలో సంతతుకారామ్, బెంగాలులో చైతన్యం ఉద్భవించారు. పాతసమాజం శిథిలమై పడిపోతున్నది. క్రొత్త సమాజం ఎలా ఉంటుందో, ఏమో ఎవరికీ తెలియదు. ఈ సంధి యుగంలో, 'భారమంతా నీదేనని ప్రపత్తి ధోరణిలో ఈ భక్తి వాఙ్మయము సాగింది. తెలుగులో దాశరధి మానసబోధ, వేణుగోపాల మొదలైన శతకాలు భక్తి శతకాలలోను ముఖ్యమైనవి.

మరొకవైపున అసభ్య శృంగార సాహిత్యంకూడా ప్రారంభమైది. మధుం, తంజావూరు ఆస్థానాలలో ఉద్భవించిన కావ్యాలతో

పాటు చంద్రరేఖా విలాపము అను కూచిమంచి జగ్గకవి కావ్యము మొదలైనవి ఏర్పడ్డవి.

ఇంతేకాదు. ప్రజలలో విపరీతమైన మూఢ నమ్మకాలు బయలుదేరినవి. వీరభోగ వసంతరాయలు అనే కవిపురుషుడు ఒకడు పుట్టి దేశాన్ని ఉద్ధరిస్తాడని అంతకంటే ప్రజలకు తరణోపాయము లేదని ఒక వాదన బయలుదేరింది. చంద్రగిరి పాలించిన వీర వెంకటపతి రాయలు (1614) ఈ కొత్తపేరుతో పుడతాడని ప్రజలలో కొందరు నమ్మసాగారు.

ప్రజల దీనావస్థనువర్ణించే అనేకకథలు ఈకాలంలో వ్రాయబడ్డాయి. బాలనాగమ్మకథ, చిన్నమ్మకథ, లక్ష్మమ్మకథ ఇందులో ముఖ్యమైనవి. మహమ్మదీయ ఫకీరు, జంగము వేషముతోవచ్చి బాలనాగమ్మ అను స్త్రీని ఎత్తుకుపోయి నానాబాధలు పెడతాడు. చివరకు ఆమె చనిపోతుంది. ఈ కథ ఇంటింట ఇప్పటికీ ప్రచారంలో ఉన్నది.

దీనావస్థను వర్ణించే వాటితోపాటు శౌర్యోత్సాహాలను కలిగించే ఘటనలుకూడాఉన్నవి. సర్వాయి పాపడి చరిత్రప్రసిద్ధమైనది. ఔరంగజేబు పరిపాలన కాలంలో కల్లుగీత వృత్తిద్వారా జీవించెడి సర్వాయి పాపయ్య, తురక సర్దారులను ఎదిరించి ప్రజలకు రక్షణయిచ్చి మహావీరుడని పేరుగాంచాడు.

ఇదేకాలంలో కర్నూలుజిల్లా బంగనపల్లి ప్రాంతంలో పోతులూరి వీరబ్రహ్మం అను ఒక తత్వజ్ఞాని బయలుదేరాడు. కలికాలం వచ్చిందని, లోకం అంతా చెడిపోయిందని, అయితే ఎప్పుడో మంచి రోజులు వస్తాయని ఒక విధమైన కర్మవాదాన్ని (Fatalism) ఈయన ప్రచారం చేశాడు. ఈయన కంసాలి. ఈయన శిష్యులలో ఎక్కువమంది చేనేతవారు. గృహ పరిశ్రమలు విచ్ఛిన్నం గావటంతో మొట్టమొదట ఏకులాలు దెబ్బతిన్నవో ఆకులాలలోనుండి

ఈ నిరాశాపూరిత తాత్విక ప్రచారం బయలుదేరటం గమనార్హం. చారిత్రకంగా సంధియుగమైన ఈ దశలో శతకాలు, గేయాలు, యక్షగానాలు, మొదలైన వివిధరూపాలలో సాహిత్యం వికసించటం ఒక శుభలక్షణం. పాత సమాజము కదలిపోయే ఆ దశలో, పాత సాహిత్య శృంఖలాలన్నీ బద్దలైనవి. ప్రజావాణి వివిధ రూపాలలో వ్యక్తం కాసాగింది.

పంచబంగాళమైన ఈ వాతావరణంలో ఆశారేఖవలె యోగి వేమన ఉద్భవించాడు. వేమన 1750 ప్రాంతంలో జీవించాడు.

# యోగి వేమన

వేమన కవిపేరు ఆంధ్రదేశంలో సుప్రసిద్ధం. వేమనపద్యములు యావదాంధ్ర దేశంలోన్ను ప్రచారంలో ఉన్నాయి. కాని వేమన కాలాన్నిగురించి, ఆయన జీవితవిశేషాలను గురించి, నిన్న మొన్నటి వరకు స్థిరమైన అభిప్రాయాలు లేవు. కొండవీటి రెడ్డిరాజుల కాలంలో వేమన జీవించాడన్న ఒక వాదన చాలాకాలంగా ప్రచారంలోఉంది. శతక కవులచరిత్రను రచించిన శ్రీ వంగూరుసుబ్బారావుగారు ఈ వాదనను ప్రారంభించారు. కాని ఆతర్వాత పరిశోధకు లనేకులు కృషిచేసి పై వాదనను త్రోసివేశారు.

వేమన విషయమై విస్తార పరిశోధన గావించిన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, ఈ కవి 18వ శతాబ్దంలో నివసించాడని సహేతుకంగా నిర్ణయించారు.

18వ శతాబ్దపు ఆంధ్రదేశస్థితి అతివిషాదకరంగా ఉండేది. సుసంఘటితమైన ప్రభుత్వంలేని ఫలితంగా దేశంలో అరాచకం వ్యాపించింది. 2 వేల ఏండ్లుగా అవిచ్ఛినంగా వస్తూన్న గ్రామీణ ఆర్థిక జీవనం విచ్ఛిన్నంకాసాగింది. మతకుల బేధాలతో ఆనాటికే హిందూసంఘంమళ్ళీ పతనావస్థలోఉంది. 13వ శతాబ్దంలో గొప్పకల్లోలాన్ని కలిగించిన వీరశైవమతం నశించింది. కాని జంగాలు, బసివిరాండ్రు, లింగధారులు - మిగిలారు. కృష్ణదేవరాయల

పరిపాలన కాలంలో వైష్ణవమతం ఆంధ్రలో వ్యాపించింది. వేమన కాలంనాటికి ఆ మతంలోకూడా విపరీతమైన మూఢాచారాలు, దుర్వ్యసనాలు వ్యాపించసాగినవి.

ఈ నిరాశావాతావరణంలో భద్రాచలరామదాసు వంటి భక్తులొకమూల, పోతులూరి వీరబ్రహ్మంవంటి కర్మసిద్ధాంతులు మరొకమూల ఉద్భవించారు. ఇదిగాక, నీచలోహాలను బంగారంగా చేయటం సాధ్యమని ఒక విశ్వాసం ప్రబలింది. ఈ విశ్వాసాన్ని అవకాశంగా తీసుకొని, అనేకులు మాయసన్యాసులు, స్వర్ణయోగులు వెలిశారు. చుక్కానిలేని పడవ గాలితాకుడుకు ఊగిపోయినట్లు ఆంధ్రదేశంలో ప్రజాజీవితం సంక్షోభంలో పడ్డది.

వేమన దేశకాలములు:

ఈ పరిస్థితులలో వేమన ఒక సాధారణ కర్షకకుటుంబములో జన్మించాడు. గుంటూరుజిల్లా కొండవీడు తన జన్మస్థలమని, కాపు కులం తన జన్మద్వారా పవిత్రమైందని వేమన స్వయముగా చెప్పుకున్నాడు.

నేడు రెడ్లు అని వ్యవహరించబడే కులమే ఆనాటికాపులు. ఇప్పటికి ఆంధ్రదేశంలో రెడ్లు కొన్నిజిల్లాలలో కాపులు అని వ్యవహరించబడుతూనే ఉన్నారు:

ఆ॥ కలియుగమున నున్న కాపుకులానికి
వేమన తనకీర్తి విక్రయించె.

ఆ॥ కాపుకులజు లెంత కర్ములైననుగాని
పాపరాశికొంత పరిసిపోవు
వివరమెరుగనట్టి వెర్రిజీవులుగాన
........................

అని కర్షక కులగౌరవాన్ని కీర్తించాడు. "వివరమెరుగనట్టి వెర్రిజీవులు" అను ఒక్కవాక్యంలో ఆనాటి రైతాంగంయొక్క

అమాయకత్వాన్ని, వివిధ మత, కుల గురువుల కుతంత్రాలకు ఏవిధంగా వీరు మోసపోయేది స్పష్టంగా సూచించాడు.

వేమన పద్యాలలో వెలిబుచ్చిన వివిధ జీవితానుభవాలను దృష్టిలోనుంచుకొని, ఈ క్రింది జీవితాన్ని వేమన గడిపి ఉంటాడని విమర్శకులు భావిస్తున్నారు.

ఒక మధ్యతరగతి రైతుకుటుంబంలో 1700ప్రాంతంలో వేమన జన్మించాడు. ఏదోకొంత చదువు సంధ్యలు పూర్తిచేసుకొని, ఆనాటి వాతావరణానికి లోబడి; సుఖవిలాసాలలో మునిగి పోయాడు. వేశ్యాలం పటత్వంతో కొంతకాలం గడిపాడు. ఆతర్వాత తల్లిదండ్రులు తనికి వివాహంచేసారు. పాతజీవితపు అవశేషాలను పూర్తిగా వదలనందువల్లనో, లేక మరేకారణంవల్లనో వేమన సంసారజీవితం సుఖంగా జరగలేదు.

ఆ॥ చెప్పులోని రాయి, చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత గాదయా
విశ్వదాభిరామ వినురవేమ.

అని గయ్యాళి భార్యతో సంసారానికి స్వస్తి జెప్పి దేశసంచారం చేయసాగాడు. సంఘంలో తాను చూచిన లోపాలన్నింటినీ, అతి నిశితంగా, ఆటవెలది పద్యాలలో ఎక్కడికక్కడ చెప్పుకుంటూ కొన్ని ఏండ్లపాటు ఆంధ్రదేశమంతటా తిరిగాడు. ప్రధానంగా రాయలసీమ జిల్లాలలో సంచారంచేసాడు. వేమన శిష్యులమని చెప్పుకునే ముత్తాతలు కొందరు యిప్పటికీ ఆ ప్రాంతాలలో ఉన్నారు. సంఘంలోని లోపాలను బట్టబయలు చేయటంతోపాటు, ఆధ్యాత్మిక భావాలను కూడా వేమన తన పద్యాలలో ప్రచారం చేశాడు. మోసం, డాంబికం, లేని నిజమైన జ్ఞానయోగం అలవర్చుకోవాలన్న భావం వేమన పద్యాలలో విరివిగా వుంది. సహజంగానే యీ సంస్కర్త

చుట్టూ శిష్యులు పోగయినారు. గురువుగారికి లేని కొన్ని గొప్పలు కూడా ఆరోపించి ప్రచారం చేసారు.

చిట్టచివరకు అనంతపురం జిల్లా కతారుపల్లి అనే గ్రామంలో 1750 ప్రాంతంలో వేమన మరణించాడు. అక్కడ ఇప్పటికీ వేమన సమాధి అని ఒకటుంది. కతారుపల్లిలోని సమాధి కొండవీటి వేమనది కాదని, అదే పేరుగల మరొకరిదని, వేమన కడపజిల్లా పామూరు అనుగ్రామంవద్ద ఒకగుహలోకి ప్రవేశించి సిద్ధిపొందాడని రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు అభిప్రాయపడుతున్నారు. వీనిలో ఏదినిజమో, ఏది కాదో తేల్చగల సమాచారం ఇప్పటికి మనకు లేదు. ఏమైనా వేమనయోగి పేరు ఆంధ్రదేశంలో చిరస్థాయిగా నిలచింది.

## సంఘ సంస్కరణ ధోరణి :

ఆనాడు శైవమతం అత్యంత హేయంగా తయారైంది. శైవులు కొందరు తమ ఆడపిల్లలను, బసివిరాండ్రను పేరుతో పెళ్ళి చేయక 'ఊరి' వేశ్యలనుగా వదలివేసేవారు. గ్రామాలలోను, పట్టణాలలోను, మతము పేరిట, వ్యభిచారము, త్రాగుడు, మోసము, విపరీతంగా వుండేవి. వేమన మొట్టమొదటగా వీరిని ఇలా నిందిస్తున్నాడు :

ఆ। ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల
భాండ శుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా
... ... ...

ఆ। అన్నిమతములందు అధికమైన మతంబు
లింగమతముకన్న లేదు భువిని
లింగధార్లకన్న దొంగలు లేరయా
... ... ...

ఆ॥ అక్షమాల బూని అలసట జెందక
కుక్షి నింపుకొనుట కొదువగాదు
పక్షికొంగ రీతి పై చూపులేలకో
... ... ...

తిండికోసం కక్కుర్తి పడి దొంగజపం చేస్తే చేశావు కాని కొంగలా పైకి చూస్తావెందుకని, వేమన బూటకపు యోగులను తీవ్రంగా ఆక్షేపిస్తున్నాడు.

ఈదుర్గుణాలన్నీ వైష్ణవమతంలో కూడా వ్యాపించాయి. కృష్ణ రాయల కాలంలో తాతాచార్యులనే ఆయన మూకుమ్మడిగా ప్రజలను వైష్ణవమతంలోకి మార్చేవాడు. పారిపోతున్నవారిని సైతం బలవంతంగా వారి వీపున చక్రాంకితాలను వేసి, వైష్ణవులనుగా మార్చాడు. తాతాచార్యులవారి ముద్ర భుజం తప్పినా వీపు తప్ప దన్న సామెత ఏర్పడ్డది. శైవులు బసివిరాండ్రను వేశ్యలను వదలి నట్లే, వీరు కూడా వైష్ణవదాసీలనే పేరుతోను', 'నామ ధారులను పేరుతోనూ' 'వేశ్యలను' తయారుచేసేవారు. సాతానులు, రామానుజ కూటములను ఏర్పరచి, త్రాగి తందనాలాడేవారు. వీరిని వేమన ఇలా ఖండిస్తున్నాడు:

ఆ॥ ఎంబెరు మతమందు నెసగ మాంస
ము దిని మారుపేరుపెట్టి మధువు ద్రావి
వావి నరుస దప్పి వలికిపాటాడును.

ఆ॥ రంగధామములను హంగుగా తానేగి
కల్లుకంపు సొంపు గల్గియుండు

ఆ॥ వైష్ణవులవియెడుచాత్త్ర మాత్రమేగాని
ప్రజల చెరుతురయ్య భ్రష్టులుగన్
... ... ... ...

మహమ్మదీయుల దండయాత్ర ఫలితంగా వచ్చిన ప్రమాదాన్ని వేమన వివరించాడు. అయితే ఈ దారి దోపిడీగాండ్రు ప్రజలనుపెట్టే బాధలను వేమన వర్ణించ లేదు. కులమత విభేధాలతో భిన్నాభిన్నమైన హిందూసంఘానికి వచ్చిన ప్రమాదాన్ని ఎత్తిచూపి ప్రజలను హెచ్చరించుట వేమన లక్ష్యం. కనుక ఇలా అంటున్నాడు.

ఆ॥ లింగమతములోన దొంగలుగా బుట్టి
యొకరినొకరు నింద నొనర జేసి
తురక జాతిచేత ధూళియై పోదురు
... ... ... ... ...

అని తీవ్రమైన హెచ్చరిక చేస్తున్నాడు.

ఆ॥ రాళ్ళునమ్మియున్న రాజాధిరాజులు
ఘూటికెడరి భువిని ధూళి చనిరి
రాళ్ళపగులగొట్టి రాకుసపుత్రులు
మాళ్లుమాళ్ళు గలిగి మనిరి వేమ.

హిందూ సంఘంలోని వివిధ కులాలలోని లోపాలను ముఖ్యంగా అగ్రవర్ణాలవారి డాంబికాన్ని అతివిశితంగా వేమన విమర్శించాడు.

ఆ॥ విప్రులెల్ల జేరి వెర్రికూతలు కూసి
సతిపతులనుగూర్చి సమ్మతమున
మునుముహూర్త ముంచ ముండెట్లు మోసెరా

ఆ॥ లంజకొడుకు మేక నంజుడు తినసాగి
యజ్ఞమెల్ల కామ యజ్ఞమాయె
మొదట సోమయాజి తుద కామయాజిరా
... ... ... ...

ఆ॥ బ్రాహ్మణులకు సకల భాగ్యంబు లీవచ్చు
గౌరవింపవచ్చు కోరివారు
జ్ఞానమొసగి జనుల కడ తేర్పగలిగిన
... ... ... ...

రాజులను గురించి

ఆ॥ ఎంతసేవ జేసి ఏపాటుబడినను
రాచమూక నమ్మరాదురన్న
పాముతోడి పొందు పదివేలకైనను

రామాయణ భారతగాథలలో దేవతలకు ఆరోపించే అమానుష విషయాలను పరిహసిస్తూ ఇలా అన్నాడు.

ఆ॥ కనకమృగము భువిని కద్దు లేదనకుండ
తరుణి విడచిపోయె దాశరథియు
తెలివిలేనివాడు దేవుడెట్లాయరా

ఆ॥ అగ్నిబాణముచేత అంబుధింకినపుడె
రాముడవలికేగ లావుమరచి
వరుస కొండలుమోసి వారధేలగకట్టె

ఆ॥ రాతిబొమ్మకేల రంగైన వలువలు
గుళ్లుగోపురములు కుంభములును
కూడుగుడ్డ దాను గోరునా దేవుండు
... ... ... ... ... ... ...

కులబేధాలను సమూలంగా నాశనంచేయాలని వేమన ఆశయం.

ఆ॥ ఉర్వివారికెల్ల నొక్క కంచముపెట్టి
పొత్తుగుడిచి కులము పొలియజేసి
తలను జేయిపెట్టి తగనమ్మ జెప్పరా
విశ్వదాభిరామ వినర వేమ॥

తాత్విక ధోరణి:

వేమన కాలంలో ఆంధ్రదేశములో తాత్విక ధోరణులు పొడ సూపసాగినవి. యోగశాస్త్రంపట్ల ప్రజలకు వెర్రిఏర్పడ్డది. దేశ మంతా హఠయోగులు వెలిశారు. ప్రాణాయామాది ఆసనాలను ఆచరించి, శరీరాన్ని శుష్కింపజేస్తే, జ్ఞాననేత్రం వికసిస్తుందట. ఇప్పుడుకూడా గాజుముక్కలను నమలేవారు, భూమిలోపల కొన్ని గంటలుండి, చావకుండా బ్రతికేవారూ అయిన హఠయోగులను మనము అక్కడక్కడ చూస్తున్నాము. శరీరములోని అతికీలకమైన నరములు మొదలైనవానిని అదుపులోపెట్టి కొన్నివిచిత్ర క్రియలను చేయు సాధన ఈ హఠయోగం. వేమన కొంతకాలం ఈ హఠ యోగాన్ని ఆశ్రయించాడు. కాని సంతృప్తి కలగలేదు. వేమనను ప్రధానంగా వేధించే సమస్య సాంఘికసమస్య. సమాజంలోని మోసం, అన్యాయం, డాంభికం మొదలైనవానిని తొలగించుట వేమన లక్ష్యము. హఠయోగము కేవలము వ్యక్తిగతమైన నియమ నిష్టలకు సంబంధించినది.

ఆరోజులలో మంత్ర తంత్రములందు, స్వర్ణ వాదమందు ప్రజ లకు చాల విశ్వాసముండేది. వేమన మంత్ర తంత్రములను అనేక చోట్ల నిరసించాడు. కాని బంగారము చేయవచ్చుననే భ్రమ మాత్రము వేమనకు చివరవరకు వున్నట్లుంది. వేమనపేర ప్రచా రంలో వున్న అనేక పద్యాలలో ఈ భావము కనబడుతుంది. హఠ యోగాన్ని నిరసిస్తూ వేమన ఇలా అన్నాడు.

ఆ॥ ఆసనములు పన్ని అంగంబు బిగియించి
ఒడలు విరుచుకొనెడు యోగమెల్ల
జెట్టిసాముకన్న చింతాకు తక్కువ

అని దొమ్మరివాళ్ళ సాముగారడీలతో హఠయోగాన్ని పోల్చాడు. కాని రసవాదాన్నిగురించి వేమనఏమిచెప్పాడో చూడండి.

ఆ॥ ఇహమున సుఖియింప హేమతారకవిద్య
పదమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమవిద్యలెల్ల కల్ల విద్యలుగావె
... ... ...

ఆ॥ ఉప్పు చింతపండు ఊరిలోనుండగ
కరువవేలవచ్చె కాపులార
తాళకంబెరుగరో తగరంబు నెరుగరో

ఉప్పు, చింతపండు తగరపు రేకులో చుట్టి పుటముపెట్టి మరి కొన్ని లోహములతో చేర్చిన బంగార మగునని వేమన నమ్మకం.

మానవ సుఖజీవితానికి ధనం, సంపద అత్యవసరమనే ఒక నగ్న వాస్తవికత, బహుశా ఈ వికృతరూపంలో వేమనలో ప్రతిబింబించి ఉండవచ్చు. స్వర్ణయోగం అంటే నాటి ప్రజలకు విపరీతమైన నమ్మకం కలగడానికి కూడా ఇదే కారణమై యుండవచ్చు.

ఏమైనా సమకాలిక తాత్వికులలో ఈమాత్రం అభ్యుదయ సంస్కార భావాలను కనబరచుటకూడా గొప్పవిషయమే ననటంలో ఎట్టి సందేహమూ లేదు.

వేమన చిట్టచివరకు ఆశ్రయించిన రాజయోగం కూడా నాటి తాత్విక దృక్పథాలలో కల్లా ఉన్నతమైనది.

జీవితాన్ని పూర్తిగా సన్యసించాలనిగాని, లేక అంతూ పొంతూలేని కర్మకాండలో మునిగిపోవాలని కాని రాజయోగం చెప్పదు. మామూలుసాంసారిక జీవితం గడుపుతూనే నీతినియమాలతో గౌరవమైన సుఖప్రదమైన జీవితం గడపుటద్వారా మోక్షం సాధించవచ్చునని, రాజయోగం భావిస్తుంది. వివిధ తాత్విక విపరీత ధోరణులను సమన్వయంచేసి, జ్ఞాన ప్రధానమైన జీవితాన్ని గడపమని రాజయోగం బోధిస్తుంది. అద్వైతజ్ఞానానికిది మారుపేరు. అయితే ఈ సిద్ధాంతంలో కూడా అనేకలోపాలు లేకపోలేదు. కాని జీవిత

సమస్యల పరిష్కారానికి వివిధమార్గాల నన్వేషించి చివరకు గౌతమ బుద్ధుడు, నిర్వాణమార్గాన్ని చేపట్టినట్లు, సామాన్య సంసారి అయిన వేమన సంసారంలోపడి, ఈది, అది దాటి హఠయోగాన్ని చేపట్టి దానిని కూడా నిరసించి - చిట్టచివరకు అద్వైత తాత్విక వాదాన్ని చేరుకున్నాడు :

## ప్రజాకవి వేమన:

వేమన తన సంస్కరణ కార్యక్రమానికి కవిత్వాన్ని ఒక సాధనగా చేపట్టాడు. వేమన పద్యాలవంటి అచ్చ తెలుగు పద్యాలు ఇంతవరకు తెలుగుభాషలో లేవంటే అత్యుక్తి కాదు. తెలుగుభాష జాతీయత సొంపుయాపత్తు వేమనకు స్వాధీనము. ఈ కవిత్వాన్ని ఉపయోగించుకొని లోకోక్తులు, నీతులు, కుప్పతెప్పలుగా వేమన కురిపించాడు. తెలుగుభాషలో అంతకు పూర్వములేని హాస్యరసాన్ని వేమన ప్రవేశపెట్టాడు.

ఆ॥ గుహాలలోన జొచ్చి గురువుల వెదకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తి మార్గమదియె ముందుగా జూపురా.

ఆ॥ పాలసాగరమున పవ్వళించినవాడు
గొల్లయిండ్ల పాలు కోరనేల
ఎదుటివారి సొమ్ము లెల్లవారికి తీపి

నీతిపద్యాలకు లెక్కలేదు. అయినను కొన్ని ఉదహారణలు.

ఆ॥ కోతిబట్టి తెచ్చి కొత్తపట్టముగట్టి
కొండముచ్చులెల్ల కొలిచినట్లు
నీతిహీనువద్ద నిర్భాగ్యులుందురు.

ఆ॥ చాకి మడతలుతికి చికాకువడ జేసి
మైలదీసి లెస్సమడిచినట్లు
బుద్ధిజెప్పువాడు గుద్దితేనేమయా.

ఆ॥ కులముగలుగువారు, గోత్రంబుకలవారు
విద్యచేత విర్రవీగువారు
పసిడిగల్గువాని బానిసకొడుకులు.

ఆ॥ పసులవన్నె వేరు పాలేకవర్ణమో
పుష్పజాతి వేరు పూజయొకటి
దర్శనములు వేరు దైవంబదొక్కటి.

ఆ. లోభివాని జంపలోకంబులోపల
మందువలదు వేసుమతముగలరు
పైకమడిగినంత భగ్గునపడుజచ్చు.

సమాజంలోని హెచ్చుతగ్గులను హాస్యధోరణిలో ఎలా విమర్శిస్తున్నాడో చూడండి.

ఆ॥ ఉదధిలోని నీళ్ళు ఉప్పులుగాజేసె
పసిడికల్గు వాని పిసినిజేసె
బ్రహ్మదేవుచేత పాడైన చేతరా.

వేమనకవిత్వ మెంతగంభీరమైనదో ప్రశస్తమైనదో తెలుగు వారికి వేరే చెప్ప వలసిన అగత్యంలేదు.

వేమన పద్యాలపేరుతో నేడు వేలకొలదిపద్యాలు ప్రచారంలో ఉన్నాయి. వీనిలోసగానికిపైగా ఇతరులుచేర్చినవే. ముఖ్యంగా తాత్విక సంబంధమైన వానిలో ముప్పాతిక మూడువంతులు వేమన శిష్యులు చేర్చారు. ఈ వేల పద్యాలను పరిశీలించి, ఇతరులవి తొలగించి వేమనవి మాత్రమే ప్రచురించినప్పుడే, ఈ మహాకవి జీవితం విషయమై సంపూర్ణ పరిజ్ఞానం మనకు లభిస్తుంది. విశ్వవిద్యాలయాధికారులు ఈ పనికి పూనుకోవాలి.

జీవితానుభవాలను విజ్ఞానదృష్టితో చూసిన వేమనలో సునిశితమైన హాస్యరసం ఉద్భవించింది. వెగటుకల్గించని హాస్యరసంతో విజ్ఞానబోధచేయటం మహాకవులకు మాత్రం సాధ్యం.

అట్టి మహాకవులస్థాయిని వేమన అందుకున్నాడు. తనకవిత్వాన్ని గూర్చి వేమన ఇలాఅన్నాడు.

అ॥ బ్రహ్మవ్రాతకెదురు పల్కినవాడును
ఆదివిష్ణుసూత్ర మడచువాడు
మూడుకనుల వాని మొనసిచిల్చినవాడు
కానబడరు నీవుకాని వేమ

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు చేసిన ఈ సృష్టిలోని లోపాలను ఎత్తిచూపి నూతనసమాజ నిర్మాణాన్ని స్ఫురింపజేసిన వేమన ప్రజాకవి. అంతేకాదు మహాకవి. ఆధునికాంధ్ర సమాజనిర్మాణానికి, అభ్యుదయ కవిత్వానికి, 200 సంవత్సరముల క్రితమే ఒక పునాది రాయిని వేసినవాడు వేమనయోగి.

# బ్రిటిషు పరిపాలనయుగం

క్రీ. శ. 1638 లో మద్రాసులో ఈస్టుఇండియాకంపెనీ వ్యాపారస్తులు కోటకట్టుకోవటంతో దక్షిణదేశంలో వారికి స్థావరం చిక్కింది. అంతకుపూర్వమే, పోర్చుగీస్, డచ్చి, ఫ్రెంచివ్యాపారస్థులు భారతదేశంలో దిగారు. యూరపులో పెట్టుబడిదారీ విధానవస్తూత్పత్తి అప్పటికే ప్రారంభమైంది. ఈఉత్పత్తివిధానంలో బ్రిటను మిగతా వారికంటె అగ్రస్థానంలోవుంది. యంత్రసహాయంతో చౌకగా పెద్ద ఎత్తున సరుకులను ఉత్పత్తిచేసి భారతదేశంలో అమ్ముకోవటంతో పాశ్చాత్య దేశాల సామ్రాజ్యవాదానికి పునాది ఏర్పడ్డది.

1707 లో ఔరంగజేబు మరణించటంతో మొగలుసామ్రాజ్య పతనం ప్రారంభమైంది. ఔరంగజేబుకు సుబేదార్‌గా ఉంటూన్న నిజాముల్ ముల్కు స్వతంత్రం ప్రకటించుకున్నాడు. ఆంధ్రదేశమంతా నైజాంపరిపాలనలోనే ఉంది. అంతేకాదు. దక్కను అంతటికీ సుబే దారుగా నియమించబడిన ఫలితంగా, మైసూరురాజ్యం, ఆర్కాటు రాజ్యంకూడా పేరుకు నైజాంపెత్తనం క్రిందనే ఉండేవి. పూనాలోని మహారాష్ట్రపీష్వాలు, మైసూరు పరిపాలకులైన హైదరాలీ టిప్పులు, నైజాము ఈ మూడు దక్కనులోని నాటిప్రధానరాజ్యములు.

బ్రిటీషువారు క్రమంగా చొచ్చుకుపోవటం ప్రారంభించారు. గ్రామపరిశ్రమలు ధ్వంసం కాసాగినవి. బ్రిటీషు వ్యాపారస్థులు

తమసరకులను అమ్ముకోవటంతో ప్రారంభించి, కోటలు కట్టుకో సాగారు. ఆకోటల రక్షణకు సైన్యాలను పెట్టుకున్నారు. రాజ్యాస్థానాలలో, మొదట మంచితనంగా స్థానంసంపాదించి, క్రమంగా రాజ్యాలపై పెత్తనం సంపాదించుకున్నారు. ప్రజలు ఈ నూతన పరిపాలకుల చేతులలో నానాకడగండ్లు పడసాగారు. దేశీయరాజులలో కొందరు బ్రిటిషువారిని ఓడించవలెనని ప్రయత్నించిన వారున్నారు. వారిలో టిప్పుసుల్తాన్ ముఖ్యుడు. 1787 లో ఫ్రెంచి మహావిప్లవం జరిగింది. నెపోలియను యూరపునంతా జయించి బ్రిటనుపైసైతం దండయాత్రసన్నాహాలు చేస్తున్నాడు. నెపోలియనుతో టిప్పుసుల్తాన్ ఉత్తరప్రత్యుత్తరాలు నడిపాడు. ఈ రహస్యం బైటపడి, ఇంగ్లీషువారు టిప్పుసుల్తానుపై యుద్ధం ప్రకటించి 1799 లో శ్రీరంగపట్నాన్ని ఆక్రమించి, మైసూరురాజ్యాన్ని ధ్వంసం చేసారు. వీరోచితంగా పోరాడుతూ టిప్పుసుల్తాన్ అస్తమించాడు. బ్రిటీషువారు ఒడయరు వంశస్థుల్ని ఒకరిని మైసూరు సింహాసనంపై కూర్చోబెట్టారు. ఆ వంశమే ఇప్పటికీ మైసూర్‌ను పరిపాలిస్తున్నది.

మహారాష్ట్ర పీష్వాలకు బ్రిటీషువారికి కూడా ఇదేవిధంగా అనేకయుద్ధాలు జరిగాయి. పూనా, గ్వాలియరు, ఇండోర్, బరోడా రాజ్యాలన్నీ మహారాష్ట్రరాజ్యాలు. వారిలో వారు కలహించుకుంటూ బ్రిటిషు సైన్యాల సహాయాన్ని కోరుతూ ఉండేవారు. ఐనప్పటికి ఈ రాజ్యాలన్నీ తీవ్రయుద్ధాల తర్వాతగాని బ్రిటిషువారికి వశముకాలేదు. 1803 లో వెలస్లీ గవర్నరు జనరలుగా ఉన్నపుడు మహారాష్ట్రులతో యుద్ధాలుచేసి వీటిని జయించాడు.

నైజాము విద్రోహవైఖరి :

దక్షిణ హిందూదేశములోని రెండు ప్రధానరాజ్యాలైన మైసూరు, మహారాష్ట్రరాజ్యాలు, సామ్రాజ్యవాదులతో పోరాడి, ప్రాణాలర్పించి ఆ తర్వాతగాని లొంగిపోలేదు. తమస్వాతంత్ర్యాన్ని

కాపాడుకోవలెననే పట్టుదలలో టిప్పుసుల్తాన్, వంశమర్యాదను కాపాడుకోవలెననే ఆత్మాభిమానంతో మహారాష్ట్రులు బ్రిటిషు వారితో పోరాడారు. అసఫ్‌జాహి వంశానికి ఈ రెండూలేవు. ఔరంగజేబు దయవల్ల సంపాదించిన రాజ్యాన్ని ఏదోవిధంగా కాపాడుకోవటమే ఈ వంశస్థులకు ప్రధాన లక్ష్యమైంది.

1748 లో నిజాముల్ ముల్కు అసఫ్ జా మరణించాడు. అప్పటికి ఫ్రెంచివారు ఆంధ్రదేశంలో ఇంకా చాల ప్రబలంగానే ఉన్నారు. బందరులో వారి కోట ఉంది. ఫ్రెంచి సేనాని డూప్లె నైజాము వ్యవహారాలలో జోక్యం కలిగించుకుని, నిజాముల్ ముల్కు మనుమడైన ముజఫరుజంగును హైదరాబాదు గద్దెపై ఎక్కించాడు. అతని తర్వాత సలాబత్ జంగు అను రాజు వచ్చాడు. వీరిద్దరు ఫ్రెంచివారిదయచే తాము రాజ్యం సంపాదించిన కారణంగా కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి విశాఖజిల్లాలను నాల్గింటిని ఫ్రెంచివారి కిచ్చివేసారు. ఈ ప్రాంతానికికంతా ఫ్రెంచివారు అధిపతులైనారు. ఫ్రెంచిసేనాని బుస్సీ మహాక్రూరుడు. ఆంధ్రదేశమంతటా పన్నులు వసూలుపేరుతో ఇతడు అనేక అకృత్యాలు చేశాడు. 1757లో విజయనగర రాజైన విజయరామరాజు ప్రేరణపై బొబ్బిలిపైకి బుస్సీ దండయాత్ర చేశాడు. తాము రెండురెట్లు కప్పం చెల్లిస్తామన్నప్పటికి వినక పూర్తిగా తనకు పాదాక్రాంతులు కావాలని బుస్సీ ఆజ్ఞాపించాడు. అభిమానధనులైన బొబ్బిలి వెలమ దొరలు ఇందుకు అంగీకరించక ఘోరంగా పోరాడి మరణించారు. తాండ్ర పాపారాయుడు, వెంగలరాయుడు మొదలైన బొబ్బిలి వీరులగాథలు నేటికీ తెలుగుదేశంలో నిలిచిఉన్నాయి. బుస్సీతో పాటు హైదర్‌జంగ్ అను నైజాం సేనానికూడా ఈ యుద్ధంలో పాల్గొని బొబ్బిలిని నాశనంచేశాడు. విజయరామరాజు, నైజాముల ద్రోహము ఈ విషాదగాథకు కారణం.

ఫ్రెంచివారికి, బ్రిటిషువారికి 1756లో యూరపులో యుద్ధాలు ప్రారంభమైనాయి. ఇండియాలో ఫ్రెంచివారి బలం క్షీణింపసాగింది. అప్పటికే క్లైవు కలకత్తాలో బలం చేకూర్చుకున్నాడు. నాటి విజయ నగరరాజైన ఆనందగజపతి సహాయంతో క్లైవు ఆంధ్రదేశంపైకి దండెత్తాడు. 1759లో రాజమహేంద్రవరంవద్ద జరిగిన యుద్ధంలో ఫ్రెంచివారు పూర్తిగా ఓడిపోయారు. దాంతో ఆంధ్రదేశంలో ఫ్రెంచివారి ప్రాబల్యం పూర్తిగా అడుగంటింది.

అప్పటివరకు ఫ్రెంచివారికి అణకువగా ఉన్న నైజాం సలాబతు జంగు, రంగుమార్చిఇంగ్లీషువారితో సంధిచేసుకున్నాడు. ఫ్రెంచివారు అనుభవిస్తున్న నాలుగు జిల్లాలు బ్రిటిష్‌వారు తీసుకున్నారు. అంతటితో ఊరుకోక 1761లో తమకు మరింత ఇష్టుడైన నిజామలీ ఖాన్‌ను హైదరాబాదు సింహాసనంపై కూర్చోబెట్టి గుంటూరు జిల్లాకూడా బ్రిటిషువారు స్వాధీనపరచుకున్నారు.

తెలంగాణా సర్కారుల విభజన

1799లో వెలస్లీ గవర్నరు జనరలుగా వచ్చాడు. మహా రాష్ట్రులదాడినుండి నైజామును కాపాడటమనే సాకుతో కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపూరుజిల్లాలను స్వాధీనం చేసుకున్నాడు. 1800 సంవత్సరంనాటికి తెలంగాణామాత్రం నైజాంక్రింద ఉంది. మిగతా ఆంధ్రదేశమంతా బ్రిటిషువారి వశమైంది. కొంత ప్రాంతం మైసూరులో ఉండిపోయింది.

నైజాం లొంగుబాటు ఇంతటితో ఆగలేదు. హేస్టింగ్సు గవర్నరు జనరలుగా ఉన్నప్పుడు హైదరాబాదులో పామరు కంపెనీ అని ఒక ఇంగ్లీషు వ్యాపారసంస్థ ఏర్పడ్డది. ఈ సంస్థ మేనే జర్ పామరు హేస్టింగ్సు అల్లుడు. ఈ కంపెనీ 20 వేల పౌనులను సాలుకు నూటికి 25 వంతుల వడ్డీ చొప్పున నైజామునకు అప్పుఇచ్చి, అందుకు ప్రతిఫలంగా 3 లక్షల పౌనుల ఆదాయంవచ్చే రెవిన్యూను

స్వాధీనం చేసుకున్నది. ఈ బాకీలు అన్నీ కల్పితమని తరువాత ఈస్టు ఇండియా కంపెనీవారి విచారణలో తేలినవి. ప్రజలసొమ్మును, స్వాతంత్ర్యాన్ని విదేశీయులకు ధారాదత్తం చేయటంలో నైజాము ఎంతదూరం వెళ్ళాడో ఈ ఘటన తెలియజేస్తుంది.

నైజాం అవలంబించిన ఈ విద్రోహ విధానం, ఫలితంగానే ఆంధ్రదేశమంతా బ్రిటిషు పెత్తనంలోకి ఎట్టి ప్రతిఘటనా లేకుండా వెళ్ళిపోయింది. ఐనప్పటికీ అక్కడక్కడా చిన్నచిన్న ప్రతిఘటనలు లేకపోలేదు.

1806 లో మచిలీపట్నంలో భారతీయ సిపాయీలు ధరించే తలపాగాలను తీసివేసి, టోపీలు పెట్టుకోమని ప్రభుత్వం ఆజ్ఞాపించింది. అందుకు వ్యతిరేకంగా సిపాయీలు నాలుగురోజులు తిరుగుబాటు చేశారు. 6 గురు సిపాయీలను కాల్చివేసి, ప్రభుత్వం ఆ తిరుగుబాటును అణచివేసింది. ఆతర్వాత కొంతకాలానికి గద్వాల వనపర్తి సంస్థానాధీశులు నైజాం విద్రోహ విధానానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. అదికూడా విఫలమైంది.

1857 ప్రప్రథమ స్వాతంత్ర్య పోరాటం జరిగింది. ఝాన్సీ లక్ష్మీబాయి, నానాసాహెబ్, తంతియాతోపే మొదలైన మహారాష్ట్రనాయకులు ఇందులో ప్రముఖపాత్ర వహించారు. కాన్పూరు, మీరట్, ఆగ్రా, ఢిల్లీ నగరాలు విప్లవ కేంద్రాలైనవి. బ్రిటిషు దురాక్రమణ విధాన దుష్ఫలితాలను చవిచూచిన ప్రజలు, ఈ పోరాటానికి అన్నివిధాలా సహాయంచేశారు. సైనికులు ప్రధాన పాత్ర వహించారు. సంస్థానాధీశులు నాయకత్వం వహించారు.

ఈ తిరుగుబాటులో నైజాం బ్రిటిషువారికి నమ్మినబంటుగా పనిచేశాడు. తిరుగుబాటును అణచివేసేందుకు తెలుగు పటాలాలను సైతం పంపి ప్రథమ స్వాతంత్ర్య పోరాటానికి ద్రోహంచేశాడు.

నైజాం పరిపాలనవల్ల వచ్చిన యీ రాజకీయ దుష్ఫలితాలు మాత్రమే గాక, ఆర్థికంగా కూడా తీవ్ర పరిణామాలు కలిగాయి. గోల్కొండ నవాబుల కాలంలో, ఆంధ్రదేశంలోను తెలంగాణాలోను ఒకే రకమైన స్వయం సంపూర్ణ గ్రామ విధానం ఉండేది. కాని నైజాం పరిపాలనతో ఇది మారింది.

నైజాం పరిపాలనకు మొదటినుండీ తెలంగాణా కేంద్రం. అక్కడ పన్నులు వసూలుచేసేందుకు దేశముఖులను, జాగీర్దార్లను నియమించి వారివారి ప్రాంతాలలో వారికి సర్వాధికారాలు ఇచ్చివేశాడు. ప్రజాక్షేమంతో నిమిత్తం లేకుండా కేవలం తన శిస్తు వసూలు చేసుకోవడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకుని నైజాం ఈ పద్ధతి ప్రవేశపెట్టాడు. గోల్కొండ నవాబుల కాలంలో ఇది లేదు. మొగలు పరిపాలనలో ఇది ప్రారంభమైంది. దానిని నైజాం స్వార్థానికి పూర్తిగా వినియోగించుకున్నాడు. ఇందువల్లనే భారత దేశంలో యెక్కడా లేని భూస్వామ్య దోపిడీ విధానము, వెట్టిచాకిరి అక్కడ నిన్న మొన్నటివరకు మిగిలి వున్నవి.

మిగతా ఆంధ్రదేశంలో బ్రిటిషువారు జమీందార్లను సృష్టించి నప్పటికి, యెక్కువభాగంలో రైత్వారీ విధానాన్ని ప్రవేశపెట్టారు. ఈ రైత్వారీవిధానాన్ని 1799లో ప్రవేశపెట్టినవాడు సర్ థామస్‌మన్రో. ఈ విధంగా రాజకీయంగానే కాక, ఆర్థికంగాకూడా తెలంగాణాకు మిగతా ఆంధ్రదేశానికిమధ్య తీవ్రమైన వ్యత్యాసము ఏర్పడి స్థిరపడ్డది.

సాంఘిక సాంస్కృతిక జీవనం :

రాజకీయ పరాధీనత, ఆర్థిక సంక్షోభము ముంచెత్తిన ఈ కాలంలో సాంస్కృతికరంగాలలో సర్వతోముఖ క్షీణత ప్రారంభమైంది. ఈ క్షీణతనుండి తిరిగి బయటపడటానికి అనేక ప్రయత్నాలు జరిగాయి.

సిపాయీల తిరుగుబాటుకు పూర్వమే గాజుల లక్ష్మీనరుసు అను తెలుగు విద్యాధికుడు మద్రాసులో కంపెనీలో ఉద్యోగిగా

ఉండి, మహజర్ల ద్వారా, భారతీయుల పరిస్థితిని బాగుచేయ ప్రయత్నించాడు. బెంగాలులో రాజా రామమోహనరాయలు చేసిన రాజకీయకార్యక్రమాన్ని తెలుగుదేశంలో గాజుల లక్ష్మీనరుసుగారు, సాంఘిక రంగంలో కందుకూరి వీరేశలింగంగారు కొనసాగించారు.

జాతీయ పునరుజ్జీవనం, ముందుగా సాహిత్యరంగంలో ప్రారంభమైంది. 1812 లో మచిలీపట్నం కలెక్టరుగా ఉన్న చార్లెస్ బ్రౌన్‌దొర మొట్టమొదటిసారిగా తెలుగుభాష పునరుద్ధరణను పూనుకున్నాడు. దేశీయులతో సాన్నిహిత్యం పెంపొందించుకోవాలంటే దేశభాషను అభ్యసించవలెననే ఉద్దేశంతో యీ ప్రయత్నం ఆయన చేసాడు. అనేకమంది తెలుగు పండితులను చేరదీసి తాళపత్ర గ్రంథాలనుకాపాడి శుద్ధప్రతులను వ్రాయించాడు. తెలుగుభాషకు మొట్టమొదటి నిఘంటువును వ్రాసినవాడు, వేమన పద్యాలను ప్రోగుచేసి ప్రచురించినవాడు ఈయనే.

1816_1821 సంవత్సరాల మధ్య ప్రభుత్వ సర్వే అధికారిగా వున్న మెకంజిదొర, దేశచరిత్ర రచన కవసరమైన కైఫీయతులను తాళపత్ర గ్రంథాలను అశేషంగా ప్రోగుచేయించాడు. తెలుగుజాతి పునరుజ్జీవనకు వీరిద్దరు సహాయకారులైనారని అంగీకరించక తప్పదు.

1855 లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా ఉన్న చిన్నయ సూరిగారి బాలవ్యాకరణంతో గ్రాంధిక భాష ప్రారంభమైంది. ఈ వ్యాకరణంలో విధించిన సూత్రాలు తర్వాత భాషాభివృద్ధికి ఆటంకంగా పరిణమించినా, ఆనాటికి తెలుగు భాష కొక స్వరూపమివ్వటానికి ఉపయోగపడిన మాట వాస్తవం.

1848 నుండి 1919 వరకు వీరేశలింగయుగం అని చెప్పవచ్చు. ఆంధ్రజాతి సాంఘిక, సాహిత్య రంగాలలో పునరుజ్జీవనం పొందటానికి తోడ్పడిన యీ మహనీయుని యుగపురుషునిగా తెలుగు ప్రజలు భావించటంలో ఆశ్చర్యంలేదు.

195

# ముగింపు

1875లో భారతజాతీయ కాంగ్రెసు ఏర్పడ్డది. ఆంధ్రలో సైతం ఆ ఉద్యమం క్రమంగా వ్యాపించింది. ఆ తర్వాత చరిత్రంతా ఆధునిక ఆంధ్రోద్యమచరిత్రలో భాగం.

2 వేల సంవత్సరాలకుపైగా గల ఆంధ్రులచరిత్రను సంగ్రహరూపంలో తెలుసుకున్నాము. ఈ సుదీర్ఘచరిత్రలో కొన్ని సువర్ణ ఘట్టాలున్నాయి. కొన్ని శిథిలావస్థలున్నాయి.

అత్యంత ప్రాచీనమైన శాతవాహనయుగ విశేషాలు ఇప్పటికీ పూర్తిగా బైటపడలేదు. అనేక శిథిలావశేషాలు ఇప్పుడిప్పుడే బైటపడుతున్నవి. శాతవాహనరాజుల కాలంలో అత్యున్నతమైన నాగరికత స్థాయిని ఆంధ్రదేశం అందుకున్నదని నేటికి దొరికిన ఆధారాలవల్లనే తెలుసుకోవచ్చు.

ఆ తర్వాత అనేక నిమ్నోన్నతాలు చరిత్రలో వచ్చాయి; అంతఃకలహాల ఫలితంగా ఒకరి పాలనలో నిర్మించిన కట్టడాలు, సాధించిన సంస్కృతి, రచించిన గ్రంథాలు మరొకరికాలంలో నాశన మౌతూ వచ్చాయి. తిరిగి అదే పునాదిమీద కొత్త రాజ్యాలు నిర్మించబడుతూ వచ్చాయి.

ఈ నిరంతర ఘర్షణలో వంకర టింకరమార్గంగుండా తెలుగుజాతి పరిణామం చెందుతూవచ్చింది. బ్రిటిషువారిరాకతో స్వయం సంపూర్ణ ఆర్థికవిధానం నశించి నూతన ఆర్థికపునాది ఏర్పడ్డది. కాని ఆర్థికవిధానంలోని వర్గవైరుధ్యాలు, దోపిడీ నశించ లేదు; సరిగదా మరింత తీవ్రమైనవి.

1917 తో కొత్త ప్రపంచమొకటి ఆవిర్భవించినది. దోపిడీ విధానం లేని వర్గరహిత సమాజం, ప్రపంచంలోని ఆరో భాగమైన రష్యాలో ఏర్పడ్డది. 1949 లో చైనా సైతం పాత ప్రపంచంనుండి విడివడి కొత్తప్రపంచంలో చేరింది. భారతదేశం, ముఖ్యంగా ఆంధ్ర దేశం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకొరకు పోరాడుతున్నది. ఆంధ్ర రాష్ట్రం పునాదిగా విశాలాంధ్ర స్థాపనకు తెలుగుప్రజలు పురోగమిస్తున్నారు. ~~అక్టోబరు 3.~~

1956. నవంబరు 3న విశాలాంధ్ర ఏర్పడ్డది!

1956.

[illegible]
6-11-56

197

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 7 | రక్తికులి | రక్తికుల |
| 6 | 16 | వున్నది | ఉన్నదట |
| 7 | 10 | సానిక | స్థానిక |
| 7 | 15 | పండి | పండితు |
| 8 | 11 | అత | అతి |
| 11 | 24 | వైతాన | భరుకచ్ఛ |
| 21 | 9 | స్థూపం | స్తూపం |
| 21 | 15 | నాగార్జుని | నాగార్జున |
| 21 | 21 | బడ్దది | బద్దది |
| 25 | 14 | స్వల్పమే | స్వల్పకాలమే |
| 30 | 1 | గుంటూరులో | గుంటూరు జిల్లాలో |
| 30 | 17 | పేరు | పేర్లు |
| 32 | 3 | ఋషికన్య | ఋషికుల్య |
| 33 | 2 | వీరు | పల్లవులు |
| 34 | 10 | ఆర్గామాల | ఆరామాల |
| 36 | 16 | వ్యాఘ్రరాజు | వ్యాఘ్రరాజు |
| 36 | 17 | కొత్తరు | కొత్తూరు |
| 37 | 2 | కిమోంజహార్ | కియోంజహార్ |
| 37 | 3 | మయూర్ భక్సి | మయూర్ భంజ్ |
| 37 | 15 | సంస్కృతి | సంస్కృత |
| 38 | 1 | భారతి | భారవి |
| 43 | 4 | సుపుయొగవతి | సుప్రయోగవతి |
| 44 | 13 | చికకాకి | చికాకోల్ |
| 45 | 7 | ఒక వారంలో | పరివారంతో |
| 58 | 15 | దశగా | దిశగా |
| 61 | 1 | రామాయణాల | ఆరామాల |
| 62 | 1 | చోయలు | బోయలు |
| 63 | 18 | చోళత్తుంగకులో | కులోత్తుంగ చోళుడు |
| 65 | 14 | ప | జ |
| 174 | 4 | కది | కలి |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B180 |
| పుస్తకం పేరు | శాతవాహనయుగం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 199 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ii ,198 |
| లేని పేజీలు | 145,146 |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |